

# చైతన్య భగవద్గీత

## అథ దశమోఽధ్యాయః - పదవ అధ్యాయము

## విభూతి యోగః - విభూతి యోగము

### యోగ విభూతియే విభూతి యోగము

***భూతిః*** అంటే అగుట ***(భవనం)***, లేదా ఉనికి ***(సత్తా)*** అని ఒక అర్థము. ఈ అర్థమును అనుసరిస్తే ***విభూతిః*** అంటే, విశిష్టమైన ఉనికి గలది అని అర్థము ***(విశేషేణ భవతీతి విభూతిః)***.

***భూతిః*** అంటే ఐశ్వర్యము అని మరొక అర్థము. ఈ అర్థాన్ని అనుసరించి చూస్తే సర్వ ఐశ్వర్యములకు కారణమైన ఐశ్వర్యము, అంటే విశేషమైన ఐశ్వర్యము ***విభూతిః (సమస్త విభూతీనాం కారణత్వా ద్వా భూతిః విభూతిః)***. సత్తాత్మక మైనది ***భూతి*** కాగా, అది వివిధ రూపాలలో దివ్యంగా భాసించడము ***విభూతి***. ఇదే విశేషమైన ఉనికి.

ఏడవ అధ్యాయం ఏడవ శ్లోకంలో, 'అర్జునా! నా కంటే శ్రేష్ఠమైన వస్తువు మరొకటి లేనే లేదు' అని తన సత్తా స్వరూపాన్ని వర్ణించి చెప్పాడు భగవంతుడు ***(మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ*** - 7 - 7). ఆ వెంటనే ఎనిమిదవ శ్లోకము నుండి 'అర్జునా! నీళ్ళ యందు రసాన్ని నేనే' ***(రసోఽ హమప్సు కౌన్తేయ)*** అంటూ వరుసగా నాలుగు శ్లోకాలలో పద్నాలుగు విభూతులను వివరించాడు. సత్తా మాత్రంగా శోభించే అద్వయ స్వరూపము భూతి. ఆ భూతి వివిధ రూపాలుగా శోభించడము విభూతి. ఒకటి అవ్యక్తం. రెండవది వ్యక్తం. భూతి అవ్యక్తం. విభూతి వ్యక్తం.

తొమ్మిదవ అధ్యాయంలో 'అర్జునా! అవ్యక్త రూపుడ నైన నా చేత ఈ జగత్తు సర్వము వ్యాప్తమై ఉంది' అని తన సత్తా స్వరూపాన్ని నాల్గవ శ్లోకంలో వర్ణించిన భగవంతుడు ***(మయాతత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా)***, ఆ తరువాత పదహారవ శ్లోకము నుండి, 'అర్జునా! నేనే క్రతువును, నేనే యజ్ఞమును' ***(అహం క్రతుః అహం యజ్ఞః)*** అంటూ అక్కడ కూడా వరుసగా నాలుగు శ్లోకాలలో ఇరవై ఎనిమిది విభూతులను వివరించాడు. సర్వ వ్యాపకమైన చైతన్యము భూతి. ఆ చైతన్యమే వివిధ రూపాలలో గోచరించడం విభూతి. ఒకటి అవ్యక్తం. మరొకటి వ్యక్తం. భూతి అవ్యక్తం ***(జగదవ్యక్త మూర్తినా)***. విభూతి వ్యక్తం.

అటు ఏడవ అధ్యాయం లోను, ఇటు తొమ్మిదవ అధ్యాయం లోను జ్ఞాన విజ్ఞాన ప్రసంగమే ప్రధాన మైన విషయంగా ఉండినా, అవాంతర ప్రసంగంగా రెండు అధ్యాయాల లోను విభూతి ప్రస్తావన తెచ్చి ప్రవచించడం జరిగింది. కనుక భగవంతుని తత్త్వము ***(భగవతః తత్త్వం భూతిః సత్తా)***, అలాగే ఈశ్వర విభూతులు ***(విభూతయః)*** ఏడు, తొమ్మిది - ఈ రెండు అధ్యాయాల లోనూ ప్రకాశించాయి ***(ప్రకాశితాః)***. ఈ విధంగా అటు భగవంతుని ఉనికిని ***(సత్తా)***, ఇటు భగవంతుని వైభవమును ***(ఐశ్వర్యం)*** రెండు అధ్యాయాల లోనూ ప్రవచించినా, దానిని గ్రహించడం కష్టంగా ఉన్నందున ***(దుర్విజ్ఞేయత్వాత్)*** మళ్ళీ ఇప్పుడు, ఒక అధ్యాయాన్నే ప్రత్యేకంగా అందుకొరకు కేటాయించి బోధించవలసి వచ్చింది. అదే విభూతి యోగము.

విభూతి యోగము అనేది ఒక పదంగా కనిపిస్తున్నా, అందులో 'విభూతి', 'యోగము' అనే రెండు పదాలు విడివిడిగా ఉన్నాయి.

'యోగః' అంటే భగవంతుడు అని కూడా ఒక అర్థము. ***యోగేన సాధ్యః అవాప్యః యోగః*** - యోగము చేత పొందబడే వాడు కనుక భగవంతుడు 'యోగః' నామధేయుడు. 'విభూతిః' అంటే ఐశ్వర్యము. కనుక ఇది 'యోగ విభూతి'. అంటే, భగవంతుని యొక్క ఐశ్వర్యము. అర్జునా! ***పశ్యమే యోగ మైశ్వరమ్*** - నా భగవదైశ్వర్యమును చూడు అని తొమ్మిదవ అధ్యాయం ఐదవ శ్లోకంలో అర్జునుణ్ణి చూడమన్నాడు. ప్రస్తుతం ఈ అధ్యాయంలో తానే చూపిస్తున్నాడు. కనుక యోగ విభూతియే విభూతి యోగం.

**వ్యక్తా వ్యక్తములు**

అవ్యక్త మూర్తి నైన నా చేత ఈ ప్రపంచం వ్యాప్తమై ఉంది *(9 వ అ - 4 వ శ్లో)* అన్నాడు భగవంతుడు. భగవంతుడు అవ్యక్త స్వరూపుడు. విశ్వము ఆయన వ్యక్త రూపము. ***పాదోऽస్య విశ్వాభూతాని త్రిపాద స్యామృతం దివి*** - ఈ విశ్వమంతా భగవంతుని ఒక్క పాదమే. మూడు పాదాలు విశ్వాతీతంగా ఉన్నాయి అన్నది వేదం. అర్జునా! ఈ విశ్వాన్నంతటిని నేను ఒక్క అంశము చేతనే వ్యాపించి ఉన్నాను అని ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న ఈ విభూతి యోగం లోని చివరి శ్లోకంలో చెబుతాడు. కనుక అవ్యక్తమైన సత్తా స్వరూపము తానే. వ్యక్తమైన జగదైశ్వర్యమూ తానే.

అవ్యక్తమూ తానే. వ్యక్తమూ తానే. వ్యక్తమునకు అవ్యక్తమే ఆధారము. అవ్యక్తము నుండే వ్యక్తం ఆవిర్భవించింది. వ్యక్తానికి పుట్టుక స్థానము పరమేశ్వరుడే. అవ్యక్తమే. అదే ఉత్పత్తి స్థానము. ***అహం సర్వస్య ప్రభవః*** - ఈ సమస్త విశ్వానికి పుట్టుక స్థానము నేనే అని చెప్పిన భగవానుడు, ***మత్తః సర్వం ప్రవర్తతే*** - నా వల్లనే ఈ సమస్త జగత్తు నడుస్తూ ఉంది అంటూ, సృష్టి స్థితులు తన వల్లనే జరుగు తున్నాయని విభూతి యోగం, ఎనిమిదవ శ్లోకంలో చెబుతాడు.

సమస్తానికి పరమేశ్వరుడే కారణం అని తెలిసినా, కార్య రూపంలో వ్యక్తమైన ప్రపంచము పరమేశ్వరుని వల్లనే నడుస్తూ ఉంది అనే భావన స్థిరపడాలి. వ్యక్తమయ్యే ప్రతి రూపము పరమేశ్వరుని స్వరూపంగా బుద్ధికి అందాలి. ఇదే భగవద్భావన. బుద్ధిలో ఇట్టి ఈశ్వర భావన స్థిరపడిన వారు బుధులు. అంటే, పరమార్థ తత్త్వమును క్షుణ్ణంగా అర్థం చేసుకున్న వారు ***(అవగత పరమార్థ తత్త్వాః)***. అట్టి వారే పరమేశ్వరుని భావన యొక్క అభినివేశంతో విభూతి సుందరుని సేవించ గలుగుతారు ***(పరమార్థ తత్త్వాభినివేశః, తేన సమన్వితాః బుధాః మాం సేవన్తే)***. సమస్త జగత్తును భగవ ద్విభూతిగా దర్శించి సేవిస్తారు.

**విభూతి దర్శనం**

విశ్వమంతా విశ్వనాథుని విభూతే అయినా, పరిపక్వత చెందని సాధకుని మనస్సు సమస్తాన్ని భగవ ద్విభూతిగా దర్శించ లేదు. నీళ్ళు భగవ త్స్వరూపము. లేకపోతే, అవి ప్రాణాధార మెలా అవుతాయి? అన్ని నదులలో నీళ్ళు ఉంటాయి. కాని గంగానది మనస్సులో మెదలగానే భావస్పందన కలుగుతుంది. యమున యెదలో కదలగానే ప్రేమ స్ఫురిస్తుంది. అన్ని నదులలో నీళ్ళే ఉంటాయి. అలాగని, ప్రత్యేకతలను, విశేషాలను నిరాకరించ లేము. ప్రారంభ దశలో నికృష్టాల కన్నా ఉత్కృష్టాలే ధ్యానావేశాన్ని కలిగిస్తాయి.

బుద్ధిలో భావాలు కదుల్తాయి. ఏ భావాని కైనా చైతన్యమే ఆధారము. భావంలో ఉన్నది కూడా చైతన్యమే. కొన్ని భావాలు సాత్త్వికంగా ఉంటాయి. కొన్ని రాజసంతో, కొన్ని తామసంతో ఉంటాయి. భావాలన్నీ చైతన్యం నుండే కలుగుతాయి. కాని, ధ్యానయోగికి సాత్త్విక భావాలు ఉపయుక్త మవుతాయే గాని, రాజసిక తామసిక భావాలు కాదు కదా! ప్రారంభ సాధకుని ఉత్కృష్టాలు ఉత్తేజ పరచినట్లు, నికృష్టాలు ఉత్తేజ పరచ లేవు.





**సర్వము సర్వేశ్వరుడే అయినా**
**కృష్ణుడు దైవము - కంసుడు అగునా!**
**ఉన్నతాలలో ప్రథమోపాసన**
**ప్రగతికి సుగతికి ఆధారము**
**విశిష్ట మైనది ఈశ్వర మహిమ**
**విభూతి సుందరుని వైభవము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

ఉత్కృష్ట మైన విభూతులనే భగవానుడు దివ్యమైన విభూతులు అంటున్నాడు. ఏడు, తొమ్మిది అధ్యాయాలలో కొన్ని విభూతులను చెప్పినా, ఎనిమిదవ అధ్యాయంలో మృత్యు విభూతిని ప్రత్యేకంగా ప్రవచించినా, కేవలం ధ్యాన నిమిత్తం దివ్యమైన తన విభూతులను ఈ పదవ అధ్యాయం లోనే అద్భుతంగా ప్రవచిస్తున్నాడు. ***హంత తే కథయిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః*** అర్జునా! దివ్యము లైన నా విభూతులను నీ కొరకు చెబుతున్నాను అంటూ ప్రారంభిస్తాడు. అది కూడా ప్రాధాన్యమును దృష్టిలో ఉంచుకొని ***(ప్రాధాన్యతః)*** చెబుతాడు. ప్రాధాన్యత లెందుకు అంటారా? తన విభూతి విస్తారానికి అంతము లేదు కనుక, అని కూడా తానే చెబుతాడు ***(నాస్త్యంతో విస్తరస్య మే)***.

**విభూతి దర్శనం - భావనా ప్రాధాన్యం**

మార్గంలో నడిచే టప్పుడు మన పాదం క్రింద ఒక దినపత్రిక కాగితం పడింది అని తెలిసినా, అలాగే నడచి ముందుకు వెళ్ళిపోతాం. కాని, అదే ఒక రూపాయి కాగితం పడితే? ఆగి, దానిని తీసికొని కళ్ళ కద్దుకుంటాం. రెండూ కాగితాలే కదా! అంతర మంతా భావం లోనే ఉంది.

పొరపాటున ఏదైనా పుస్తకం మీద పాదం పడితే, వెంటనే చలించి పోతూ, వంగి పుస్తకాన్ని అందుకొని కళ్ళ కద్దుకుంటాం. పుస్తకంలో ఉన్న వన్నీ కూడా కాగితాలే. భావన లోనే ఉంది భాగ్యమంతా! రూపాయి కాగితంలో లక్ష్మిని చూస్తాం. పుస్తకంలో సరస్వతిని దర్శిస్తాం. అన్నీ కాగితాలే. వాటిలో కొన్ని మాత్రం దివ్యములు. ధ్యాన యోగ్యములు. అవే భగవ ద్విభూతులు.

తండ్రి కుమార్తెకు వివాహం చేస్తూ, ఈ ధనం అమ్మాయి పేరిట బ్యాంకులో వేస్తున్నాను. ఈ పొలం అమ్మాయి పేరున వ్రాస్తున్నాను. ఇది అమ్మాయి పసుపు కుంకుమ నిమిత్తం అంటాడు.

తండ్రి ఇచ్చిన లక్షల ఆస్తిని వెచ్చించి పసుపు కుంకుమ కొనుక్కోమని తండ్రి ఉద్దేశ్యం కాదు. కాని, ఆ మాటలలో ఎంత పవిత్రమైన భావముందో మనందరికీ విదితమే. దివ్య మైనది ఏదైనా వస్తు ప్రధానంగా ఉండదు. భావ ప్రధానం గానే ఉంటుంది.

ఆకులు ఎన్నైనా ఉండవచ్చు. తులసి పవిత్రత తులసిదే. అందుకని తులసి దళాన్ని నేరుగా ముక్కు దగ్గరకు ఎవ్వరూ చేర్చుకోరు. ముందుగా కళ్ళ కద్దుకొని, తరువాతే వాసన అయినా, రుచి అయినా. అందుకే తులసి భగవ ద్విభూతి.

కాయ లెన్నైనా ఉండొచ్చు. కాని పూజకు పనికి వచ్చేది కొబ్బరికాయ మాత్రమే. పైన కఠినంగా ఉండి, లోపల మృదువుగా ఉంటుంది. బాహ్య వ్యవహారాలలో ధర్మ నిర్వహణలో కఠినంగా ఉండాలి. ఆంతర్యంలో

భక్తి ప్రేమలు మృదువుగా, మధురంగా, స్నిగ్ధంగా ఉండాలి అని యోగ జ్ఞానాలను సమరసం చేస్తూ బోధిస్తుంది నారికేళం. ఇదంతా భావనే. అందుకే అవన్నీ విభూతులు. ధ్యానయుతాలు. కనుకనే, కర్తవ్య ప్రేమలను ఒడి కట్టుకొని వధువు కొబ్బరికాయ దోసిలిలో పెట్టుకొని అత్తగారింటిలో అడుగు పెడుతుంది.

తొమ్మిది, పది, పదకొండు అధ్యాయాలు పరమేశ్వరుని మన కళ్ళ ముందే కదులు తున్నట్లు చూపిస్తాయి. పూర్వ అధ్యాయాల కన్నా పరమేశ్వరునితో మన సాన్నిహిత్యం ఇక్కడ ప్రత్యక్షంగా ఉంటుంది. భగవద్దర్శనం భవిష్యత్తులో జరిగేది కాదని, నిత్యం జరుగుతూనే ఉంది అనే భావన మనలో దృఢంగా ఏర్పడుతుంది. భావశుద్ధి ఉంటే, ఈశ్వరుడు, ఈశ్వర విభూతి రెండు కావు అనే సత్యం హృదయంలో ఆవిష్కృత మౌతుంది. వ్యక్తావ్యక్తాలు దోబూచు లాడుతూ నేత్రాలకు సర్వమంగళ దర్శనాన్ని ప్రసాదిస్తూ, హృదయాన్ని సర్వేశ్వరానుభూతిలో పరవశింప చేస్తాయి. విభూతి దర్శన మనేది అలౌకిక మైన, అద్భుతమైన అమృతానుభూతి.

**పయసా కమలం కమలేన పయః పయసా కమలేన విభాతి సరః ॥**

జలం కమలానికి ఉనికి నిచ్చి శోభ నిస్తుంది. కమలాల శోభతో జలం రమ్యంగా అలరారుతుంది. జల కమలాల సౌందర్యంతో సరోవరం కళకళ లాడుతుంది.

అవ్యక్తం విభూతుల్ని ఆరబోస్తుంది. వ్యక్తమైన విభూతులు అవ్యక్త వైభవాన్ని దర్శింప చేస్తూ ఉంటాయి. ఈ వ్యక్తావ్యక్తాల సౌందర్యంతో యావద్విశ్వము పరమేశ్వర చైతన్యంతో కళకళ లాడుతుంది.

ఆదిదేవుని ఉనికి వల్ల ఆలయం అద్భుతంగా రూపు దిద్దుకుంటుంది. కళాత్మకమైన ఆలయం తనలో పరమేశ్వరుని దర్శింప చేస్తూ ఉంటుంది. పరమ పవిత్రమైన దేవ దేవాలయాల సన్నిధిలో మన దేవతార్చన దివ్యంగా సాగుతుంది.

ఆత్మ యొక్క సత్తా స్ఫూర్తుల చేత మన దేహేంద్రియ మనోబుద్ధులు చేతన మవుతాయి. చేతన మైన ఈ కార్యకారణ సంఘాతము ***ఆత్మవా అరే ద్రష్టవ్యః*** - 'ఆత్మయే దర్శింప దగినది' అని సూచిస్తూ ఉంటుంది. ఇది అర్థమైన సాధకునికి దేహమే దేవాలయంగా, జీవుడే దేవుడుగా అనుభవానికి అందుతుంది. సోహం భావం ఏర్పడుతుంది. ఇదంతా యోగ విభూతి. విభూతి యోగము. ఇక ఇప్పుడు, ***(అథ ఇదానీం)*** ఏయే ఉత్కృష్ట మైన విషయాలలో, వస్తువులలో, విభూతులలో భగవానుని మనం ధ్యానించాలో ***(యేషు యేషు భావేషు చిన్త్యః భగవాన్)*** ఆయా భావాలను, విభూతులను చెప్పవలసి ఉంది ***(తే తే భావాః వక్తవ్యాః).*** అదే చెబుతున్నాడు. అడగకుండానే బిడ్డకు అమ్మ బువ్వ పెట్టినట్లు, భక్తునికి అమ్మానాన్నలు తానే అయిన భగవానుడు, అడగకుండానే భావ వితరణ చేసేందుకు బోధను ప్రారంభిస్తున్నాడు.

**శ్రీ భగవానువాచ :**

**భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।**
**యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥** 1

***భూయః-ఏవ-మహాబాహో-శృణు-మే-పరమం-వచః***
***యత్-తే-అహం-ప్రీయమాణాయ-వక్ష్యామి-హితకామ్యయా***

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో | = | అర్జునా! | హితకామ్యయా | = | శ్రేయస్సు కోరి |
| ప్రీయమాణాయ | = | ప్రీతి చెందుతున్న | అహం | = | నేను |
| తే | = | నీ కొరకు | యత్ | = | ఏ |





| | | | | | |
|---|---|---|---|---|---|
| వచః | = | వాక్యమును | పరమం | = | ఉత్తమమైన |
| భూయః ఏవ | = | మరల | మే | = | నా యొక్క |
| వక్ష్యామి | = | చెబుతున్నానో | వచః | = | మాటను |
| తత్ | = | ఆ | శృణు | = | విను |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! మహాబాహో! శ్రేష్ఠమైన నా మాటను తృప్తి చెందుతూ వింటున్నావు. నీ శ్రేయస్సు కోరి మళ్ళీ చెబుతున్నా! విను.**

**వ్యాఖ్య**

**పునరుక్తి**

ప్రథమ అధ్యాయ షట్కము 'త్వం' పద స్వరూపమును వర్ణించింది. ఏడవ అధ్యాయం నుండి 'తత్' పదము, అంటే పరమేశ్వరునికి సంబంధించిన 'తత్త్వం' విస్పష్టం చేయబడుతూ ఉంది. ఏడు, ఎనిమిది, తొమ్మిది అధ్యాయాలలో భగవంతుని నిరుపాధిక తత్త్వమును, సోపాధిక స్వరూపమును వివరించడం జరిగింది. నిరుపాధికము జ్ఞానమును విశదం చేస్తూ ఉంటే, సోపాధికము ధ్యానమును వివరిస్తూ సాగింది. ఈ రెండిటికి, అంటే జ్ఞానధ్యానాలకు సాధనోపాయాలుగా విభూతులు కూడా చెప్పబడ్డాయి. ఇవన్నీ జ్ఞాన ప్రసాదాలే కనుక బంధ విముక్తిని కలిగించి హితమును చేకూరుస్తాయి.

తెలియ దగిన విషయం పరమ సూక్ష్మము. అందువల్ల తెలుసుకోవడం చాలా కష్టతరం **(దుర్విజ్ఞేయం).** కనుక అది పదే పదే చెప్పవలసిన విషయంగా ఉంది. అదే పనిగా విన దగిన విషయంగా కూడా ఉంది. విషయ మేమో పారమార్థికం. ఇక ప్రయోజన మంటారా! పరమార్థ సిద్ధిప్రదం. కనుకనే, మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను అంటూ, **భూయః** అనే పదంతో విభూతి యోగాన్ని ప్రవచించడం ప్రారంభించాడు గీతాచార్యుడు. **భూయః** అంటే మళ్ళీ అని అర్థం ***(భూయః ఏవ పునః).***

మళ్ళీ చెబుతున్నాను అంటే పూర్వం చెప్పిన విషయాన్నే చెబుతున్నాడు అని అర్థం. అంటే, ఏడు, ఎనిమిది, తొమ్మిది అధ్యాయాలలో ప్రసంగించిన విషయాన్నే మళ్ళీ చెబుతున్నాడు అని భావం. పూర్వాధ్యాయ త్రయంలో భగవత్తత్త్వము, భగవద్విభూతులు - రెండూ చెప్పబడ్డాయి. వాటినే ఈ అధ్యాయంలో విస్తరించి చెప్పడం జరుగుతూ ఉంది ***(భూయః).*** ఆనందించ దగిన విషయ మయితే అనేక సార్లు విన నవసరం లేదు. అర్థం చేసుకోవలసిన విషయం అయినప్పుడే ఎన్నిసార్లు అయినా వినాలి. అర్థమయ్యే వరకు చెప్పేవాడు మళ్ళీ మళ్ళీ చెబుతూ ఉండాలి. వినే వాళ్ళు మళ్ళీ మళ్ళీ వింటూ ఉండాలి. కథను రెండు సార్లు చెప్ప నవసరం లేదు. తత్త్వము ఒక్కసారి చెబితే సరిపోదు. కనుక, వేదాంత విషయము నందు పునరుక్తి దోషం లేదు.

**శ్రేష్ఠ వాక్యం**

'అర్జునా! శ్రేష్ఠమైన నా మాటను విను' ***(శృణు మే పరమం వచః)*** అంటున్నాడు భగవంతుడు. అవే పరమ వాక్కులు. పరమాత్మకు సంబంధించిన వాక్కులు. దీపం వస్తువును చూపించినట్లు, పరమాత్మ స్వరూపాన్ని ప్రకాశింప చేసే వచనాలు కావడం చేత ఇవి పరమ వాక్కులు. ప్రకృష్టమైన వాక్యాలు. దేనిని ఆలకించిన తరువాత మరొక దానిని వినాలని మనస్సుకు అనిపించదో, వినవలసిన అవసరం కూడా ఉండదో, అదే ప్రకృష్ట వచనము. శ్రేష్ఠ వచనాన్ని శ్రేష్ఠులే విన గలరు. ఉత్కృష్ట వచనాన్ని నికృష్టులు విన లేరు. వినినా అర్థం చేసుకోలేరు.

అందుచేత, అర్జునుని యోగ్యతను దృష్టిలో ఉంచుకొని, 'నేను చెప్పే శ్రేష్ఠ వచనాన్ని విను' ***(శ్రుణు మే పరమం వచః)*** అంటున్నాడు భగవంతుడు. అంతేకాదు. 'మహాబాహో!' అని సంబోధించి అర్జునుని అర్హతను ప్రశంసిస్తున్నాడు కూడా.

బాహువులు జయానికి సంకేతాలు. విజయ సూచకాలు. నేను చెప్పే విశిష్ట విషయాన్ని అర్థం చేసుకోవడంలో నువ్వు విఫలం కావు. విజయం సాధిస్తావు. నువ్వు గొప్ప బాహువులు కలవాడివి. అవి మహా బాహువులు. కేవలం విజయాన్ని సాధించడమే గాక మహాత్ములను భక్తితో సేవించిన మహా బాహువులు. ప్రత్యక్షంగా మహేశ్వరునితో తలపడి విజయ దరహాసంతో పాశుపతాస్త్రమును పరమేశ్వరుని అనుగ్రహంగా పొందిన బాహువులు. పార్థా! కనుకనే, నీకు వినిపిస్తున్నా! విను! ***(శృణు).*** అర్జునా! అర్హుడవు కనుకనే నేను బోధిస్తున్న విషయాన్ని ఎంతో ప్రీతితో, ఉత్సాహంతో వింటున్నావు అని కూడా శ్రీకృష్ణుడు అర్జునునికి కితాబు ఇస్తున్నాడు.

**శ్రవణ మాధుర్యం**

తినేవాడు ప్రీతితో ఆరగిస్తూ ఉంటే పెట్టే వాడికి ఇంకా, ఇంకా పెట్టాలి అనే బుద్ధి పుడుతుంది. వినేవాడు తృప్తి చెంది నపుడే వినిపించే వాడికి సంతృప్తి కలుగుతుంది. అర్జునా! నా మాటల్ని ప్రీతితో వింటున్నావు అంటున్నాడు భగవంతుడు ***(ప్రీయ మాణాయ).*** అర్జునుని ముఖంలో తొణకిస లాడే ఆనందము, పార్థుని కళ్ళ నుండి తొంగి చూచే ఉత్సాహము, జ్ఞాన కిరణ స్పర్శచే విరబూసిన హృదయారవిందము వెదజల్లే ఆనంద సుగంధమును వ్యక్తం చేసే స్మిత వదనము - ఇవన్నీ పార్థుని ప్రీతిని మౌనంగా చెబుతున్నాయి.

ఆదిలో విషాద వదనంతో కుమిలి పోయి కన్నీరు కార్చిన అర్జునునికి, గీత పూర్వార్థము సమాప్త మయ్యే సమయానికి ఆనందం ఉప్పొంగగా కళాత్మకంగా గోచరిస్తున్న విజయునికి ఎంత తేడా! దీనిని కృష్ణుని కన్నా స్పష్టంగా చూడ గలవా రెవరుంటారు? అందుకే ప్రీతితో వింటున్నావు అంటున్నాడు. ప్రీతితో ఆలకించడము అమృతపానం చేయడం లాంటిది అన్నారు భాష్యంలో ఆచార్యులు ***(ప్రీయమాణాయ, మద్వచనాత్ ప్రీయసే త్వం అతీవ అమృత మివ పిబన్).*** అమృతపానం చేసినట్లు అర్జునుడు బోధను ఆస్వాదిస్తున్నాడు కనుకనే, శ్రీకృష్ణుడు మళ్ళీ మళ్ళీ ఆనందంతో చెబుతున్నాడు. అదే మన సంప్రదాయంలో ఆచార్య హృదయ మంటే. ఉపనిషత్ప్రబోధ మంటే అదే. సందేహం కలిగి, విన్న విషయాన్ని మళ్ళీ చెప్పమని అడిగితే, నీకు ఎన్నిసార్లు చెప్పాలి? అని విసుక్కుంటాడు ఉపాధ్యాయుడు. కాని, ఉపనిషత్తు అలా కాదు. ఎన్ని సార్లైనా చెబుతుంది. నీకు అర్థమయ్యే వరకు చెబుతుంది. అదే ఉపనిష ద్వైభవము. ఉపనిషత్తుల లోని ఆత్మవిద్యను అందించే ఆచార్యుని హృదయ సౌందర్యము.

వ్యాధి నయ మవుతూ ఉంటే రోగికి వైద్యుడిపై, అతని వైద్యంపై విశ్వాసము, ప్రేమ వృద్ధి చెందుతూ ఉంటాయి. అలాగే రోగి ఆరోగ్యాన్ని పొందుతూ ఉంటే, శ్రమించి వైద్యం చేసిన వైద్యునికి తృప్తి, ఆనందము కలుగుతూ ఉంటాయి.

అర్హత కలిగి శ్రవణం చేయడం చేత, బోధ సాగే కొద్ది అర్జునునిలో ఆనందం పెరుగుతూ ఉంది. అర్జునునిలో వ్యక్తమయ్యే తృప్తిని ప్రత్యక్షంగా దర్శిస్తున్న గీతాచార్యునిలో హితేచ్ఛ అధిక మవుతూ ఉంది. అందుచేతనే, అర్జునా! నీకు హితం చేయాలనే కోరికతో చెబుతున్నాను అంటున్నాడు భగవంతుడు ***(తతః వక్ష్యామి హిత కామ్యయా హితేచ్ఛయా).*** శ్రవణ సాధకులకు అర్జునుడే పరమాదర్శము. శ్రవణం అనేది అమృత పానం చేసినట్లు ఉండాలే గాని, ఆముదం త్రాగినట్లు ఉండకూడదు. శిష్యుడికి బోధ యందు ప్రీతి ఉండాలి. బోధకుని యందు భక్తి ఉండాలి.





**హితబోధ**

ఆత్మీయులు మన సుఖం కోరుతారు. కాని ఆచార్యుడు మన హితం కోరుతాడు. సుఖాలు అనిత్యాలు. అవి రాకపోకలతో ఉంటాయి. హితం అనేది నిత్యసుఖం. అది వచ్చి ఉండేదే గాని వచ్చి పోయేది కాదు. అదే ఆత్మసుఖం. ఆత్మానందం. మోక్షానందం. నిత్యమోక్షం. సర్వులకు, సర్వ కాలాలకు, సమస్త లోకాలకు మేలు చేసేది హితం. అదే మోక్షం. మోక్షార్థం చేసే బోధ హితబోధ.

సదాత్మక మైన భగవంతుని తత్త్వమును ***(భూతిః)*** గ్రహించడమే హితము. హితమును బోధించే వాక్యమే హిత వచనము. అదే మహావాక్యము. బ్రహ్మాత్మ జ్ఞానమును ప్రసాదించే 'తత్త్వమసి' మహావాక్యము.

భగవ త్తత్త్వమును గ్రహించడానికి ఉపకరించే ఐశ్వర్య దర్శనమే విభూతి ***(విభూతిః).*** తత్త్వమును గ్రహించడానికి సహకరించే విభూతిని దర్శింప చేసి, విభూతి దర్శనము ద్వారా విభూతి సుందరుడైన పరమేశ్వరుని సద్రూప చైతన్యము యొక్క అనుభూతిని కలిగించడమే తత్త్వావగాహన ఫలం. తత్త్వ జ్ఞానం ప్రసాదించే మోక్షఫలం.

**హితకారిణి**

హితము అనేది మోక్షము అని తెలుసుకున్నాం. మోక్షము జీవుల గమ్యము. గమ్యమును చేర్చే హితబోధ మార్గమును కూడా మంగళకరంగా, మహనీయంగా తీర్చి దిద్దుతుంది. కనుక సాధ్యమును అలా ఉంచితే, సాధనలో సాధకునికి ఎంతగానో ఉపకరించే ఈ యోగవిభూతి సోపానక్రమంగా ముముక్షువును మోక్ష సౌధం వైపుకు నడిపిస్తుంది.

తేజములో గాని, బలంలో గాని, జ్ఞానంలో గాని, కళలో గాని, - ఎక్కడ ఏ విధమైన ఔన్నత్యము గోచరించినా, దానిని ఈశ్వర వైభవముగా వీక్షించే అలౌకిక దృష్టిని విభూతి ప్రసాదిస్తుంది. ఈ విధమైన ఈశ్వర వైభవ భావన సాధకుని లోని అహం భావనను, అహంకారమును అదృశ్యం చేస్తుంది. అంతా ఈశ్వర వైభవ మైనపుడు, నా దంటూ ప్రత్యేకంగా ఏముంది? నా నుండి వ్యక్తమయ్యే వైభవము పరమేశ్వరుని దైనపుడు, నాలో అహంకారానికి చోటెక్కడుంది? నా నుండి ఏ ఈశ్వర వైభవము వ్యక్త మవుతూ ఉందో, ఇతరులలో వ్యక్తమయ్యే వైభవము కూడా ఆ ఈశ్వర వైభవమే అయినప్పుడు, నాకు ఎవరిపై ఈర్ష్య? ఎవరిపై అసూయ? ఈ విధమైన భావాలతో బుద్ధి వికసిస్తూ విశాలమౌతూ, వినూత్న భగవ ద్భావనలో ఓల లాడుతుంది.

**ఆఖ్యాయిక**

ఒకనాడు ఒక నదీ తీరంలో సాధ్వి రబియాను యోగి హసన్ చూశాడు. అంతే. అతనిలో అహంకారము, గర్వము విజృంభించాయి. వెంటనే తాను ప్రార్థనకై నేలపై పరచుకున్న వస్త్రాన్ని నదీ జలంపై వేసి, దాని మీద కూర్చుని తేలుతూ ఉన్నాడు. రబియా సమీపానికి రాగానే, వెటకారంగా నవ్వుతూ, 'రబియా! రా! ఇక్కడ చల్లగా ఉంది. నువ్వూ కూర్చుని ప్రార్థన చేసుకుందువు గాని!' అన్నాడు హసన్.

రబియా మందహాసాన్ని చిందిస్తూ, 'హసన్! అది నీ బలమని విర్రవీగకు. అది నీ బలం కాదు. బలహీనత. అది వైభవం కాదు, వికారము. చివరికి ప్రపంచ సంతలో వ్యాపారి లాగా ప్రదర్శన లివ్వడానికి సిద్ధ మయ్యావా?' అంటూ ఆమె చేతిలో ఉన్న వస్త్ర ఖండాన్ని గాలి లోకి విసిరింది.

ఆకాశంలో నిలబడి యున్న వస్త్ర ఖండం వద్దకు రబియా ఎగిరి వెళ్ళి, దానిపై ఆసీనురా లైంది. 'హసన్! అక్కడెందుకు? నీళ్ళల్లో తడుస్తాము. ఆ ప్రార్థనేదో ఇక్కడ చేద్దాము, రా! పైగా పై నుంటే, అందరూ చూస్తారు కూడా!' అంది రబియా.

హసన్ సిగ్గుతో తల దించుకున్నాడు. అది ఇష్టపడని రబియా, తన సహజ ప్రేమను చిందిస్తూ, 'చూడు హసన్! నువ్వు చేసిన ఆ వైభవాన్ని చేప కూడా చేసి చూపుతుంది. ఇక నేను చేసింది అంటావా, పక్షి అవసరం లేదు, పురుగు కూడా ఈ మాత్రం ఎత్తుకు ఎగురుతుంది. అసలైన వైభవము ఈ రెండిటి లోను లేదు. అదేమిటో తెలిసి సాధించుకోవాలి' అంది రబియా. ఆమె హిత వచనాలతో హసన్‌లో గొప్ప పరివర్తన చోటు చేసుకుంటుంది.

ఈశ్వర విభూతి అర్థమైతే, ఆ తరువాత మన బుద్ధిలో కలిగే, మన బుద్ధి నుండి కదిలే ప్రతి భావన ఈశ్వర వైభవ కిరణంగా ప్రకాశిస్తుంది. కారణం, ఈశ్వర వైభవాన్ని సాక్షాత్తు ఈశ్వరుడే వర్ణిస్తూ ఉన్నాడు కనుక.

ప్రబోధించబడే విషయం భగవత్తత్త్వం. వ్యక్తమయ్యే ఐశ్వర్యం భగవద్విభూతి. ఈ రెండిటిని చెప్పే మాటలు ఈశ్వరునివి *(మే పరమం వచః).* అంతా విభూతియే.

*ఇది అన్యులకు సాధ్యం కానిది. అచ్యుతునికే సాధ్య మయ్యేది. చదవండి.*

**న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।**
**అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥** 2

*న-మే-విదుః-సురగణాః-ప్రభవం-న-మహర్షయః*
*అహం-ఆదిః-హి-దేవానాం-మహర్షీణాం-చ-సర్వశః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| మే | = | నా యొక్క | అహం | = | నేను |
| ప్రభవం | = | పుట్టుకను | దేవానాం | = | దేవతలకు |
| సురగణాః | = | దేవతా సమూహములు | మహర్షీణాం చ | = | మహర్షులకును |
| న విదుః | = | ఎరుగరు | సర్వశః | = | సర్వ విధముల |
| మహర్షయః | = | మహర్షులు | ఆదిః హి | = | మూల కారణమును గదా! |
| న | = | ఎరుగరు | | | |

**అర్జునా! నా పుట్టుక దేవతలకు తెలియదు. మహర్షులు ఎరుగరు. ఎలా చూచినా, దేవతలకు, మహర్షులకు ఆది కారణం నేనే కదా!**

### వ్యాఖ్య

భగవదైశ్వర్యము లేదా భగవద్విభూతి అనేది జ్ఞాన సంపన్న మైనది. సర్వ జ్ఞాన సంశోభితమైన విభూతి జ్ఞానమును జ్ఞానశక్తి కలవారే గుర్తించ గలరు. గ్రహించ గలరు. సృష్టిలో అధమ జన్మలు జ్ఞానార్హులు కారు. క్రిమికీటకాదులు, రాక్షసులు జ్ఞానమును పొందలేరు. జ్ఞానమును పొందే అవకాశము మధ్యమ, ఉత్తమ జన్మలైన మానవ, దేవతా గణాలకే ఉంది.

మానవులలో కూడా జ్ఞాన ప్రధానులైన మహర్షులు శ్రేష్ఠులు. అలాగే ఉత్తమ జన్మలైన వారిలో దేవతలు శ్రేష్ఠులు. మానవ లోక ప్రతినిధులుగా మహర్షులను, సురలోక ప్రతినిధులుగా దేవతలను ఎన్నుకొని, పరమేశ్వరునికి సంబంధించిన విభూతి జ్ఞానము పూర్ణంగా భగవంతునికే తెలుసు అనే విషయాన్ని నిర్ధారణ చేస్తున్నాడు.

## ఎరుగరు సురులు

అర్జునా! నా ప్రభవమును దేవతలు ఎరుగరు *(న మే విదుః సురగణాః ప్రభవం).* ఇక్కడ ప్రభవం అంటే,





పుట్టుక, లేదా ఉత్పత్తి అని ఒక అర్థము. ప్రభావము, లేదా వైభవము అని మరొక అర్థము **(మమ ప్రభావం ప్రభావం ప్రభశక్తి అతిశయమ్, అథవా ప్రభవం ఉత్పత్తిం).** ఈ రెండు కూడా దేవతలు ఎరుగరు. దేవతలు అంటే బ్రహ్మాది దేవతలు అని అర్థము **(బ్రహ్మాదయః).**

బ్రహ్మ ఇంద్రాదులు దివ్యశక్తి సంపన్నులు. దివ్య జ్ఞానయుతులు. సృష్టికి బ్రహ్మదేవుడు కారణము. కాని బ్రహ్మదేవునికి కారణమైన వాడు భగవంతుడు. భగవంతుని నుండే చతుర్ముఖ బ్రహ్మ ఆవిర్భవించాడు. తనకు కారణమైన భగవంతుని బ్రహ్మదేవుడు పూర్ణంగా ఎలా తెలుసుకుంటాడు? అలాగే దేవత లందరూను.

**తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః**

దేవత లందరు పరమేశ్వరుని నుండే ఆవిర్భవించారు. దివ్య శక్తి యుక్తులను దేవతలకు ప్రసాదించింది తానే. భగవంతుని కారణం గానే వారికి వైభవం ప్రాప్తించింది. తమకు వైభవాన్ని అనుగ్రహించిన వాని ప్రభవాన్ని దేవతలు ఎలా తెలుసుకుంటారు? తండ్రి కారణంగా ఉద్భవించిన బిడ్డ తండ్రి ప్రభవమును ఎలా తెలియడో, అలాగే దేవతలు తమకు కారణమైన భగవంతుని పూర్ణంగా తెలుసుకో లేరు. కనుకనే, నా ప్రభవమును బ్రహ్మాది సురులు తెలుసుకో లేరు అంటున్నాడు **(న మే విదుః, మమ ప్రభవం న జానన్తి సురగణాః బ్రహ్మాదయః).** బ్రహ్మాది దేవతలు వైభవ సంపన్నులే అయినా, తమ ప్రభవానికి కారణమైన ఆదిదేవుని ప్రభవమును తెలుసుకొనే టంతటి శక్తి సంపన్నులు మాత్రం కారు.

## తండ్రీ తనయులు

భాగవతంలో ఒక రమణీయ మైన ఘట్టము ఉంది. ఒకనాడు నారద మహర్షి తన సందేహాన్ని నివృత్తి చేసుకోవాలని బ్రహ్మదేవుని వద్దకు వెళతాడు.

'తండ్రీ! వాణీశ్వరా! జగత్సర్గాను సంధాయివి! వేదాలన్నీ నీ ముఖాంబుజము నందే శోభిస్తున్నాయి. ఈ సృష్టికి హేతు వేమిటి? ఈ సృష్టి జ్ఞాన మంతా నీదేనా? లేక, మరెవ్వరైనా నీకు అనుగ్రహించారా? ***(ప్రారంభాది వివేక మెవ్వ డొసంగు? బ్రారంభ సంపత్తి కాధారం బెయ్యది? యేమి హేతువు?).*** ఈ సృష్టి కార్యానికి ఏమి ప్రయోజనం? దీని స్వరూప మేమిటి? నా వరకు నేను ఈ సృష్టికి నువ్వే కారణ మని అనుకుంటున్నా! లేక నిన్ను మించిన దేవుడు మరొక డున్నాడా? ఏది నిజమో చెప్పు తండ్రీ! నా సందేహాన్ని పోగొట్టు ***(యథార్థం బే స్వరూపంబు?... నాకుం జూడగ నీవు రాజువను చున్నాడన్ యదార్థ స్థితిన్ నీ కంటెన్ ఘను డొక్క రాజు గలడో?.. నిక్కంబు భాషింపుమా!... ఓ జనక! నా సందేహముం బాపవే!...*** పోతన భాగవతము) అని బ్రహ్మ మానస పుత్రుడైన నారద మహర్షి సరస్వతీ పతిని ప్రశ్నించాడు. నారద మహర్షి అడిగిన ప్రశ్నకు బ్రహ్మదేవుడు ఎంతగానో సంతోషించి, సమాధానం చెబుతాడు.

***క॥ రారా బుధులు! విరక్తులు గారా! యారీతి నడుగ నేరరు వి***
***స్మే రావహము భవన్మత మౌరా ! నా విభుని మర్మ మడిగితి వత్సా!***

'నాయనా! కుమారా! ఎందరో జ్ఞానులు నా వద్దకు వస్తూ ఉంటారు. వాళ్ళు కూడా నీ లాగా వైరాగ్య సంపన్నులే అయినా, నీ లాగా ఎవ్వరూ ప్రశ్నించ లేదు. నాకు చాలా సంతోషంగా ఉంది. ఆశ్చర్య మేమిటంటే, నా తండ్రి రహస్యాన్ని నువ్వు మీ తండ్రిని అడగటమే' అంటూ సమాధానం చెబుతాడు బ్రహ్మదేవుడు.

'వత్సా! నారదా! ఈ చరాచర ప్రపంచాన్ని నా అంతట నేను సృష్టించలేక , జ్ఞానము చాలక తపన పడుతూ ఉన్నప్పుడు, సృష్టి నిర్మాణానికి కావలసిన జ్ఞానాన్ని నా ప్రభువు ఎంతో ఔదార్యంతో నాకు

అనుగ్రహించాడు. ఆ పరమేశ్వరుని ఆజ్ఞ లేకపోతే, ఈ లోకాలను నిర్మించే శక్తి నా కెక్కడిది? అంతా భగవదనుగ్రహమే'.

శా॥ *నానాస్థావర జంగమ ప్రకరముల్ నాయంత నిర్మింప వి*
*జ్ఞానం బేమియు లేక తొట్రు పడ నిచ్చన్ నాకు సర్వాను సం*
*ధానారంభ విచక్షణత్వము మహోదారంబుగా నిచ్చె ము*
*న్నే నా యీశ్వరు నాజ్ఞ గాక జగముల్ నిర్మింప శక్తుండనే?* - అని పోతనామాత్యుని ఆంధ్ర భాగవతము. తనకు అర్థం గాక కుమారుడైన నారదుడు తండ్రి యైన బ్రహ్మదేవుని ప్రశ్నిస్తే, విషయం తన తండ్రికి సంబంధించింది కావడం చేత, తనకూ తెలియదని చతుర్ముఖ బ్రహ్మ చేతు లెత్తేశాడు.

### మహర్షులూ ఎరుగరు

బ్రహ్మాది దేవతలు ప్రభువు ప్రాభవాన్ని ఎలా ఎరుగ లేరో, అలాగే భృగ్వాది మహర్షులు కూడా తెలుసుకోలేరు **(నాపి మహర్షయః భృగ్వాదయః విదుః జానన్తి).** ఋషులు తపశ్శక్తి సంపన్నులు. జ్ఞానసిద్ధులు. ఇక్కడ ఋషులు అనకుండా మహర్షులు అనడం చేత, గొప్ప ప్రాభవము గల ఋషులు అని అర్థము **(మహాన్ చ అసౌ ఋషిః).** మంత్రద్రష్ట లైన మహర్షులకు కూడా అర్థం గాని విషయము భగవ ద్విభూతి.

ఇక్కడ ఒక్క సంశయం తలెత్తుతుంది. బ్రహ్మాది దేవతలకు, భృగ్వాది మహర్షులకు కూడా తెలియదు అన్నప్పుడు, ఇక బ్రహ్మజ్ఞాన ఫల మేమిటి? బ్రహ్మజ్ఞానులకు సర్వజ్ఞత్వము లేనట్లేనా? అనే సందేహం కలుగుతుంది. ఇది చాలా సూక్ష్మమైన, ఆసక్తికర మైన, జాగ్రత్తగా అర్థం చేసుకోవలసిన విషయం.

బ్రహ్మ జ్ఞానము అంటే, బ్రహ్మాత్మ జ్ఞానము. ఈ ఆత్మయే బ్రహ్మము అనే జ్ఞానము. ఇది అద్వైత జ్ఞానము. రెండవది తెలియని పూర్ణ జ్ఞానము.

అలాంటి జ్ఞానులను మన దేశ సరిహద్దులలో ఎంత మంది సైనికు లున్నారో చెప్పండి అంటే చెబుతారా? చెప్పలేరు. అది వారికి సాధ్యం కాదు. నిద్ర నుండి మేల్కొన్న వానిని వాడు కలలో చూచిన చెట్టులో ఎన్ని ఆకు లున్నాయో చెప్పమంటే చెబుతాడా? ఇదీ అంతే.

స్వప్న జగత్తు సత్యం కాదు కనుక, సత్య దర్శనం అయిన వాడు సత్యం గాని దానికి సంబంధించిన వివరాలను చెప్పలేడు. అంతమాత్రాన అతనికి సర్వ జ్ఞానము లేదు అనడానికి వీల్లేదు. సర్వము అంటే సత్యమే కనుక, జ్ఞానిలో అద్వయమైన సత్య జ్ఞానము ఉంటుందే గాని భిన్నమైన అనిత్య జ్ఞానాలకు సంబంధించిన ఎరుక ఉండదు.

కాని, ఆశ్చర్య మేమిటంటే, సర్వ జ్ఞానము కలిగిన జ్ఞాని చెప్పలేని సమాధానమును సర్వేశ్వరుడు చెప్పగలడు. ఎందుకో తెలుసా? సత్యం గాని మిథ్య కూడా పరమేశ్వరునికి దూరంగా లేదు. మాయ కూడా బ్రహ్మమునే ఆశ్రయించుకొని ఉంది. అందుచేత, తాను మాయ కాకపోయినా, తన నాశ్రయించుకొని ఉన్న మాయను మహేశ్వరు డొక్కడే చెప్పగలడు. అలాంటి వాణ్ణి దివ్య శక్తి గల దేవతలు ఎలా తెలుసుకుంటారు? తపశ్శక్తి గల సిద్ధులు ఎలా గ్రహిస్తారు? ఆదిదేవుని ఆది ఎవరికి దొరుకుతుంది? కనుకనే, తన విభూతి వైభవాన్ని తానే వివరిస్తున్నాడు. రాబోయే అధ్యాయాలలో ఈ విషయాలన్నీ ఇంకా ఎంత గానో విస్తరిస్తాయి.

*సరే, బాగుంది. ఇంతగా శ్రమించి ఈ విభూతులను తెలుసుకొని సాధించే దేమిటి? చెబుతున్నాడు.*

**యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।** 3
**అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥**





**యః-మాం-అజం-అనాదిం-చ-వేత్తి-లోకమహేశ్వరం**
**అసమ్మూఢః-సః-మర్త్యేషు-సర్వపాపైః-ప్రముచ్యతే**

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు | సః | = వాడు |
| అజం | = పుట్టుక లేని వానిని | మర్త్యేషు | = మానవుల యందు |
| అనాదిం | = ఆది లేని వానిని | అసమ్మూఢః | = అజ్ఞానము లేనివాడై |
| లోకమహేశ్వరం చ | = లోకనియంతను అగు | సర్వపాపైః | = సమస్త పాపముల నుండి |
| మాం | = నన్ను | ప్రముచ్యతే | = విముక్తు డవుతున్నాడు |
| వేత్తి | = తెలుసుకుంటున్నాడో | | |

**నేను పుట్టుక లేని వాణ్ణి. ఆది లేని వాణ్ణి. సర్వ లోకాలకు నేనే ప్రభువును. ఇలా నన్ను ఎవడు తెలుసుకుంటాడో, వాడు సమ్మోహం లేని వాడు. సర్వ పాపాల నుండి విడి పడతాడు.**

**వ్యాఖ్య**

### అజమ్ - అనాదిమ్

బ్రహ్మాది దేవతలకు, భృగ్వాది మహర్షులకు కూడా భగవంతుడే ఆది అని పూర్వ శ్లోకంలో తెలుసుకున్నాం. 'ఆది' అంటే కారణ మని అర్థము **(అహం ఆదిః కారణం హి యస్మాత్).** సర్వ కారణమైన పరమేశ్వరునికి మరొక కారణం ఉండేందుకు అవకాశం లేనందున భగవంతుడు అజుడు. అంటే, పుట్టుక లేనివాడు.

***న తస్య కశ్చి జ్జనితా న చాధిపః*** - భగవంతునికి తండ్రి లేడు; అధిపతి కూడా లేడు. అందుచేత ఆయన పుట్టుక లేని వాడు. కనుక అజుడు. ఆది లేని వాడు. అంటే తనకు మరొక కారణం లేని వాడు **(న మమ అన్యః ఆదిః విద్యతే).** ఆది లేని వాడు అంటే అనాది అని అర్థం.

పుట్టుక లేని వాడు అనినా **(అజమ్),** ఆది లేని వాడు, అనగా అనాది అనినా **(అనాదిం),** రెండూ ఒక్కటే కదా! అలాంటప్పుడు 'అజ', 'అనాది' అని రెండు పదాలు ఎందుకు ప్రయోగించినట్లు?

సర్వులకు తానే కారణం కావడం చేత పరమేశ్వరుడు 'సర్వాది'గా పూర్వ శ్లోకంలో అర్థ మయ్యాడు. సర్వుల పుట్టుకకు కారణమైన తాను, పుట్టుక లేని వాడు కనుక అజుడు.

అనాది అంటే ఆది లేని వాడు. అంటే తన పుట్టుకకు మరొక కారణం లేని వాడు. ఎందుకని? తాను అజుడు కనుక. ఎందుకని అజుడు? అనాది కనుక అజుడు. అంటే అజత్వానికి కారణం అనాదిత్వం. అనాదిత్వం అజత్వానికి హేతువు **(అనాదిత్వమ్ అజత్వే హేతుః)** అని చెప్పడం కోసం, రెండు పదాలు సమానార్థకాలే అయినా, రెండుగా చెప్పవలసి వచ్చింది.

### అతివ్యాప్తి దోషం

పరమేశ్వరుడు పుట్టుక లేని వాడు. అజుడు. అలాగే ఆది లేని వాడు. అనాది. బాగుంది. అలాంటప్పుడు భగవంతునికి చెప్పబడిన ఈ రెండు లక్షణాలు మరెవరిలో నైనా ఉన్నాయా? ఉండేందుకు అవకాశం లేదు. ఎందుకని? అలా ఉంటే, మరొక భగవంతుడు కూడా ఉన్నాడు అని అర్థము. ఇద్దరు భగవాన్లు ఉంటే, ఆ ఇరువురిలో ఎవడూ భగవంతుడు కాకుండా పోతాడు. భగవంతుడు అనంతుడు. రెండు అనంతాలు ఉండలేవు. కనుక, ఇద్దరు భగవాన్లు ఉండలేరు.

కాదు, ఉండొచ్చు. ఎలా? ఈ రెండు లక్షణాలు మరొక చోట ఉన్నాయి కనుక. ఎక్కడ? ఏమిటది?

అదే ***శశ విషాణము.*** శశవిషాణము అంటే, కుందేటి కొమ్ము. ఈ మాట మన అనుభవంలో ఉందా, లేదా? ఉంది. కుందేటి కొమ్ముకు కారణం ఎవరు? అది ఎప్పటి నుండి ఉంది? కుందేటి కొమ్మును ఎవ్వరూ ప్రసవించ లేదు, కనుక అది అజము. ఎప్పటి నుండి ఉంది? 'కుందేటి కొమ్ము' అనే పదము తెలిసిన దెప్పుడో అంతకు పూర్వము ఎప్పటి నుండో ఉంది.

ఏమిటి ఈ గందరగోళం అనుకుంటున్నారా? కుందేలు ఉంది. కొమ్ము ఉంది. కాని కుందేటికి కొమ్ము లేదు. కనుక కుందేటి కొమ్ము అనేది విన పడేదే గాని కనపడేది కాదు. కాబట్టి అది లేనిదే. లేనిది ఎలా పుడుతుంది? కనుక అజము.

పుట్టని కుందేటి కొమ్ము ***(అజం)*** ఎప్పటి నుండి ఉంది? ఎప్పటి నుండో ఉంది. కుందేటి కొమ్ము లేదు అని ఎప్పుడు తెలిసిందో, అంతకు ముందు ఎప్పటి నుండో 'కుందేటి కొమ్ము లేదు' అనేది ఉంది ***(శశ విషాణ అభావః అస్తి).*** కనుక ఆ 'లేదు' అనేది అనాదిగా ఉంది. ఈ విధంగా ***అజం, అనాదిం*** అనే రెండు లక్షణాలు శశ విషాణానికి కూడా ఉన్నందున, శశవిషాణం కూడా భగవంతుడు కావాలి. లేదా ఆ రెండు లక్షణాలున్న వాడు భగవంతుడు అయ్యేందుకు అవకాశము లేదు. ఈ అనర్థమే అతివ్యాప్తి దోషం. ఒక దాని లక్షణాలు మరొక దానిలో ఉండటమే అతివ్యాప్తి దోషం. ఈ దోషమును నిరాకరించడానికి పరమేశ్వరుని లోక మహేశ్వరునిగా చెప్పడం జరుగుతూ ఉంది.

**లోకేశ్వరుడు**

***అజం, అనాదిం -*** ఈ రెండు లక్షణాలే కాక ఆయన లోకమహేశ్వరుడు. లోకాలను సృజించిన గొప్ప ప్రభువు ***(లోకానాం మహాన్తం ఈశ్వరం).*** ఈ లక్షణము, అనగా సర్వ లోకాలకు అధిపతిగా ఉండే లక్షణం, అసలు అస్తిత్వమే లేని కుందేటి కొమ్ముకు ఉండే అవకాశం లేనందున అతివ్యాప్తి దోషం నిరవారింప బడింది.

***య ఈశః అస్య జగతో నిత్య మేవ -*** ఈ ప్రపంచానికి ఈశ్వరుడు కావడం చేత ***(అజం, అనాదిం*** అని కీర్తింపబడిన) లోకేశ్వరుడు నిత్యుడు. అట్టి నిత్యుడైన పరమేశ్వరుని ఎవడు తెలుసుకుంటాడో అట్టి వాడు అసంమూఢుడు ***(సంమోహ వర్జితః).*** అంటే సమ్మోహము లేని వాడు. ఇక్కడ 'మోహం' అనకుండా 'సమ్మోహం' అంటూ ఉపసర్గను ప్రయోగించి చెప్పడం వల్ల దీనిని కాస్త విశ్లేషించి అర్థం చేసుకోవాలి.

**సమ్మోహ వర్జితుడు**

మోహము అంటే అవివేకము. బుద్ధి లోని అవివేకమే మోహము ***(మోహః అవివేక బుద్ధిః).*** ఉన్నది తెలియక పోవడం వల్ల ఉన్న దానిని లేనట్లుగా, లేని దానిని ఉన్నట్లుగా చూచే బుద్ధియే అవివేక బుద్ధి. అదే మోహము. అజ్ఞాన రూపము. అగ్రహణ స్థితి.

ఉన్నది తెలియక పోవడ మనే అగ్రహణ స్థితి మోహ మైతే, విపరీతంగా తెలియడ మనే అన్యథా గ్రహణ స్థితియే సమ్మోహము. కనుక, ఇక్కడ మోహము అజ్ఞాన మైతే, సమ్మోహము భ్రాంతి. మోహానికి అజ్ఞానము కారణ మైతే, సమ్మోహానికి మోహమే కారణము. గీతను సమాప్తం చేసిన తరువాత, బోధ ఫలించిందా లేదా అనే విషయాన్ని నిర్ధారణ చేసుకోవడానికి శ్రీకృష్ణుడు అర్జునుని ఈ అజ్ఞాన సమ్మోహాలను గూర్చిన ప్రశ్నసే సంధించాడు. అర్జునా! అజ్ఞానము వలన కలిగిన సమ్మోహము నశించిందా? ***(కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ)*** అని ప్రశ్నించాడు.

అజుడు, అనాది రూపుడు, లోక మహేశ్వరుడు అయిన పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానము ఎవడికి స్పష్టంగా కలుగుతూ ఉందో, వాడు సర్వ పాపాల నుండి విముక్తు డవుతున్నాడు.





**సర్వ పాప విముక్తుడు**

పరమాత్మ జ్ఞానము కలిగి సమ్మోహమును పోగొట్టుకున్న వాడు సర్వ పాపముల నుండి విడిపడు తున్నాడు. విముక్తు డవుతున్నాడు ***(సర్వ పాపైః ప్రముచ్యతే).*** ***ముచ్యతే*** అంటే విడిపడటము. ***మోక్ష్యసే*** అని అర్థము. మోహ క్షయము లేదా మోహము నుండి విడిపడటమే మోక్షము. ఇక్కడ ***ముచ్యతే*** అనకుండా ***ప్రముచ్యతే*** అనడం జరిగింది. సమ్మోహము నుండి విడిపడటము చేత 'ప్ర' అనే ఉపసర్గను చేర్చి 'ప్రముచ్యతే' అనడం జరిగింది. సర్వ పాపముల నుండి విడిపడటము అంటే, తెలిసి చేసినవి, తెలియక చేసినవి అయిన సర్వ పాపముల నుండి విముక్తి ***(సర్వ పాపైః సర్వైః పాపైః మతి పూర్వ అమతి పూర్వ కృతైః ప్రముచ్యతే).*** తెలిసి చేసినా, తెలియక చేసినా పాపం పాపమే. పరమేశ్వర జ్ఞానం చేత సమ్మోహమును పోగొట్టుకున్న వాడు సర్వ పాప విముక్తు డవుతాడు. ఇదే పరమేశ్వరుని తెలుసుకోవడం వల్ల కలిగే ప్రయోజనము. ఈ సందర్భములో పాపమును పుణ్యానికి ఉపలక్షణంగా గ్రహించాలి. పుణ్య పాపాలను అధిగమిస్తేనే బ్రహ్మ జ్ఞానం కలుగుతుంది.

*తాను సర్వలోక మహేశ్వరుడు అనడానికి హేతువును చెబుతున్నాడు.*

బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥ 4

*బుద్ధిః-జ్ఞానం-అసమ్మోహః-క్షమా-సత్యం-దమః-శమః*
*సుఖం-దుఃఖం-భవః-అభావః-భయం-చ-అభయం-ఏవ-చ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| బుద్ధిః | = | నిశ్చయ జ్ఞానము | సుఖం | = | సుఖము |
| జ్ఞానం | = | తత్త్వ జ్ఞానము | దుఃఖం | = | దుఃఖము |
| అసమ్మోహః | = | అప్రమత్తత | భవః | = | ఉండుట |
| క్షమా | = | సహనము | అభావః | = | లేకపోవుట |
| సత్యం | = | సత్యము | భయం చ | = | భయమును |
| దమః | = | బాహ్యేంద్రియ నిగ్రహము | అభయం ఏవ చ | = | అభయమును |
| శమః | = | అంతరింద్రియ నిగ్రహము | | | |

**బుద్ధి, జ్ఞానము, అసమ్మోహము, క్షమ, సత్యము, దమము, శమము, సుఖము, దుఃఖము, పుట్టుక, వినాశము, భయము, అభయము,**

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః ।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ 5

*అహింసా-సమతా-తుష్టిః-తపః-దానం-యశః-అయశః*
*భవంతి-భావాః-భూతానాం-మత్తః-ఏవ-పృథగ్విధాః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహింసా | = | అహింసయు | అయశః | = | అపకీర్తి |
| సమతా | = | సమతయు | భూతానాం | = | భూతముల యొక్క |
| తుష్టిః | = | తృప్తి | పృథగ్విధాః | = | వివిధములైన |
| తపః | = | తపస్సు | భావాః | = | భావములు |
| దానం | = | దానము | మత్తః ఏవ | = | నా వలననే |
| యశః | = | కీర్తి | భవంతి | = | కలుగుతున్నాయి |

**అహింస, సమత, తృప్తి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి, ఈ విధమైన వేరు వేరు భావాలు నా వల్లనే ప్రాణులకు కలుగు తున్నాయి.**

**వ్యాఖ్య**

ప్రాణులలో అనేక విధాలైన భావాలు ఉంటాయి. వేరు వేరు గుణాలు ఉంటాయి. వీటికి సత్తా స్ఫురణలు పరమాత్మ నుండే కలుగు తుంటాయి. అలా చూచి నపుడు అవన్నీ కూడా విభూతులు గానే గోచరిస్తాయి. చిత్ర విచిత్రమైన భావాలను కదిలించే మనస్సు ఏమిటి? విభూతి కాదా!

శశిసూర్యుల లోని ప్రకాశము తానే *(7 వ అ - 8 వ శ్లో)* అని సూర్యచంద్రులను తన విభూతులుగా భగవంతుడే ప్రకటించుకున్నాడు కదా! మరి మహి లోని ప్రకాశము తన విభూతి అయినప్పుడు, మనస్సు లోని ప్రభావము తన విభూతి కాదా? నేడు దివ్యంగా కనిపిస్తున్న కంప్యూటరులో ఉన్నది జ్ఞానమే అయినందున, కంప్యూటర్ కూడా పరమేశ్వరుని విభూతియే. కంప్యూటర్ లోని వైభవము మనస్సు లోని వైభవము కాదా? కంప్యూటర్‌ని కనిపెట్టింది మనస్సే కదా? కనుక మనస్సు కూడా భగవ ద్విభూతియే. మనస్సు భగవద్విభూతి అయినప్పుడు, మనస్సును కలిగిన మనిషి మాత్రం విభూతి కాకుండా పోతాడా? మనస్సుకు, మనిషికి సత్తా స్ఫురణలు పరమాత్మ నుండే కలుగు తున్నాయి. మనస్సు లోని భావాలు, గుణాలు మనస్సు కన్నా వేరు కావు.

***కామ సంకల్పో విచికిత్సా శ్రద్ధా అశ్రద్ధా ధృతిః అధృతిః హ్రీః ధీః భీః ఇత్యేతత్సర్వం మన ఏవ*** - 'కోరిక, సంకల్పము, సందేహము, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, సిగ్గు, బుద్ధి, భయము - ఇలాంటి గుణాలు, భావాలు, అన్నీ మనస్సే అన్నది వేదం. అంటే వీటన్నిటికి మనస్సే ఆధారము. ఇవన్నీ మనస్సు వల్లనే కలుగు తున్నాయి. మనస్సు చైతన్య స్ఫూర్తి చేతనే కదులుతూ ఉంది కనుక, మనస్సు లోని భావాలు, గుణాలు అన్నీ పరమేశ్వరుని వల్లనే సంభవిస్తున్నాయి. కనుక, అవన్నీ పరమేశ్వరుని విభూతులు. ఆత్మ విభూతులు. ఆంతర్యంలో స్ఫురించేవి. వృత్తి రూపంలో తెలిసేవి. కనుక వృత్తి కూడా విభూతియే.

పరమేశ్వరుని నుండి ప్రాణులకు కలిగే బుద్ధ్యాది భావాలను ఈ నాలుగు, ఐదు శ్లోకాలలో కలిపి ఇరవై చెప్పడం జరిగింది. ఈ ఇరవై భావాలలో పన్నెండు భావాలు విడివిడిగా ఉన్నాయి. మిగిలిన ఎనిమిది నాలుగు జంటలుగా ఉన్నాయి.

విడిగా గోచరిస్తున్న పన్నెండు భావాలు ప్రగతి సూచకాలుగా ఉన్నాయి. జంటలుగా తెలిసే ఎనిమిదింటిలో నాలుగు ప్రగతికి, నాలుగు పతనానికి ప్రతిరూపాలుగా తెలుస్తున్నాయి. మొత్తానికి పదహారు ప్రగతి రూపాలు కాగా, నాలుగు పతన రూపాలుగా ఉన్నాయి.

సుఖదుఃఖాలు, భవ అభావాలు, భయాభయాలు, యశోయశాలు - ఈ నాలుగు జంటలలో దుఃఖము, అభావము, భయము, అయశస్సు అనేవి పతనానికి ప్రతిరూపాలు కాగా, మిగిలిన నాలుగు ప్రగతి రూపాలు. ప్రగతి రూపాలు ఉపాసించ దగినవి. పతన రూపాలు ఉపేక్షించ దగినవి. ఇవే సాధకులకు అనుకూల ప్రతికూలాలు. కర్మఫలాలుగా పరమాత్మ నుండి సంభవించే భావాలు. ముందుగా ఆ ఇరవై భావాలను ముక్త సరిగా చెప్పుకొని, ఆ తరువాత అవి ఎలా సంభవిస్తున్నాయో అర్థం చేసుకుందాం.

**బుద్ధి**

అంతఃకరణములో సూక్ష్మమైన విషయాలను గ్రహించే సామర్థ్యమే బుద్ధి ***(బుద్ధిః అన్తఃకరణస్య సూక్ష్మాత్ అర్థావబోధన సామర్థ్యమ్).*** బుద్ధికి నిశ్చయించే సామర్థ్యం కూడా ఉంది. సూక్ష్మావగాహనే నిశ్చయానికి ఉపకరిస్తుంది. సూక్ష్మము నెరిగే సామర్థ్యము గల బుద్ధి ఎవరి కుంటుందో వారే సరియైన నిర్ణయాలు





తీసుకుంటారు. నిర్ణయాలే ఎక్కడైనా నిర్దేశిస్తాయి. మనిషిలో ఈ విధమైన సామర్థ్యమే భగవద్విభూతి.

విషయాలు అందరికీ అర్థ మవుతాయి. విషయ లోతులు బుద్ధిమంతులకే తెలుస్తాయి. ఈ లోతుల నుండే కవులు పుట్టుకొస్తారు. విమర్శకులు, విశ్లేషకులు విస్తరిస్తారు. ఇదంతా వైభవము. ఈశ్వర వైభవము. యోగవిభూతి.

**జ్ఞానం**

ఆత్మానాత్మ వివేకం కలిగి ఉండటమే జ్ఞానం. ఆత్మాది పదార్థాలను క్షుణ్ణంగా తెలుసుకోవడమే జ్ఞానము ***(ఆత్మాది పదార్థానాం అవబోధః).*** ఏది సత్యము, ఏది అసత్యము, ఏది ఆత్మ, ఏది అనాత్మ అనే విచక్షణే ఇక్కడ జ్ఞానము. సారాసార వివేక నిపుణత్వము. ఈ విచక్షణా జ్ఞానశక్తి ఈశ్వర వైభవము.

**అసమ్మోహం**

తెలుసుకోవలసిన విషయాలు సన్నిహిత మైనపుడు, వాటి విషయంలో తత్తరపాటు లేకుండా వివేకంతో వ్యవహరించడం అసమ్మోహం. ఇది కూడా ఈశ్వర వైభవమే. ఇది అందరికీ సాధ్య మయ్యేది కాదు ***(ప్రత్యుత్పన్నేషు బోద్ధవ్యేషు వివేక పూర్వికా ప్రవృత్తిః).*** ప్రతి విషయంలో స్పష్టతను కలిగి ఉండటము అసమ్మోహం. స్పష్టత లేనపుడే మనస్సును మోహం ఆవరిస్తుంది. త్రాడును పాముగా చూడటం సంభవిస్తుంది. అలా చూడటం భయానికి కారణ మవుతుంది. త్రాడును త్రాడుగా చూడ గలిగితే మోహం ఉండదు. సర్పం గోచరించదు. భయం కలగదు.

ఈ అసమ్మోహ శక్తి బుద్ధిలో లేనపుడు ఇంద్రియాలు మోసం చేస్తూ ఉంటాయి. కనిపించేవే కాదు, వినిపించేవి కూడా భ్రాంతిని కలిగిస్తూ ఉంటాయి. రుచులు, వాసనలు, స్పర్శలు కూడా మోహంలో విపరీతం గానే అర్థ మవుతూ ఉంటాయి.

ఒకడు భావ కవి. ఎప్పుడూ ఏదో లోతుగా ఆలోచిస్తూ, గేయ రచన చేస్తూ ఉంటాడు. అలాంటి ఒక సమయంలో అతని ఇంటికి వచ్చిన అతని స్నేహితుడు, కవి గారిని ఆట పట్టించాలని, బిగ్గరగా ఏడుస్తూ 'మిత్రమా! దారుణం జరిగి పోయిందిరా! నీ భార్య విధవ అయిపోయిందిరా!' అని భోరు మన్నాడు.

అంతే. చేతి లోని కలం, కాగితం ప్రక్కన పడేసి, 'ఆఁ ఏమన్నావు? నా భార్య విధవై పోయిందా? అంటూ మిత్రుని ఏడుపుతో శ్రుతి కలిపాడు కవి. ఇద్దరూ ఏడుస్తున్నారు. అప్పుడే వాళ్ళ మధ్య కొచ్చి విషయాన్ని గ్రహించిన పిల్ల నిచ్చిన మామ గారు, 'ఛీ! వెధవా! నోర్ముయ్! ఏడ్చింది చాలు! వెధవవు నువ్వుండగా మా అమ్మాయి విధవ ఎలా అవుతుంది?' అన్నాడు. కవి అవాక్కయ్యాడు. సమ్మోహాలు ఇలాగే ఉంటాయి. అందుచేత అసమ్మోహం ఈశ్వర విభూతి.

**క్షమ**

ఎవరైనా నిందించినా, గాయ పరచినా, మనస్సులో వికారం చెందకుండా ఉండటము క్షమ. తిట్టినా, కొట్టినా చిత్తములో ఏ విధమైన మార్పు లేకుండా ఉండటము క్షమాగుణము ***(ఆకృష్టస్య తాడితస్య వా అవికృత చిత్తతా).*** ఆహార పానీయాలను అనుగ్రహించే అవని మాత అనర్థాలను విసర్జించినా భరిస్తుంది. ప్రాణాన్ని నిలిపే గాలిని దుర్గంధ పూరితం చేసినా, మారు మాట్లాడకుండా మోసుకు పోతుంది. ఎన్ని అపశబ్దాలను విసిరినా, ఆకాశం సాక్షిలా వీక్షిస్తూనే ఉంటుంది. అశుద్ధం చేసే వారిని కూడా శుద్ధి చేసే సుగుణాన్ని జలం కలిగి ఉంటుంది. ఇవన్నీ క్షమా రూపాలు. ఈశ్వర విభూతులు. ఇవన్నీ బల ప్రదర్శనలే గాని బలహీనతలు కావు.

**సత్యము**

మనం చూచింది, లేదా విన్నది, మన అనుభవానికి అందినది, అదే భావాన్ని స్ఫురించే లాగా ఇతరుల బుద్ధికి సంక్రమింప చేయడానికి ఉపయోగించే వాక్కు సత్యము ***(యథా దృష్టస్య యథా శ్రుతస్య చ, ఆత్మానుభవస్య పరబుద్ధి స విక్రాన్తయే తథైవ ఉచ్చార్యమాణా వాక్ 'సత్యమ్' ఉచ్యతే!).*** మనకు ఏది ఎలా అర్థమైందో, మనం చెప్పడంలో అది అలాగే ఇతరులకు అర్థం కావాలి. అదే సత్య వచనము. ఇదొక గొప్ప ధర్మము. అందుచేతనే సత్య వాక్కుకు మించిన ధర్మం లేదు అన్నది శాస్త్రం ***(సత్యాన్నాస్తి పరోధర్మః).*** సత్య స్వరూపుడైన భగవంతుడు ధర్మరూపంలో ఉన్నందున ధర్మరూపమైన సత్యవాక్కు ఈశ్వర విభూతి.

**దమము**

బాహ్యేంద్రియాలను నిగ్రహించే సామర్థ్యము దమము ***(బాహ్యేంద్రియ ఉపశమః).*** ఇంద్రియాలను నిగ్రహించలేని అశక్తతే బ్రతుకులో ఎన్నో అనర్థాలను సృష్టిస్తుంది. నోరు జారిన వాక్కు నరకాన్ని చూపిస్తుంది. ఇంద్రియ నియమము లేకపోవడమే కష్టాలకు కారణ మవుతూ ఉంది. మనో నిగ్రహం లేని వారు ముందు ఇంద్రియాలను నియమించ గలిగితే, ఆ తరువాత మనస్సును నిగ్రహించ గలుగుతారు. కనుక శుభ లక్షణమైన దమము ఈశ్వర విభూతియే.

**శమము**

అంతఃకరణమును నియమించడమే శమము ***(అంతఃకరణస్య ఉపశమః).*** ఆలోచనా విధానాన్ని సక్రమంగా నడుపు కోవడమే శమము. ఆలోచనా విధానం దారి తప్పితే, ఆ తరువాత ఏది జరిగినా దుఃఖమే అనుభవానికి అందుతూ ఉంటుంది. దుఃఖాన్ని దరి చేర నివ్వని శమము శివ స్వరూపము.

**సుఖము**

సుఖము అంటే ప్రియమైనది, ఆనందము ***(ఆహ్లాదః).***

**దుఃఖము**

దుఃఖము అప్రియము. బాధా పూరితము ***(సంతాపః).***

సుఖదుఃఖాలు రెండూ భగవంతుని ప్రసాదాలే. సుఖాలను ప్రసాదంగా స్వీకరించ వచ్చు. దుఃఖాలను ప్రసాదాలుగా ఎలా స్వీకరిస్తాము? అవి ఎలా మంగళకరం? అని మీరు సందేహించ వచ్చు.

బాధలు భగవంతుని జ్ఞాపకం చేస్తాయి. బ్రతుకులో పరివర్తనను కలిగిస్తాయి. బాధే లేకపోతే బ్రతుకే దుర్భర మేమో, ఆలోచించండి! బాధ ఉంది కనుకనే చీమ కుట్టినా, కాలు ప్రక్కకు తీసుకుంటున్నాను. బాధే లేకపోతే, ఎవడైనా సంతలో వెనుక నుండి చేతిని ఖండించినా, మనం దానిని గుర్తించకుండానే నడిచి ఇంటికి చేరుతా మేమో, ఆలోచించండి! అలా చూచి నపుడు దుఃఖం కూడా విభూతియే.

**భవము**

భవము అంటే పుట్టుక ***(ఉద్భవః).*** ఉత్పన్న శక్తి ఏదయినా, అది ఈశ్వర విభూతియే. సృష్టించే స్వభావము, నిర్మించే క్రియా శీలత్వము పరమేశ్వరుని వైభవాలు. ఒక కథను కవి సృష్టిస్తాడు. ఒక గీతానికి బాణీ సమకూర్చి గాయకుడు సరిగమలను జోడించి గానాన్ని సృష్టిస్తాడు. ఇవన్నీ ఈశ్వర వైభవాలే. ఇంతెందుకు? ప్రవంతిని కొనసాగించడానికి సంతానాన్ని ఉత్పత్తి చేయడం కూడా విభూతియే.





**అభావము**

భవమునకు వ్యతిరిక్త మైనది అభావము **(తద్విపర్యయః).** భవము అంటే పుట్టుక, లేదా నిర్మాణము కనుక అభావము అంటే వినాశము. ఏది సృష్టింప బడుతుందో, అదే నశింప చేయబడుతుంది. సృష్టించే నైపుణ్యము ఈశ్వర విభూతి అయినపుడు, నశింప చేసే శక్తి కూడా భగవ ద్విభూతియే. వైద్యుడు రోగాన్ని నశింప చేస్తాడు. రైతు ధాన్యం పండించి ఆకలిని పోగొడతాడు. కొందరు వినోదాన్ని సృష్టించి విషాదాన్ని మరపిస్తారు. ఇవన్నీ కళలే. కమనీయ మైన ఈశ్వర వైభవాలే.

**భయము**

భయం అంటే వెరపు పుట్టించేది **(త్రాసః).** చెడు మార్గాలలో వర్తించే వారు భగవంతుని చూచి భయ పడతారు. కర్మఫలాలను ప్రసాదించే వాడు కావడం చేత, భగవంతుడు భయ హేతువుగా తెలుస్తాడు.

**భయా ద స్యాగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః ।**
**భయా దిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యు ర్ధావతి పంచమః ॥**

పరమాత్మ భయం చేత అగ్ని జ్వలిస్తూ ఉంది. ఆ భయం తోనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఇంద్రుడు, వాయువు, మృత్యువు కూడా పరమాత్మకు భయపడే తమ కార్యాలను నిర్వహిస్తున్నారు.

కార్యాలను చక్కదిద్దే భయాలన్నీ ఈశ్వర విభూతులే. పూర్వపు రోజుల్లో ఈ నియమమే సమాజానికి శ్రీరామరక్షగా ఉండేది. ఉపాధ్యాయుని చూచి విద్యార్థులు భయపడే వారు. వైద్యుని చూచి రోగులు భీతి చెందేవారు. పెద్దలను, తల్లిదండ్రులను చూచి పిల్లలు భీతి చెందేవారు. అధికారిని చూచి ఉద్యోగి భీతి చెందేవాడు. ఆ భయాలన్నీ బ్రతుకులను మంగళకరం గానే తీర్చి దిద్దాయి. అందుచేత భయం కూడా ఈశ్వర విభూతియే.

**అభయము**

భయమునకు వ్యతిరిక్త మైనది అభయము **(తద్విపర్యయః).** అభయ కారణము అద్వైతము కనుక, అది శివ స్వరూపము. భగవద్విభూతి. అధర్మపరులకు భయ హేతువైన భగవంతుడు, ధర్మపరులకు, భక్తులకు అభయ రూపుడు. సంసార భయమును పోగొట్టే వాడు భగవంతుడు. ఈశ్వర భావన అభయ రూపము. ఈశ్వర భావ స్పృహ ఉండటం చేత ఈశ్వరుని ఆశ్రయించి అభయమును పొందుతున్నాము. ఈశ్వరుని గుర్తు తెచ్చే ఈశ్వర భావన కూడా అభయ రూపమే. కనుక అది కూడా ఈశ్వర విభూతియే.

**అహింస**

ప్రాణులను పీడించకుండా ఉండటము, బాధించకుండా ఉండటము అహింస **(అపీడా ప్రాణినామ్).** ***హింసాం న కుర్యాత్*** - హింసను చేయకూడదు అన్నది వేదం. హింస లేకుండా జీవించడమే అహింస. అది దైవగుణము. ధర్మాలలో కెల్ల ఉత్తమమైన ధర్మము **(అహింసా పరమో ధర్మః).** ధర్మరూపంలో ఉన్నది దైవమే కనుక అహింసా భావన ఈశ్వర భావనయే. ఈశ్వర భావన ఈశ్వర విభూతియే.

**సమత్వము**

సమమైన చిత్తమును కలిగి ఉండటమే సమత్వము **(సమతా సమ చిత్తతా).** రాగద్వేషాలను తటస్థ పరచి జీవించడమే సమత్వము. 'నాకు ప్రియులు లేరు. ద్వేషులు లేరు. రాగద్వేషాలు లేని నేను సర్వులలో సముడను' *(9 వ అ - 29 వ శ్లో)* అన్నాడు భగవంతుడు. రాగద్వేషాలను నిర్వీర్యం చేసి సమజీవనం కొనసాగించే సాధకుల జీవితం ఈశ్వరమయంగా ఉంటుంది. అందుచేత, సమత ఈశ్వర విభూతి. సమత యోగ విభూతి. మమత రోగ ఆకృతి.

**సంతృప్తి**

లభించిన దానితో తృప్తి చెందే బుద్ధి సంతోషంగా ఉంటుంది. అదే సంతృప్తి ***(తుష్టిః).*** తుష్టి అంటే సంతోషము. సంతృప్తి. ప్రాప్తించిన దానితో తృప్తి చెందే మనస్తత్వము ***(తుష్టిః సంతోషః పర్యాప్త బుద్ధిః లాభేషు).*** ఇక చాలు అనే తృప్తియే తుష్టి ***(అలం బుద్ధిః తథా తుష్టిః).***

ఎప్పుడూ తృప్తిగా ఉండటము భగవంతుని లక్షణము. అలా తృప్తిగా మనమూ జీవించ గలిగితే ఈశ్వర వైభవము మనలో కూడా ప్రకాశిస్తూ ఉందని అర్థము. అదే ఈశ్వర విభూతి.

**తపస్సు**

అంతర్ముఖత్వమే తపస్సు. విషయ సుఖాల నుండి విరమించడమే తపస్సు. అందుకే శివుడు సదా తపస్సులో ఉంటాడు. ధ్యానమగ్నుడై ఉంటాడు. అంతర్ముఖుడై ఉంటాడు. అది ఈశ్వర విభూతి. ఇంద్రియాలను నియమించి, దేహాన్ని నిగ్రహించి ఈశ్వర ధ్యానంలో జీవించడము తపస్సు. అది ఈశ్వర వైభవము ***(తపః ఇంద్రియ సంయమ పూర్వకం శరీర పీడనమ్).***

**దానం**

మన శక్తిని అనుసరించి మనకు ఉన్న దానిని ఇతరులతో పంచుకోవడం దాన గుణము ***(యథా శక్తి సంవిభాగః).*** ఇతరుల సుఖాలను వృద్ధి చేయడమే దాన గుణము లోని వైభవము. సర్వులకు సర్వమును సమకూర్చి సంతసమును కలిగించడం ఈశ్వర స్వభావము. అందుకే ఆయన దాత.

దానం అంటే పెట్టడమే కాదు. కొట్టకుండా ఉండటము కూడా దానమే. పొట్టకు పెట్టడం దానం. పొట్ట కొట్టకుండా ఉండటము కూడా దానమే. ***దండ న్యాసః పరం దానమ్*** - మనో వాక్కాయ కర్మల చేత ప్రాణులను బాధించకుండా ఉండటం కూడా దానమే. ఇది అభయ దానం. ఇది కూడా ఈశ్వర వైభవమే. ఈశ్వర విభూతియే.

**యశస్సు**

యశస్సు అంటే కీర్తి. ధర్మాచరణం వల్ల కలిగేది కీర్తి ***(ధర్మ నిమిత్తా కీర్తిః).*** ఎవరు ఈ ప్రపంచంలో కీర్తిని ఆర్జించినా అది భగవంతుని కీర్తియే అయి ఉంటుంది. సత్యము భగవత్స్వరూపము. సత్య జీవనాన్ని సాగించి హరిశ్చంద్రుడు కీర్తిమంతు డయ్యాడు. ధర్మము భగవత్స్వరూపము. ధర్మ జీవనాన్ని గడిపి ధర్మరాజు యశస్సు నార్జించాడు. ఈశ్వరుడు త్యాగమయుడు. త్యాగానికి ప్రతిరూపంగా శోభించి శిబి చక్రవర్తి కీర్తిమంతు డయ్యాడు. పరమేశ్వరుడు జ్ఞానమయుడు. జ్ఞానరూపులై శోభించి శ్రీ ఆదిశంకరాచార్య స్వామి అసమాన యశోవంతులై విరాజిల్లారు. కనుక, యశస్సు భగవద్విభూతి.

**అయశస్సు**

అయశస్సు అంటే అపకీర్తి. అధర్మాచరణం వల్ల ప్రాప్తించేది అపకీర్తి ***(అధర్మ నిమిత్తా అకీర్తిః).*** ధర్మమును తప్పి చరించడం కీర్తిని పోగొడుతుంది. పేరు మోసిన ఉగ్రవాదులకు ఎంతైనా అపకీర్తి ఉంది. కీర్తిని పొందిన రాముడు ఎందరికి తెలుసో, అపకీర్తిని మూట కట్టుకున్న రావణుడు అంత మందికి తెలుసు. పరమేశ్వరుని వైభవమును విస్మరిస్తే, ధర్మానికి విరుద్ధంగా జీవిస్తే, మోయలేని అపకీర్తి భారాన్ని మోయ వలసి వస్తుంది అనే స్పృహ కలగడం మళ్ళీ ఈశ్వర విభూతియే. ధర్మాచరణలో ప్రవృత్తి ఎలా ఈశ్వర వైభవమో, అధర్మ విషయంలో నివృత్తి కూడా అలా ఈశ్వర వైభవమే.





ఇంతవరకు నాలుగు, ఐదు శ్లోకాలలో మనం సంక్షిప్తంగా, సారభూతంగా అధ్యయనం చేసిన అనేక విధాలైన భావాలన్నీ పరమేశ్వరుని వల్లనే సంభవిస్తున్నాయి అని మనం స్పష్టంగా అర్థం చేసుకున్నాం ***(పృథగ్విధాః భావాః భూతానామ్ మత్తః ఏవ భవన్తిః).***

అనేక విధాలైన భావాలు **(పృథగ్విధాః భావాః)** అనడంలో చెప్పినవి, చెప్పనివి కూడా అని అర్థము. ప్రస్తుతం మనం చూచిన ఇరవై భావాలే గాక, మిగిలినవి ఎన్నైతే ఉన్నాయో అవన్నీ కూడా అని అర్థము. ఇకపోతే, నా వల్లనే సంభవిస్తున్నాయి **(మత్తః ఏవ)** అని చెప్పడంలో **ఏవ** కారము అవధారణార్థక మని గ్రహించాలి.

ఇవన్నీ పరమేశ్వరుని వల్లనే సంభవిస్తున్నాయి అంటే దాని అర్థం, అనుకూల ప్రతికూల ఫలాలను (భావాలను) పరమేశ్వరుడు ప్రసాదించడం వెనుక ఆయనకు రాగద్వేషాలు ఉన్నాయని కాదు. వారి వారి కర్మలను అనుసరించి పరమేశ్వరుడు ఆయా భావాలను కర్మఫలాలుగా వారికి ప్రసాదిస్తూ ఉంటాడు ***(స్వకర్మానురూపేణ)*** అని భావం. ఏ విత్తనం నాటుతామో ఆ ఫలమే అందుతుంది. ఏ కర్మ నాచరిస్తామో ఆ భావాలే ఫలాలుగా అందుతాయి.

*సృష్టి లోని భావాలే కావు, సృష్ట్యాది యందున్న మనువులు, మహర్షులు కూడా తన నుండి సంభవించిన వారే నని చెబుతున్నాడు.*

**మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవ స్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥** 6

**మహర్షయః-సప్త-పూర్వే-చత్వారః-మనవః-తథా**
**మద్భావాః-మానసాః-జాతాః-యేషాం-లోకే-ఇమాః-ప్రజాః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| లోకే | = | లోకములో | తథా | = | అటులే |
| ఇమాః | = | ఈ | పూర్వే | = | పూర్వులైన |
| ప్రజాః | = | ప్రజలు | చత్వారః | = | నలుగురు |
| యేషాం | = | ఎవరికి | మనవః | = | మనువులు |
| జాతాః | = | పుట్టారో | మద్భావాః | = | నా భావము గలవారై |
| తే | = | ఆ | మానసాః | = | మనస్సు నందు |
| సప్త | = | ఏడుగురు | జాతాః | = | పుట్టిరి |
| మహర్షయః | = | మహర్షులు | | | |

**అర్జునా! సప్త ఋషులు, అలాగే నలుగురు మనువులు, వీరందరూ పూర్వీకులు. నా భావమునే అనుసరించే వారు. నా మానస పుత్రులు. ఈ ప్రపంచ మంతా వీరి సంతానం గానే విస్తరించింది.**

**వ్యాఖ్య**

**సంతతి - సన్నుతి**

భగవంతుని లోక మహేశ్వరత్వమునకు హేత్వంతరముగా ఈ శ్లోకం కూడా శోభిస్తూ ఉంది. సృష్ట్యాదిలో ఉన్న వారిని చెబుతూ, వారి ద్వారా ఈ విశ్వము విస్తరించిన విధానమును విస్పష్టం చేస్తున్నాడు.

సప్త ఋషులు, నలుగురు మహర్షులు, అలాగే స్వాయంభువాది పద్నాలుగు మంది మనువులు ప్రాచీనులు.

***పూర్వే*** అనడం వల్ల వారు పూర్వీకులు అని అర్థం. అంటే గడచిన కాలానికి సంబంధించిన వారు ***(అతీత కాల సంబంధినః).*** ఈ ప్రాచీనత్వము సృష్ట్యాది కావచ్చు. లేదా ఒక ప్రత్యేకమైన కల్పాది కూడా కావచ్చు. ఏదైనా సృష్ట్యాదినే సూచిస్తుంది. వీరి వల్లనే ఈ చరాచర ప్రపంచము విస్తరించింది.

***భృగుం మరీచి మత్రించ పులస్త్యం పులహం క్రతుమ్,***
***వసిష్ఠం చ మహాతేజా స్సోఽ సృజ న్మనసా సుతాన్॥***
***సప్త బ్రహ్మణ ఇత్యేతే పురాణే నిశ్చయం గతాః,***

భృగువు, మరీచి, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు - సప్త ఋషులుగా పేరొందిన ఈ ఏడు మందిని భగవంతుడు సంకల్పము చేత సృష్టించాడు. ఈ సప్త ఋషులను సప్త బ్రహ్మలు అని అంటారు. ఇది పురాణ ప్రసిద్ధము.

వీరి లాగే మరో నలుగురు ఉన్నారు ***(చత్వారః)*** అన్నాడు. వారే సనక సనందనాది మహర్షులు. బ్రహ్మ మానస పుత్రులు.

వీరు గాక, మనువులు కూడా పురాతనులుగా చెప్పబడ్డారు. వారే స్వాయంభువాది మనువులు. వీరు పద్నాలుగు మంది. వీరు కూడా సృష్ట్యాదిలో ఉన్న వారే. వీరందరు గొప్ప తేజోవంతులు ***(మహాతేజాః).*** భగవద్భావన కలవారు ***(మద్భావాః).*** భగవచ్ఛక్తి కలవారు. కనుకనే వీరు సర్వశ్రేష్ఠులు. విశ్వస్రష్టలు. మూల పురుషులు.

బ్రహ్మదేవుని పగటి కాలంలో సృష్టి ఆరంభమై, బ్రహ్మదేవుని రాత్రి సమయాన, సృష్టి లయిస్తూ ఉందని ముందే గ్రహించాము *(8 వ అ - 17 & 18 వ శ్లో).* ఒక కల్పంలో, అంటే బ్రహ్మదేవుని పగటి కాలంలో పద్నాలుగు మంది మనువులు లోకాన్ని సమంగా పాలిస్తారు. అంటే బ్రహ్మదేవుని పగటి కాలంలో ఒక్కొక్క మనువు పద్నాల్గవ వంతు కాలం విశ్వాన్ని పరిపాలిస్తాడు. మనకు అర్థమయ్యే మానవ సంవత్సరాలలో చెప్పుకుంటే, ఒక్కొక్క మనువు నాలుగు కోట్ల, మూడు లక్షల, ఇరవై వేల సంవత్సరాలు పరిపాలిస్తాడు. ఈ సంఖ్యను పద్నాలుగుతో పెంచుకుంటే బ్రహ్మదేవుని ఒక్క పగటి కాలము అవుతుంది. ఇలా పద్నాలుగు మంది మనువులు పాలిస్తారు. ప్రస్తుతం మనం వైవస్వత మనువు పాలనలో ఉన్నాం. కనుకనే పూజాది కాలాలలో వైవస్వత ***మన్వంతరే*** అంటూ సంకల్పం చెబుతాము. ***మన్వన్తరమ్ - అన్యోమనుః అస్మిన్నితి మన్వంతరమ్ -*** మరొక మనువు ప్రవేశించేది మన్వంతరము.

ఈ విధంగా పూర్వీకులైన మహర్షులు, మరియు స్వాయంభువాది మన్వాదుల చేత ఈ చరాచర ప్రపంచము విస్తరించింది. మనువు నుండి పుట్టిన వారము కావడం చేత మనం మానవులము ***(మానవాః).*** మనుజులము. అంతేగాని యోనిజులము కాము. చరాచర మంతా మనువు నుండే ఆవిర్భవించినా, గుర్తించే సామర్థ్యం మానవులకే ఉంది. కనుక మనకు మూల పురుషులు మహర్షులు, మనువులు అనేది అర్థమైంది. కనుకనే మనకు ఋషి గోత్రాలు ప్రాప్తించాయి. మనది ఋషికులం. మన మందరము ఋషుల సంతానము. కనుక ఋషిత్వ మనేది మన జన్మ హక్కు. అదే మన పిత్రార్జితము. ఋషుల ప్రతిరూపంగా మనం నేడు ఉన్నాము. వారు ప్రవర్తించిన మార్గమే మన మార్గము. వారు నిర్దేశించిన బాట లోనే మనం పయనించాలి.

**నిష్ఠాద్వయము**

సృష్ట్యాదిలో జ్ఞానయోగ, కర్మయోగా లనే నిష్ఠా ద్వయాన్ని సూర్యునికి తానే బోధించినట్లు, సూర్యుడు మనువుకు చెప్పినట్లు నాల్గవ అధ్యాయం ఆరంభము లోనే భగవంతుడు ప్రబోధించాడు.





పరమేశ్వరుని అనుగ్రహ ప్రసాదాలుగా లోకానికి ప్రాప్తించిన జ్ఞానయోగ, కర్మయోగాలు కూడా చరాచరాత్మక మైన లోకం విస్తరించినట్లే విస్తరించాయి. స్వాయంభువాది మనువులు ప్రవృత్తి మార్గమును నిర్దేశిస్తూ కర్మయోగమును విస్తరింప చేస్తే, సనక సనందనాది మహర్షులు నివృత్తి మార్గమును నిర్ణయిస్తూ జ్ఞానయోగమును విస్తరింప చేశారు. వీరందరూ సంప్రదాయ రక్షకు లయ్యారు. స్వాయంభువాది చతుర్దశ మనువులు వంశ పరంపరను వృద్ధి చేస్తూ ప్రవృత్తిని ప్రవచిస్తే, మహర్షులు గురు పరంపరను రక్షిస్తూ నివృత్తిని ప్రబోధించారు. కనుకనే బ్రహ్మ విద్యాభ్యాసంలో ముందుగా సంప్రదాయ కర్తలకు నమస్కరించి, ఋషి వంశాన్ని స్తుతించి, మహనీయులకు, మహర్షులకు వందన మాచరించి, ఆ తరువాత అధ్యయనమును ప్రారంభిస్తాము. ఇదే సంప్రదాయ రక్షణ.

***ఓం నమో బ్రహ్మాదిభ్యో***
***బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో***
***వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః***

బ్రహ్మదేవుని మొదలుకొని, బ్రహ్మవిద్యా సంప్రదాయమును ఏర్పరచిన ఋషి వర్యులకు, ఋషి వంశములో ప్రకాశించిన మహాత్ములకు, మహనీయులైన సర్వులకు, గురువులకు నమస్కారము. నమస్కారము.

*ఈ విధంగా భగవద్విభూతిని తెలుసుకున్న వారికి కలిగే ఫలిత మేమిటో చెబుతున్నాడు.*

**ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః।**
**సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥** 7

**ఏతాం-విభూతిం-యోగం-చ-మమ-యః-వేత్తి-తత్త్వతః**
**సః-అవికంపేన-యోగేన-యుజ్యతే-న-అత్ర-సంశయః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మమ | = | నా యొక్క | సః | = | వాడు |
| ఏతాం | = | ఈ | అవికంపేన | = | చలించని |
| విభూతిం | = | మహిమను | యోగేన | = | యోగము చేత |
| యోగం చ | = | యోగమును | యుజ్యతే | = | కూడిన వాడవుతాడు |
| తత్త్వతః | = | యథార్థముగా | అత్ర | = | ఈ విషయము నందు |
| యః | = | ఎవడు | సంశయః | = | సంశయము |
| వేత్తి | = | తెలిసికొనునో | న | = | లేదు |

**అర్జునా! విస్తార మైన నా విభూతిని ఎవడైతే యదార్థంగా తెలుసుకుంటాడో, అతడు యోగంలో చలించడు. స్థిరంగా ఉంటాడు. ఈ విషయంలో సందేహం లేదు.**

**వ్యాఖ్య**

నిర్విశేషము, నిరుపాధికము అయిన పరబ్రహ్మము యొక్క అద్భుతమైన వైభవమును, అది జగద్రూపంలో విస్తరించడం అనే విభూతి వైభవమును ఇంతవరకు చెప్పి ***(ఏతాం యథోక్తాం),*** దానిని తెలుసుకోవడం వల్ల కలిగే ప్రయోజనాన్ని, ఫలాన్ని ఇప్పుడు చెబుతున్నాడు. అంటే, సోపాధిక మైన విభూతి ప్రదర్శనమును, దానిని గ్రహించుట చేత ప్రాప్తించే ఫలమును ఈ శ్లోకంలో చెబుతున్నాడు.

ఉపాధులకు కారణమైన మాయ పరమాత్మ అధ్యక్షతన వివిధ రూపాలుగా విస్తరించుట, లేదా పరిణమించుటయే విభూతి. **భూతిః** అంటే సత్తాత్మక మని గత శ్లోకంలో తెలుసుకొని ఉన్నాము.

***భూతిః భవనం*** - సత్తాత్మకము లేక ఉనికి 'భూతి' అయితే, విశేష మైన ఉనికి 'విభూతి'. విభూతి అంటే వ్యక్త వైభవము ***(వివిధా భూతిః భవనం వైభవం సర్వాత్మకత్వం).*** 'వి' అంటే వివిధ రూపాలతో. 'భూతి' అంటే ఉండటము. అనేక రూపాలతో దివ్యంగా శోభించడమే విభూతి. ఇది సోపాధికము. దీనిని తెలుసుకోవడం వల్ల కలిగే జ్ఞానము సోపాధిక జ్ఞానము. విభూతి వైభవము. సోపాధిక జ్ఞానము నిరుపాధిక జ్ఞానానికి మార్గమును సుగమం చేస్తుంది ***(సోపాధిక జ్ఞానం నిరుపాధిక జ్ఞానే ద్వారం*** - ఆనందగిరి).

మాయా ప్రభావము చేత వివిధ ఆకారములుగా విస్తరించుట అన్నప్పుడు, మాయకు అధిష్ఠానమైన నిరుపాధిక సత్తాత్మకం ఉంది అని అర్థం. సోపాధిక మైన విభూతి స్వరూపము నిరుపాధిక మైన సద్రూప చైతన్యము నుండి సంభవించింది అన్నప్పుడు, ఈ రెండిటి మధ్య ఉండే సంబంధం ఎలాంటిదో ముందుగా మనకు అర్థం కావాలి. అది కూడా యథార్థంగా తెలియాలి ***(తత్త్వతః). తత్త్వతః*** లేక ***తత్త్వేన*** అంటే తత్త్వం చేత, ఉన్నది ఉన్నట్లుగా తెలియాలి.

తెలియడము అంటే జ్ఞానము. తత్త్వం చేత అంటే తాత్త్విక జ్ఞానం చేత అని అర్థము. తత్త్వ జ్ఞానము అంటే ఏమిటి? ఆత్మ ఏకము, అద్వయము. ఆత్మ ఒక్కటే సత్యము. దానికి అన్యమైన దంతయు మాయ లేక మిథ్య. ఇదే తత్త్వ జ్ఞానము.

ఒకటి సత్యము. అదే అధిష్ఠానము. మరొకటి అధిష్ఠాన వస్తువుతో సంబంధమును కలిగిన ఆరోపిత వస్తువు. అది మిథ్య. అదే వివిధాకారంగా శోభించే విశ్వము. మరి, ఈ రెండిటి మధ్య ఉండే సంబంధము ఎలాంటిది? సత్య మిథ్యా సంబంధము.

మిథ్యకు ప్రత్యేక అస్తిత్వము లేనందున, సత్యముపై ఆధార పడిన మిథ్యా జగత్తు సత్యము కన్నా వేరుగా ఉండ లేదు. కనుక, మిథ్య కూడా సత్యమే. కాని సత్యము మిథ్య కాదు. సత్యము మిథ్య అయితే, మిథ్య లాగే సత్యము కూడా మరొక సత్యముపై ఆధార పడవలసి వస్తుంది. అలా ఆధార పడేది ఏదైనా మిథ్య అవుతుందే గాని సత్యం కాలేదు.

కనుక, ఆరోపిత వస్తువు నిషేధింపబడి, అధిష్ఠాన వస్తువుతో ఏకమై ఉండటమే, అనగా ఏకత్వం తెలియడమే తత్త్వ జ్ఞానము. ***తత్త్వతః*** జ్ఞానము.

అధిష్ఠానం ఉంది. దానిని ఆధారం చేసుకొని ఆరోపితము ఉంది. కనుక, ఆరోపితము ఉంది, అధిష్ఠానము ఉంది. ఆరోపితము లేదు, అయినా అధిష్ఠానం ఉంటుంది. ఇదే తత్త్వ జ్ఞానము. ***తత్త్వతః*** తెలియడ మంటే ఇదే.

మట్టి అధిష్ఠానము. మట్టికుండ ఆరోపితము. మట్టికుండ మట్టికి దూరంగా ఉండలేదు. కనుక, ఆరోపితమైన మట్టికుండ మట్టియే. కాని, మట్టి మాత్రం కుండ కాదు. ఇదే ***తత్త్వతః*** తెలియడ మంటే.

జగత్తు జగదీశ్వరుడే. కాని, జగదీశ్వరుని జగత్తుగా చూడ కూడదు. జగద్వైభవమును జగదీశ్వర వైభవముగా దర్శించడమే విభూతి దర్శనము. కాని సత్తాత్మక మైన జగదీశ్వరుని జగత్తుగా చూడ కూడదు.

విభూతి వైభవము ఉజ్జ్వల మైనది. ఉత్కృష్ట మైనది. ఉత్కర్షమును బ్రహ్మముగా దర్శించడములో దోషం లేదు ***(బ్రహ్మ దృష్టిః ఉత్కర్షాత్).*** కాని బ్రహ్మమును మరొక దానిలో దర్శించ కూడదు. ఉపాసనలో కూడా ఇది చాలా ప్రధానమైన విషయము. విగ్రహమును భగవంతుడుగా దర్శించ వచ్చు. కాని, భగవంతుని విగ్రహంగా దర్శించ కూడదు. ఇదే తత్త్వజ్ఞానము. ఇలా ***తత్త్వతః*** ఎవడు విభూతిని, యోగమును తెలుసు కుంటాడో, అట్టివాడు యోగంలో చలించడు. అప్రచలితంగా ఉంటాడు. అదే అవికంప యోగము.





'వికంపము' అంటే వికల్పము. వికల్పము లేని స్థితి 'అవికంపము'. అదే చలించని యోగము. అవికంప యోగము ***(అవికంపే న యుజ్యతే).*** సర్వమూ ఈశ్వరుడే అనే జ్ఞానము చలింపకుండా ఉండటమే అవికంప యోగము. అట్టి జ్ఞానముతో ఈశ్వరుని తెలుసుకొనే వాడు యోగములో చలించకుండా ఉంటాడు. ఈ విషయంలో సందేహానికి అవకాశము లేదు అంటున్నాడు **(న అత్ర సంశయః, న అస్మిన్ అర్థే సంశయః అస్తి).** కారణం, ***తత్త్వతః*** లభించిన జ్ఞానము ప్రమాణ ఫలం కావడమే. శాస్త్ర, ఆచార్యోపదేశ జన్యమైన వివేకము చేత కలిగింది కనుక ఈ తత్త్వ జ్ఞానము అబాధితంగా శోభిస్తుంది. అలా ఎవడు తెలుసుకుంటాడో అట్టి వాడు యోగంలో చలించడు. స్థిరంగా ఉంటాడు.

యోగంలో చలించడు అంటే, యోగాన్ని చలింప చేసే రాగద్వేషాల నుండి విడిపడి ఉంటాడని అర్థము. అంతేకాదు, విభూతి ఉపాసనా జనిత శక్తి చేత అతని అంతఃకరణము నిశ్చలంగా ఉంటుంది. అటు కర్మయోగము ద్వారా అంతఃకరణ శుద్ధిని, ఇటు ఉపాసన ద్వారా అంతఃకరణ నైశ్చల్యమును పొంది ఉండటం చేత, విభూతిని, యోగమును ***తత్త్వతః*** తెలుసుకున్న వాడు ధ్యానంలో చలించడు.

*సత్తాత్మక మగు పరమాత్మ తత్త్వమును, ఐశ్వర్య ప్రధానమైన ఈశ్వర విభూతిని, రెండిటిని* ***తత్త్వతః*** *తెలియడం చేత, అలా తెలుసుకొనిన భక్తులు భగవంతుణ్ణి పరమార్థ తత్త్వ అభినివేశంతో ఆరాధిస్తారు. చదవండి.*

**అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।**
**ఇతి మత్వా భజన్తే మాం బుధా భావ సమన్వితాః ॥** 8

***అహం-సర్వస్య-ప్రభవః-మత్తః-సర్వం-ప్రవర్తతే***
***ఇతి-మత్వా-భజంతే-మాం-బుధాః-భావ సమన్వితాః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | ఇతి | = | అని |
| సర్వస్య | = | సమస్తమునకు | మత్వా | = | తలచి |
| ప్రభవః | = | ఉత్పత్తి కారకుణ్ణి | భావ సమన్వితాః | = | పరమార్థ భావము గలవారై |
| మత్తః | = | నా వలన | బుధాః | = | జ్ఞానులు |
| సర్వం | = | సమస్తము | మాం | = | నన్ను |
| ప్రవర్తతే | = | ప్రవర్తిస్తూ ఉంది | భజంతే | = | సేవిస్తున్నారు |

**అర్జునా! ఈ సమస్త ప్రపంచము నా వల్లనే కలిగింది. నా వల్లనే నడుస్తూ ఉంది. ఈ విధంగా తెలుసుకున్న పండితులు, నన్నే పూర్ణ భక్తితో సేవిస్తారు.**

**వ్యాఖ్య**

దీపం వెలుగుతూ ఉండాలి. మనిషి ఆనందంగా జీవనయాత్ర సాగించాలి. దీపం వెలుగుతూ ఉండాలి అంటే, దీపంలో చమురు నిండుగా ఉండాలి. మనిషి ఆనందంగా ఉండాలి అంటే, మనిషిలో జ్ఞానం పుష్కలంగా ఉండాలి. చమురు లేకుండా దీపం వెలగ లేదు. జ్ఞానం లేకుండా మనిషి ఆనందంగా జీవించ లేడు.

జ్ఞానం అంటే ఏదో కాదు. పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానమే నిజమైన జ్ఞానం. సత్యజ్ఞానం. ఈశ్వర జ్ఞానం. ఈ దృశ్యమాన ప్రపంచానికి పరమేశ్వరుడే కారణం అనే జ్ఞానం. ఈ ప్రపంచం లోని వైభవాలన్నీ ఈశ్వర వైభవాలే అనే జ్ఞానం.

రూపాలు కళ్ళకు అందుతాయి. శబ్దాలు చెవులకు అందుతాయి. భగవంతుడు జ్ఞానానికి అందుతాడు. జ్ఞానం బుద్ధికి అందుతుంది. కనుక, ***బుద్ధి గ్రాహ్యం అతీంద్రియం*** - ఇంద్రియాలకు అందని భగవంతుడు బుద్ధికి అందుతాడు.

అర్జునా! ఈ సమస్తము నా నుండే ఆవిర్భవించింది *(అహం సర్వస్య ప్రభవః)*. అలా ఉత్పన్నమైన సమస్తము నా వల్లనే నడుస్తూ ఉంది *(మత్తః సర్వం ప్రవర్తతే)*.

**'అహం' శబ్దార్థము**

***అహం*** - 'నేను' అంటూ భగవానుడు ఈ శ్లోకాన్ని ప్రారంభించాడు. ***అహం సర్వస్య ప్రభవః*** అంటూ ఈ జగత్తు యొక్క ప్రారంభం తన నుండే జరిగింది అని చెప్పడానికి శ్లోకాన్ని కూడా ***అహం*** - నేను అంటూ తన నుండే ప్రారంభించాడు భగవంతుడు.

ఇక్కడ ***అహం*** అంటే పరమాత్మ అని అర్థము. ***అహం పరంబ్రహ్మ వాసుదేవాఖ్యం*** - వాసుదేవుడు అనే పేరు గల పరమాత్మ నైన నేను అని ***అహం*** శబ్దార్థము. వాసుదేవుడైన తన నుండే జగత్తు ఆవిర్భవించింది. వాసుదేవుడైన తన వల్లనే ఈ జగత్తు నడుస్తూ ఉంది. అంటే, ఈ జగత్తుకు ఉపాదాన కారణముగా, సృష్టికి కారణమైన వాసుదేవుడే, నిమిత్త కారణము కూడా తానే అయి స్థితి కారకుడుగా కూడా శోభిస్తున్నాడు. అదే వాసుదేవ నామ వైభవము.

***వాసుశ్చ అసౌ దేవశ్చ ఇతి వాసుదేవః*** - 'వాసుదేవ' అనే పేరులో రెండు పదాలు ఉన్నాయి. ఒకటి 'వాసు', రెండవది 'దేవ'. ఇవి నిగూఢమైన, భావగర్భిత మైన పదాలు. ప్రస్తుత శ్లోకానికి దివ్యమైన వ్యాఖ్యానాలు. కనుకనే, ఈ సందర్భములో ***అహం*** పదానికి వాసుదేవ నామాన్ని ఉటంకించింది శంకర భాష్యము. 'వాసు' శబ్దము ఉపాదాన కారణమును, 'దేవ' శబ్దము నిమిత్త కారణమును సూచిస్తున్నాయి.

***వసతి వాసయతి, ఆచ్ఛాదయతి వా సర్వమితి వాసుః*** - అంతటా వసించుట, అంతట సదాత్మకంగా తానే ఉండుట *(వసతి)*, కారణముగా సమస్తమును ఆచ్ఛాదించుట *(ఆచ్ఛాదయతి)* 'వాసు' శబ్దార్థము. అంటే ఉపాదాన కారణమై అంతటా వ్యాపించి ఉండటము అని అర్థము.

కుండకు మట్టి ఉపాదాన కారణము. ఉపాదాన కారణం కావడం చేత మట్టి కుండ నంతా వ్యాపించి ఉంది. వస్తు ఉపాదానము వస్తువుకు దూరంగా ఉండలేదు. కుండలో మట్టి లేని చోటంటూ ఉండదు. అదే ఉపాదాన విశేషము.

కుండకు ఉపాదానమైన మట్టి, కుండగా ఉంటూ, కుండలో అంతా ఎలా వ్యాపించి ఉందో, జగత్తుకు ఉపాదాన కారణమైన పరమేశ్వరుడు జగత్తుగా ఉంటూ, జగత్తులో అంతటా వ్యాపించి ఉన్నాడు. జగత్తంతా అతని లోనే ఉంది. అదే 'వాసు' శబ్దార్థము. అంతేకాదు, తాను అంతటా నిండి ఉన్నా, అర్థం కాకుండా ఆచ్ఛాదించి ఉన్నాడు. కప్పి ఉన్నాడు. అందుచేత, ఉండినా లేనట్లే మాయ చేత కప్పబడి ఉన్నాడు కనుక *(ఆచ్ఛాదయతి)*, అర్థం కాకుండా ఉన్నాడు *(అగ్రాహ్యం)*.

***దేవ*** శబ్దము ***దివ్*** అనే ధాతువు నుండి వచ్చింది. ***దివ్*** అంటే ***దీవ్యతి, క్రీడతి, వ్యవహరతి, ద్యోతతే*** అని అనేక అర్థా లున్నాయి. ప్రకాశించడము, క్రీడించడము, వ్యవహరించడము, భాసించడము అనే అర్థా లున్నాయి. పరమేశ్వరుడు జ్ఞాన స్వరూపుడు కనుక ఆయన ప్రకాశరూపుడు. సర్వమును తెలిసిన వాడు. అంటే, 'వాసు' శబ్దార్థము తెలిపినట్లు, ఆయన కేవలం ఉపాదాన కారణమే గాక, నిమిత్త కారణంగా కూడా ఉన్నాడు అని 'దేవ' శబ్దము సూచిస్తూ ఉంది. నిర్దేశిస్తూ ఉంది. సృష్టి అనేది ఆయనకు క్రీడా మాత్రమే, లీలా విలాసమే అని కూడా చెబుతూ ఉంది.





వాసుదేవ నామధేయుడైన పరమేశ్వరుడు, 'వాసు' - 'దేవ' శబ్దార్థముల చేత, ఈ సమస్త విశ్వానికి అభిన్న నిమిత్త ఉపాదాన కారణంగా విలసిల్లు తున్నాడని అర్థమైంది. **కార్యం సర్వం కారణ మాత్ర మేవ** - కార్యము సమస్తము కారణము మాత్రమే అనే న్యాయమును అనుసరించి, కార్య రూపమైన ఈ సమస్త ప్రపంచము పరమాత్మ వైభవమే అని స్పష్ట మవుతూ ఉంది. ఇదే యోగ విభూతి. విభూతి యోగము.

ఉపాదాన కారణంగా పరమాత్మ మనకు తల్లి. భగవతి. నిమిత్త కారణంగా పరమాత్మ మనకు తండ్రి. భగవంతుడు. కన్నవాడు తానే. కనికరించి కాపాడే వాడూ తానే. అందరిలో ఉన్న తాను విభూతి సుందరుడు. వాస్తవానికి అందరినీ తన లోనే నింపుకున్న శ్యామసుందరుడు, వాసుదేవుడుగా సత్తాత్మకమై శోభిస్తున్నాడు. అందుచేతనే, 'కన్నా! మన్ను తిన్నావా? ఏది, నీ నోరు తెరువు!' అని యశోదమ్మ అడిగి నపుడు, వందనందనుడు మందహాసమును చిందించాడు. మన్నేమిటి? మన్నైనా, మిన్నైనా, మహియైనా, మహిమైనా, చివరికి ప్రశ్నించే మా అమ్మయినా - అందరూ నా లోనే ఉన్నారు, అన్నీ నా లోనే ఉన్నాయంటూ నోరు తెరిచాడు. అంతే, విశ్వమంతా తల్లికి నోటి లోనే కనిపించింది. చివరికి ఆ అద్భుత దృశ్యాన్ని తిలకించే తనను కూడా యశోద ఆ దృశ్యం లోనే దర్శించింది.

**మన్ను తింటి వని నోరు చూపమనగా**
**తెరిచి చూపితి వట నోట త్రిభువనములు**
**మా కళ్ళకు ఆ భాగ్య మెపుడు కలుగు**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని చిన్నికృష్ణ శతకములో ఒక వెన్నముద్ద.

**ఉద్గమ స్థానము**

అర్జునా! సమస్త ప్రపంచానికి పుట్టుక స్థానము నేనే **(అహం సర్వస్య జగతః ప్రభవః ఉత్పత్తిః)** అని భగవానుడు. ప్రపంచానికి ఉత్పత్తి స్థానము పరమేశ్వరుడే. ఉపాదాన కారణం తానే కావడం చేత, జగత్తుకు పుట్టుక స్థానము పరమేశ్వరుడే. అతని నుండే సమస్త విశ్వము ఆవిర్భవించింది **(ప్రపంచోత్పత్తి ఉపాదాన కారణత్వాత్ ప్రభవః)**.

అల లన్నిటికీ సముద్రమే ఎలా ప్రభవ స్థానమో, అలాగే జగత్తుకు పరమాత్మ ఉద్గమ స్థానము. అలలన్నీ సముద్రము లోనే ఉన్నట్లు, యావత్ప్రపంచము పరమాత్మ యందే ఉంది. అందరికీ పుడమి పుట్టినిల్లు. కాని, పుడమి తల్లికి పరమేశ్వరుడు పుట్టిల్లు.

**ఇంపు మల్లె కుంది కంపు ఉల్లి కుంది**
**ఇరువురిని కనిన పుడమి తల్లి ఉంది**
**తల్లి పుట్టిల్లు నీది మల్లయ్య తండ్రీ!**
**నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!**

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

**జీవన సారము**

అర్జునా! నా నుండి పుట్టిన ప్రపంచము నా వల్లనే బ్రతుకుతూ ఉంది **(మత్తః సర్వం ప్రవర్తతే)**. నా శక్తి తోనే నడుస్తూ ఉంది అంటున్నాడు. ఇది స్థితి వైభవము. పుట్టించిన వాడే పోషిస్తున్న వైనము.

ప్రపంచంలో ఎందరో ఎన్నో సృష్టిస్తూ ఉంటారు. కాని, సృష్టించే వాళ్ళే రక్షించాలి లేదా పోషించాలి అనే

నియమము మాత్రము లేదు. సృష్టించిన వాళ్ళు కొన్ని విషయాలలో రక్షించ లేని వాళ్ళుగా ఉంటే, రక్షించే వాళ్ళు సృష్టించే విషయంలో సామర్థ్యం లేని వాళ్ళై ఉంటారు.

జన్మ నిచ్చిన తల్లి ప్రసవించి మరణిస్తే, అది చూచి తట్టుకోలేక తండ్రి మరణించిన ఘటన లున్నాయి. జన్మించిన బిడ్డ అనాథగా మారితే, అపరిచితు లెవరో పెంచి పెద్ద చేసి పెళ్ళి చేసిన సంఘటనలూ ఉన్నాయి. సృష్టించిన వాళ్ళే పోషించాలని లేదు. కాని, భగవంతుడు అలా కాదు. అందరినీ తానే సృష్టిస్తాడు ***(జనయతి).*** అలా సృష్టింప బడిన వారి నందరిని తానే వృద్ధి చేస్తాడు ***(వర్ధయతి).***

వృద్ధి చెందడానికి కావలసిన దంతా తానే అందిస్తాడు. ఎవరెవరికి ఏవేవి అందించాలో, ఎప్పుడు అందించాలో, ఎక్కడ అందించాలో, ఎలా అందించాలో, ఎంత అందించాలో, ఎందుకు అందించాలో సర్వజ్ఞుడైన అతనికి తెలుసు. వారి వారి కర్మలను అనుసరించి ***(స్వకర్మాను రూపేణ)*** ఆయా ఫలాలను వారికి అందిస్తాడు. ఆ దివ్యాత్ముని కృప తోనే ఈ ప్రపంచం నడుస్తూ ఉంది ***(మత్తః ఏవ సర్వం జగత్ ప్రవర్తతే).***

భగవంతుడే మన జీవన జ్యోతి. ఆయనే మన జీవనసారము. అనుక్షణము ఆయన కృప తోనే బ్రతుకు సాగుతూ ఉంది. శ్వాసలు కదిపేది తానే. గుండె గంటను మ్రోగించేది తానే. రుధిర ప్రవాహానికి తానే ఆధారం. అధర చలనానికి తానే ఆలంబనము. ఆయన తోడుంటే జీవనము. వీడి దూరమైతే మరణము. ఇది అర్థమైతే ***(మత్వా)*** ఆ తరువాత అంతా యోగమే. అర్థం కాకపోతే, మిగిలేది అభియోగమే.

**జాలి లేక ఈశ్వరుడు**
**పిలిచినా రాడని అభియోగము**
**గాలి రూపమున దేవుడు**
**ఉన్నాడని తెలియుట భాగ్యము**
**గాలి ఏమిటి జాలి కాదా!**
**గాలి పోగా బ్రతుకు ఖాళీ కాదా!**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

### భక్తి నివేదనము

ఈ సమస్త ప్రపంచము పరమేశ్వరుని వల్లనే ఆవిర్భవించిందని, ఆయన వల్లనే నడుస్తూ ఉందని ఎవరు గ్రహిస్తారో ***(ఇతి మత్వా, ఏవం జ్ఞాత్వా)*** వాళ్ళు పరమేశ్వరునే సేవిస్తారు ***(మాం ఈశ్వరం భజన్తే సేవన్తే).*** అట్టివారు బుధులు ***(బుధాః),*** అంటే బుధజనులు, భక్తజనులు.

పరమేశ్వరుని ఎందరో సేవిస్తారు. పూజిస్తారు. కీర్తిస్తారు. ఆరాధిస్తారు. కాని, భావ ప్రధానంగా చేయరు. చేయలేక పోతారు కూడా. అలా చేయాలి అంటే, అది బుధులకే సాధ్యం. పరమార్థ తత్త్వాన్ని అర్థం చేసుకున్న వారే బుధులు ***(అవగత పరమార్థ తత్త్వాః).*** ఉద్భవ స్థానము, జీవన సారము పరమేశ్వరుడే అనే జ్ఞానం కలవారు బుధులు. వారే భక్తి నివేదనం చేయగలరు.

వారిది భావనా భక్తి. వారి భక్తి భావ సమన్వితంగా ఉంటుంది. పరమేశ్వరుని విషయంలో అభినివేశమే భావన. పరమేశ్వరుని పొంది తీరాలి అనే పట్టుదల, శ్రద్ధతో కూడిన అకుంఠిత దీక్ష, భగవంతునికి సంబంధించిన జ్ఞానము కలిగి ఉండటమే ఈ అభినివేశానికి కారణము.





*బుధులైన భక్తులు సేవించే విధానాన్ని వివరిస్తున్నాడు.*

**మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయన్తః పరస్పరమ్ ।**
**కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥** 9

***మచ్చిత్తాః-మద్గతప్రాణాః-బోధయంతః-పరస్పరం***
***కథయంతః-చ-మాం-నిత్యం-తుష్యంతి-చ-రమంతి-చ***

| | | | |
|---|---|---|---|
| మచ్చిత్తా | = నా యందే చిత్తము గలవారు | కథయంతః చ | = చెప్పుకొనువారు |
| మద్గత ప్రాణాః | = నా యందే ప్రాణము గలవారు | నిత్యం | = ఎల్లప్పుడు |
| పరస్పరం | = ఒకరి కొకరు | తుష్యంతి చ | = సంతసిస్తున్నారు |
| మాం | = నన్ను గూర్చి | రమంతి చ | = రమిస్తున్నారు |
| బోధయంతః | = బోధించుకొను వారు | | |

**అర్జునా! భక్తుల చిత్తము నా మీదే ఉంటుంది. వాళ్ళ ప్రాణాలు నా యందే ఉంటాయి. వాళ్ళు పరస్పరము నా బోధల లోనే ఉంటారు. నన్ను గూర్చే చెప్పుకుంటూ ఉంటారు. నా తత్త్వం లోనే రమిస్తూ ఉంటారు. నిత్యము సంతోషంగా ఉంటారు.**

### వ్యాఖ్య

ఉన్నవి అందరికీ ఉన్నాయి. లేనిది అందరికీ లేనిదే. ఇదీ ప్రపంచం. ఉన్నవి ఏవో అవి ఉన్నట్లు అందరికీ తెలుసు. లేనిది ఏదో అది కూడా స్పష్టం గానో, అస్పష్టం గానో అందరికీ తెలుసు. ఉన్న వన్నీ లేని దానిని పొందేందుకే ఉన్నాయని కూడా అందరికీ తెలుసు. ఆ లేనిది అవశ్యం పొంద దగింది అనేది కూడా అందరికీ తెలుసు. కనుక, ప్రపంచంలో అందరూ అదే పనిలో ఉన్నారు. లేని దానిని అన్వేషించి పొందే ప్రయత్నంలో ఉన్నారు. కాకపోతే, ఆ లేనిది ఎక్కడ ఉందో తెలిసి రావడం లేదు. అందుకే అన్వేషణ. సత్యాన్వేషణ.

ఇలా అన్వేషించే వారు మూడు విధాలుగా ఉంటారు. లేనిది ఎక్కడుందో తెలియకుండా అన్వేషించే వారు మొదటి వారు. ఉన్నచోటు తెలిసి పొందే ప్రయత్నంలో ఉండేవారు రెండవ వారు. వీరిరువురికి విలక్షణమైన వారు మూడవ వారు. వాస్తవానికి వారు అన్వేషకులు కారు. లేని దానిని పొంది తృప్తి చెందిన వారు.

ప్రతి మనిషికి దేహము, ఇంద్రియాలు, మనస్సు, ప్రాణము, ఇవన్నీ ఉన్నాయి. లేనిది ఆనందము. అందరూ వాంఛించేది కూడా ఆనందమే. అందుచేత, లేని ఆనందాన్ని పొందడానికి తమ కున్న దేహేంద్రియ ప్రాణ మనస్సుల ద్వారా ప్రయత్నం చేస్తూ ఉంటారు. ఆ ప్రయత్నంలో ఈ ఉపకరణా లన్నిటినీ వినియోగిస్తూ ఉంటారు.

### విషయానందం

ఆనందం ఎక్కడుందో తెలియకుండా అన్వేషించే వారు విషయ ప్రపంచంలో అన్వేషణ సాగిస్తూ ఉంటారు. వారి చిత్తేంద్రియ ప్రాణాలను విషయ సుఖాలను పొందే ప్రయత్నం లోనే పూర్తిగా వినియోగిస్తారు. వీరికి ఆనందం ఛాయా మాత్రంగా గోచరిస్తుంది. రేఖా మాత్రంగా ప్రాప్తిస్తుంది. అదే విషయానందం. అల్పానందం. స్వల్పానందం. అనిత్యానందం. వాటిని పెంచుకుంటూ, అల్పానందాలే అనంతానందాన్ని అందిస్తా యనే భ్రాంతిలో పడి పోతారు. వీరు వ్యర్థ జీవులు. బ్రతుకును వృథా చేసుకొనే వారు. అలా వృథా అవుతూ ఉంది అనే స్పృహ కూడా లేని వారు. వీరు పొందే సుఖం లౌకిక సుఖం. అది ఈ లోకంలో ప్రాప్తించినా, పర లోకంలో ప్రాప్తించినా, లోక సుఖం లౌకిక సుఖమే.

**భజనానందం**

ఆనందం ఎక్కడుందో తెలిసి అన్వేషించే వారు బుధులు. పూర్వ శ్లోకంలో మనం చూచిన వారు. పరమార్థ తత్త్వం అవగతమైన వారు. భక్తులు. తాము ఆశించే ఆనందం విషయాలకు సంబంధించింది కాదని, భగవద్విషయానికి సంబంధించిందని క్షుణ్ణంగా తెలిసిన వారు. అందుచేత వారి ప్రాణేంద్రియ చిత్తాలను పరమేశ్వరుని సేవలో వినియోగిస్తారు. తద్వారా భజనానందాన్ని పొందుతారు. భజనానందము బ్రహ్మానందానికి దారి తీస్తుందని వారికి తెలుసు కనుక, విషయానందము వైపు మరలకుండా భజనానందము లోనే తృప్తి చెందుతూ, బ్రహ్మానందం వైపు అడుగులు వేస్తూ ఉంటారు. వీరి సుఖం లౌకికం కాదు. అలౌకికం. ఇది భజనానందం.

**బ్రహ్మానందం**

వీరు అన్వేషకులు కారు. అనుభూతి పరులు. నిత్యమైన బ్రహ్మానందమును పొందిన వారు. అన్ని కోరికలు తీరిన వారు. నిత్యతృప్తులు. నిరాశ్రయులు. ఆత్మవిదులు. సదా ఆత్మానందంలో ఉండేవారు. వీరిది అనంతానందం. బ్రహ్మానందం. దేహేంద్రియ ప్రాణ మనస్సులు వీరికి కూడా ఉంటాయి. కాని, వాటికి సాక్షిగా, అకర్తగా వీరు శోభిస్తూ ఉంటే, అవన్నీ వీరి సేవలో పునీత మవుతూ ఉంటాయి.

మొదటి తెగ వారు ప్రపంచం వైపు ఆనందం కోసం పరుగులు తీస్తూ ఉంటారు. వీరికి శ్రమే గాని ఫలితం చిక్కదు, దక్కదు.

రెండవ తెగ వారు భక్తులు. వీరు లోకం వైపు పరుగులు తీయరు. వీరి లోకం వీరిది. అదొక ప్రత్యేక లోకం. లోకం గాని లోకం. కాలాన్నంతా లోకేశ్వరునితో గడిపే ప్రత్యేకమైన లోకం. ప్రేమలోకం.

మూడవ తెగ వారు నిత్యతృప్తులు. వారికి నియమాలు లేవు. నిష్ఠలూ లేవు. వారు ఆప్తకాములు. అన్నీ తమ లోనే ఉన్నవారు. వీరు లోకం లోకి వెళ్ళి ఏదీ సాధించేది లేదు. పోగొట్టు కొనేదీ లేదు. వీరిది పూర్ణానుభూతి. పరిపూర్ణానుభూతి. ఒకవేళ వీరు లోకంలో చరించినా, మొదటి వారి లాగా ఆనందం కోసం వెళ్ళరు. ఆనందంతో వెళ్తారు. వారు నడచి పోతూ ఉంటే లోకం పవిత్ర మవుతూ ఉంటుంది ***(వసుధాం పావయన్ విచచార)***. వారు సదానంద సాగరంలో నిమగ్నులై ఉండటమే కారణము ***(సదానంద సింధౌ నిర్మగ్న మానసః)***.

మన ప్రస్తుత శ్లోకం మొదటి తెగవారైన విషయ సుఖాభిలాషులకు సంబంధించింది కాదు. రెండవ తెగ వారైన భజనానంద పరులకు, ముముక్షువు లైన భక్తులకు సంబంధించింది. దీనిని మూడవ తెగ వారైన బ్రహ్మానంద స్వరూపులకు కూడా అన్వయించుకో వచ్చు. ప్రధానంగా మనం సాధకుల దృక్కోణం నుండే విశ్లేషించు కుందాం. చివరగా, సాధ్యరూపులు, సిద్ధస్వరూపు లైన బ్రహ్మజ్ఞానులకు వందనం సమర్పించు కుందాం.

అర్జునా! నా భక్తులు వారి చిత్తాన్ని నా యందే ఉంచుతారు ***(మచ్చిత్తాః మయి చిత్తం యేషాం తే మచ్చిత్తాః)***. వారి ప్రాణాలను నా యందే నిలుపు కుంటారు. ప్రాణాలు అంటే ఇంద్రియాలు అని చెప్పుకోవచ్చు. లేదా, జీవితాలు అని భావించ వచ్చు ***(మద్గత ప్రాణాః మాం గతాః చక్షురాదయః ప్రాణాః యేషాం తే మద్గత ప్రాణాః, అథవా మద్గత జీవనాః)***. వారు పరస్పరం నా బోధల తోనే ఉంటారు. విద్వద్గోష్ఠి సాగిస్తూ ఉంటారు ***(పరస్పరం బోధయన్తః అవగమయన్తః)***. నా వైభవాన్ని చెప్పుకుంటూ ఉంటారు ***(అన్యోన్యం కథయన్తః)***. సదా సంతుష్టులై ఉంటారు ***(తుష్యన్తి పరితోషం ఉపయాన్తి)***. రమిస్తూ ఉంటారు ***(రమన్తి)*** అని భగవానుడు భక్తుల వైఖరిని, జీవన విధానాన్ని వివరిస్తున్నాడు.

ఈ విధమైన ప్రవర్తన బ్రహ్మానందములో ఓలలాడే జ్ఞానులలో కూడా కనిపించ వచ్చు. కాకపోతే,





సాధకులలో, లేదా భక్తులలో అది అభ్యాస ప్రవృత్తిగా ఉంటుంది. జ్ఞానులలో అనుభూతి ప్రకాశంగా దర్శన మిస్తుంది.

ఈ మాత్రం ఉపోద్ఘాతంతో ఇక శ్లోకం లోకి ప్రవేశిద్దాం. ఉపోద్ఘాతం సుదీర్ఘంగా ఉన్నట్లు భావిస్తున్నారా? ఈ శ్లోకం నుండి పదమూడవ అధ్యాయంలో ప్రవేశించే వరకు ఆ మధ్యలో గోచరించే భక్తి సాధనమ దృష్టిలో ఉంచుకొనే ఇక్కడ కాస్త విస్తారంగా విశ్లేషించాను. ముమ్ముందు ఈ అవగాహన ఎంతగానో ఉపకరిస్తుంది.

**మచ్చిత్తులు**

చిత్తము భగవంతుని యందే గల వారు మచ్చిత్తులు. అంతర్నిష్ఠ గల వారు. భక్తులు భజనానందంలో తృప్తి చెందుతూ ఉంటారు. భగవంతుడే వారికి గమ్యము కనుక, వారి చిత్తము భగవంతుని యందే లగ్నమై ఉంటుంది. ఆసక్తి దేని మీద ఉంటుందో చిత్తము దాని వైపుకే పరుగులు తీస్తూ ఉంటుంది. భక్తులకు భగవంతుని యందే ఆసక్తి కనుక, వారు వివిధ కర్మలు చేస్తూ ఉండినా, వారి చిత్తము భగవంతుని యందే ఉంటుంది.

విషయానందమును అభిలషించే వారు విషయాలు బాహ్యంలో ఉన్న కారణంగా, బాహ్యము నందే చరిస్తూ ఉంటారు. భక్తులకు అంతర్యామి యైన భగవంతుని యందే ఆసక్తి కనుక, వారు అంతర్నిష్ఠ కలిగి ఉంటారు. ఒకవేళ అవసర నిమిత్తం ప్రపంచంలో వ్యవహారాల మధ్య చరించినా, వారి మనోవృత్తులలో భగవద్భావనే మారకుండా ఉంటుంది. వారే మచ్చిత్తులు. అన్య విషయముల మీదికి మరలని చిత్తము గల వారు.

ప్రహ్లాదుని మనస్సును మార్చాలని తండ్రి హిరణ్యకశిపుడు ఎంతగానో ప్రయత్నించాడు. దానవ వంశానికి విష్ణువు శత్రువు. గొప్ప విరోధి. నిందార్హుడే గాని పూజార్హుడు కాడు. అట్టి విష్ణువును కీర్తించడం మాన్పించాలని ఎంతగానో ప్రయత్నించాడు హిరణ్యకశిపుడు ***(దానవ శ్రేణికిన్ వైకుంఠుండు కృతాపరాధు డతనిన్ వర్ణింప నీ కేటికిన్?)***. కాని సఫలం కాలేక పోయాడు. ప్రహ్లాదుని మనస్సును శ్రీహరికి దూరం చేయలేక పోయాడు. భక్తుల చిత్తాన్ని భగవంతునికి దూరం చేయడం సాధ్య మయ్యే పని కాదు. కారణం, వారు 'మచ్చిత్తులు'. భగవంతుని యందు లగ్నమైన చిత్తాన్ని భగవంతునికి దూరంగా తీసికెళ్ళడం వాళ్ళకే సాధ్యం కాదు. ఇక ఆ పనిని ఇతరులు ఎలా చేయగలరు? ప్రహ్లాదుడు తండ్రి హిరణ్యకశిపునికి చెప్పిన సమాధానము మచ్చిత్తుల హృదయానికి అద్దం పడుతుంది.

**తే॥** ***ఇను మయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత మగు హృషీకేశు సన్నిధి నా విధమున***
***గరగు చున్నది దైవయోగమున జేసి బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంత మగుచు ॥***

మూర్ఖుడైన హిరణ్యకశిపునికి చెప్పి లాభం లేదని గ్రహించిన ప్రహ్లాదుడు, పరమేశ్వరునికి దూరమై వసించ లేని తన చిత్తము యొక్క స్థితిని తండ్రి ముందే గురువులకు వివరిస్తాడు.

'ఆచార్యా! ఇనుమును అయస్కాంతము ఆకర్షించినట్లు, దైవ కృప చేత, నా చిత్తాన్ని భగవంతుడు ఆకర్షించాడు. తద్వశమైన నా చిత్తము ఆయన వైపుకే వెళ్తూ ఉంది. మరొక చోట నా చిత్తము ఉండలేదు' అన్నాడు. 'మచ్చిత్తు' లైన భక్తుల పరాభక్తికి ఇదే నిదర్శనము.

**మద్గత ప్రాణులు**

భగవంతుని యందే ప్రాణాలు ఉంచిన వారు మద్గత ప్రాణులు. 'ప్రాణ' శబ్దానికి ఇంద్రియాలు అని ఒక

అర్థం. జీవితాన్ని నిలిపే పంచ ప్రాణాలు అని మరొక అర్థం. చక్షురాది ఇంద్రియాలు ఎప్పుడూ బహిర్ముఖ మయ్యే ఉంటాయి. కాని, భక్తుల చిత్తము ఈశ్వరుని యందే లగ్నమై ఉండటం చేత, తమ ద్వారా బాహ్య ప్రపంచంలో చరించే చిత్తం ఎప్పుడైతే అందుబాటులో లేదో, ఇంద్రియాలు తమంతట తాము వెళ్ళ లేక వెను దిరుగుతాయి. ఆంతర్యంలో చిత్తము శివార్చనలో ఉన్నందున, అంతర్ముఖమైన ఇంద్రియాలు ఈశ్వరారాధనలో పూజా సుమా లవుతాయి.

**హృషీకేణ హృషీకేశ పూజనం భక్తి రిత్యుచ్యతే।**

హృషీకములు అంటే ఇంద్రియాలు. ఇంద్రియాలకు ప్రభువు కావడం చేత భగవంతుడు హృషీకేశుడు ***(హృషీకాణి ఇంద్రియాణి తేషాం ఈశః).*** కనుక హృషీకముల చేత హృషీకేశుని పూజించడమే భక్తి అన్నది శాస్త్రం. వీరే మద్గత ప్రాణులు.

ప్రాణాలన్నీ పరమేశ్వరునిపై పెట్టుకొని జీవించే వారు కనుక వారు మద్గత ప్రాణులు. ప్రాణేశ్వరుడైన పరమేశ్వరుని సేవలో ప్రాణాలను అర్పించడాని కైనా వెనుకాడని పూర్ణ భక్తులు.

*చరణము:* **ప్రాణాలు పోయినా బ్రతుకు లుంటాయి**
**బ్రతుకులకు బ్రతుకులే అతుకు లవుతాయి**
**ఎన్ని జన్మ లైనా**
**వెతకెదను నిన్నే మది లోన**
*పల్లవి:* **నీవు లేక నేను లేను లేను**
**నిన్ను విడిచి నేను ఉండలేను** ॥ **నీవు లేక** ॥

అని మద్గత ప్రాణులైన భక్తుల హృదయాన్ని తెర పైకి తెచ్చింది చైతన్య గీతిక.

## పరస్పర బోధకులు

బుధజను లైన భక్తుల ఆంతరంగిక సౌందర్యాన్ని చూశాం. మరి, వారి వ్యవహార మెలా ఉంటుంది? ఏముంది, భోజనాన్ని బట్టే త్రేపు! చిత్తాన్ని బట్టే చేష్టలు! చిత్తంలో ఉన్నదంతా భగవచ్చింతనమే కనుక, వ్యవహారంలో కూడా అదే ఉంటుంది.

నిరంతరము విద్వద్గోష్ఠి జరుపుకుంటూ ఉంటారు. భక్తులతో కలిసి భగవత్తత్త్వమును ప్రతిపాదించే విషయాలను, వాక్యాలను విచారించుకుంటూ, వాటి నిశ్చితార్థ దర్శనం చేస్తూ ఉంటారు.

రాజకీయ పక్షులు ఒక చోట కూడితే ఏం చేస్తారు? సినిమా గువ్వలు ఒక చోట చేరితే ఏం చేస్తారు? పరమేశ్వరుని ఆరాధించే భక్త హంసలు కూడా ఒక చోట కలుసుకుంటే అలాగే ప్రవర్తిస్తారు. పరస్పరం పరమాత్మ వైభవాన్ని ముచ్చటించుకుంటూ ఉంటారు. దీనినే ఐశ్వర్య ప్రధాన భక్తి అంటారు.

## కథా శ్రవణము

భగవ దైశ్వర్యమును, పరమాత్మ జ్ఞానమును పరస్పరం బోధించుకోవడం ఐశ్వర్య ప్రధానమైన భక్తి అయితే, భగవంతుని అనంత కళ్యాణ వైభవాలను, అవతార వైభవ విశేషాలను ఒకరు వివరిస్తూ ఉంటే శ్రవణ మంగళంగా ఆలకించడము కథా శ్రవణము అనే మాధుర్య ప్రధానమైన భక్తి. ***కథా దిషు ఇతి గర్గః*** - పవిత్రుడైన పరమేశ్వరుని కథా విశేషాలను శ్రవణం చేయడమే భక్తి అని గర్గ మహర్షి నిర్వచనము.





## నిత్య సంతోషులు - ఆత్మరతులు

ఎల్లప్పుడు పరమేశ్వరుని నిత్యార్చనలో జీవిస్తూ ఉన్నందున, వీరు నిత్య సంతోషులు. ఇది అలం ప్రత్యయ రూప సంతోషము. **అలం** అంటే 'చాలు' అనే తృప్తి. ఆనందము. పరమేశ్వరుని భజనానందంలో నిత్య సంతోషులైన ఈ భక్తులు నిత్యతృప్తులై, మరొకటి అవసరం లేదు అనే ఆనందానుభూతిలో ఉంటారు. ఉత్తమోత్తమ మైన సుఖం లభించిందనే సంతృప్తితో ఉంటారు. ***సూ॥ సంతోషా దనుత్తమః సుఖలాభః*** - మరొకటి అవసరం లేని సంతోషము అన్నిటి కంటే ఉత్తమమైన సుఖప్రాప్తి అని పతంజలి యోగదర్శనం.

అనన్యులు, బుధులు అయిన ఈ భక్తులు ఏది చూచినా, ఏది వినినా, ఏది భావించినా - సర్వమూ ఈశ్వరమయంగా సంభావిస్తూ ఉన్నందున, వీరు సదా పరాభక్తి యందే రమిస్తూ ఉంటారు. 'మచ్చిత్తుల' నుండి నిత్య సంతృప్తు లైన ఆత్మరతుల వరకు మనం అధ్యయనం చేసిన వీరందరూ బ్రహ్మాభ్యాసంలో ఉన్న వారుగా శాస్త్రం అభివర్ణించింది. ఈ వర్ణనము కూడా ప్రస్తుత శ్లోక విషయం తోనే అన్వయింప బడింది. అదీ చూడండి.

***తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనమ్,***
***ఏత దేక పరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః॥***

ఇదే బ్రహ్మాభ్యాసం. సాధకులకు బ్రహ్మాభ్యాసంగా ఏది ఉందో, అదే బ్రహ్మజ్ఞానులలో సహజ లక్షణంగా శోభిస్తూ ఉంది. కనుక ప్రాతఃస్మరణీయు లైన బ్రహ్మజ్ఞానుల పరంగా కూడా ఈ శ్లోక భావాన్ని సమన్వయించుకో వచ్చు.

*ఇలా కేవలం భగవద్భక్తి లోనే జీవించే వారికి ఏమి ప్రాప్తిస్తుంది? చదవండి.*

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే ॥** 10

**తేషాం-సతతయుక్తానాం-భజతాం-ప్రీతిపూర్వకం**
**దదామి-బుద్ధియోగం-తం-యేన-మాం-ఉపయాంతి-తే**

| | | | |
|---|---|---|---|
| సతతయుక్తానాం | = సదా నా యందు మనస్సు గలవారు | మాం | = నన్ను |
| ప్రీతిపూర్వకం | = ప్రీతితో | ఉపయాంతి | = పొందగలరో |
| భజతాం | = సేవించే వారు | తం | = ఆ |
| తేషాం | = వారికి | బుద్ధియోగం | = బుద్ధి యోగమును |
| యేన | = ఏ యోగము చేత | దదామి | = ప్రసాదిస్తున్నాను |
| తే | = వారు | | |

**భక్తులు వారి చిత్తాన్ని సదా నా యందే ఉంచుతారు. ప్రీతితో నన్నే సేవిస్తూ ఉంటారు. వారికి నేను బుద్ధి యోగాన్ని ప్రసాదిస్తాను. దాని చేత వాళ్ళు నన్ను పొందుతారు.**

### వ్యాఖ్య

సతత యుక్తులై, ప్రీతి పూర్వకంగా భగవంతుని సేవించడము అనే కార్యాన్ని భక్తులు చేస్తే, భగవంతుడు వారిని అనుగ్రహిస్తూ బుద్ధియోగాన్ని ప్రసాదిస్తాడు. అదే వారిని భగవంతుని వద్దకు చేర్చుతుంది. ఇది శ్లోక హృదయం.

### సతత యుక్తులు

యుక్తుడు అంటే యోగి. సతత యుక్తుడు అంటే సదా యోగంలో ఉండేవాడు. ఇతడే అనన్య భక్తుడు. ఇలాంటి భక్తులే తొమ్మిదవ అధ్యాయం - ఇరవై రెండవ శ్లోకంలో మనం చర్చించుకున్న నిత్యాభియుక్తులు ***(సతత యుక్తానాం నిత్యాభియుక్తానాం).*** అప్పుడప్పుడు కాకుండా, ఎప్పుడూ భక్తిలో కొనసాగే వారు సతత యుక్తులు. సర్వకాల సర్వావస్థల యందు భగవంతుని యందే ఏకాగ్ర బుద్ధి కలిగి, వేదాంత శ్రవణాదుల యందే దృష్టిని, నిష్ఠను కలిగి యున్న వారు సతత యుక్తులు. బాహ్య విషయాల యందు ఏ విధమైన కోరిక లేని వాళ్ళు. బాహ్యాసక్తుల నుండి సంపూర్ణముగా విడిపడిన వాళ్ళు ***(నివృత్త సర్వ బాహ్యైషణానాం).*** అందుచేతనే ఏ ప్రతిబంధకములు లేకుండా భగవంతుని నిరంతరము సేవిస్తూ ఉంటారు ***(భజతాం సేవ మానానాం).***

బాహ్య విషయాసక్తి లేకుండా సదా భగవంతుని సేవిస్తున్నారు అంటే, పేరు ప్రఖ్యాతులు, సన్మాన సంపదలను ఆశించి భక్తి చేస్తున్నా రేమో! అనే సంశయం తలెత్త వచ్చు ***(కిం అర్థిత్వాదినా కారణేన? న ఇత్యాహ).*** అలాంటివి ఏవీ లేవని, కేవలం ప్రీతి పూర్వకం గానే, ప్రేమ పూర్వకం గానే, భక్తి పూర్వకం గానే భజిస్తున్నారు అంటున్నాడు. భక్తియుతులై సతతయుక్తు లవుతున్నారు.

### పరమ ప్రేమారాధన

వీరిది పరమ ప్రేమ రూపమైన భక్తి ***(సా త్వస్మిన్ పరమ ప్రేమ రూపా).*** ఇది జ్ఞానాఖ్య భక్తి. అంటే, జ్ఞాన మనే పేరు గల భక్తి. జ్ఞాన భక్తి. జ్ఞానముతో కూడిన భక్తి. జ్ఞానము వలన ఏర్పడిన భక్తి. పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానమే భక్తి. అందుచేత అది నిత్యభక్తి.

పొంద దగిన వాడు పరమేశ్వరుడు ఒక్కడే అనే జ్ఞానము నిత్యాభి యుక్తులకు స్పష్టంగా ఉంటుంది. సాధ్య రూపుడైన భగవంతుడు జ్ఞానరూపుడు అనే అవగాహన కూడా పుష్కలంగా ఉంటుంది. అందువల్ల వారిలో జ్ఞానాభిలాష మెండుగా ఉంటుంది. ఇదొక పక్వమైన దశ. అందుచేతనే నిత్యభక్తి వారిలో కొనసాగుతూ ఉంటుంది. వికసించిన పుష్పము పరిమళాలను వెదజల్లడానికి ఎలా శ్రమించదో, అలాగే జ్ఞానాసక్తితో వారిలో విరబూసిన భక్తి పుష్పము దివ్యమైన భక్తి కార్యాలనే సౌరభాలను సహజంగా, విరివిగా విరజిమ్ముతూ ఉంటుంది ***(భజతాం ప్రీతి పూర్వకం).***

ఈ ప్రేమ రూపమైన భక్తి కార్యాల వల్ల వారికి అంతఃకరణ శుద్ధి ఏర్పడుతుంది. వివేకము విశాల మవుతుంది. ఇదొక శుభ సమయము. నిత్యాభియుక్తులు, సతత యుక్తులు అయిన భక్తుల జీవితాలలో, భక్తి జ్ఞానముగా రూపాంతరం చెందే కళ్యాణ ముహూర్తము. భక్తి పుష్పము ఫలాగమ కాలానికి చేరువైన దశ ఇది. భక్తి సాధన ఫలవంతమై, జ్ఞాన ఫలాన్ని అందించే అనుగ్రహ కాలమిది. జీవుడే శివుడనే జ్ఞానాంకురము మొలకెత్తే దశ ఇది. ఈ దశలో భగవత్కృప బుద్ధియోగ రూపంలో వర్షిస్తుంది.

### బుద్ధి యోగము

సతత యుక్తులై, సదా ప్రేమారాధనలో పునీతు లైన భక్తులకు భగవంతుడు బుద్ధియోగాన్ని అనుగ్రహిస్తాడు ***(దదామి బుద్ధి యోగం).*** బుద్ధి రూపమైన ఉపాయమే బుద్ధియోగము. భగవంతుని స్వరూప జ్ఞానానికి సంబంధించిన వివేకమే ఇక్కడ బుద్ధి. అట్టి బుద్ధితో కూడిన యోగమే బుద్ధియోగము. ఏ జ్ఞానము చేత ఆత్మయే పరమాత్మ అనే ఎరుక కలుగుతుందో, అదే బుద్ధియోగము. ప్రకాశవంత మైన బుద్ధి వివేకముతో కూడిన యోగము. అదే జ్ఞానయోగము. పుష్పము ఫలంగా రూపాంతరం చెందినట్లు, కర్మయోగము జ్ఞాన యోగముగా రూపాంతరం చెందే అద్భుతమైన మలుపు ఇక్కడే. నరుడు భక్తిలో పరిపక్వం చెంది నరుడే నారాయణుడు అనే





ఆత్మస్పృహ కలిగేది ఇక్కడే. అదంతా పరమేశ్వరుని అనుగ్రహం తోనే జరిగి పోతుంది. నేను కాయ కావాలి, పండు కావాలి అని పువ్వు ఆశించదు. పువ్వు పువ్వుగా ఉండ గలిగితే, తరువాత కాయ, ఆ తరువాత పండు వాటంతట అవే ధర్మానుగుణంగా ప్రాప్తిస్తాయి. ధర్మరూపంలో ఉన్నది దైవమే కనుక, దైవానుగ్రహంతో అనన్య ప్రేమపుష్పము బుద్ధియోగ ఫలంగా రూపు దాలుస్తుంది. పుష్పమే ఫల మవుతుంది. **దాసోఽహం** అంటూ భక్తుడు భగవంతుని సమీపిస్తే, బుద్ధియోగాన్ని అనుగ్రహించి అతడిని **సోఽహం** రూపునిగా భగవంతుడే మలుస్తాడు. భక్తి జ్ఞానంగా మారుతుంది. నరుడు నారాయణుడై కూర్చుంటాడు. ఈ పరిణామాన్నంతా శ్రీ మధుసూదన సరస్వతి అందంగా ఒక్క శ్లోకంలో అందించారు.

**దాసోఽహ మితి యా బుద్ధిః పూర్వమాసీ జ్జనార్దనే ।**
**దాకా రాపహృత స్తేన గోపీ వస్త్రాపహారిణా ॥**

'నేను నీ దాసుణ్ణి' అని శ్రీకృష్ణ పరమాత్మను ఆశ్రయిస్తే, చోరత్వానికి అలవాటు పడిన నవనీతచోరుడు, గోపికల వస్త్రాలను అపహరించిన మురళీ లోలుడు స్వభావరీత్యా, **దాసోఽహం** లోని **దా** అనే అక్షరాన్ని దొంగిలించాడట. **దా** పోగా **సోఽహం** మిగిలింది అంటాడు. అంటే, భక్తితో భగవంతుని సమీపిస్తే, ఆయన భక్తుణ్ణి బుద్ధియోగం ద్వారా జ్ఞానిగా మార్చుతాడు అని అర్థం. ఇక్కడ **గోపీ వస్త్రాపహారిణా** అనే పద ప్రయోగం అద్భుతము. దేహమే వస్త్రము కనుక దేహస్మృతిని, అనగా దేహాభిమానాన్ని తొలగించి, దైవస్ఫూర్తిని నింపి, దైవ స్పృహను కలిగించాడు అని అర్థము.

***ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైత వాసనా -*** భగవంతుని అనుగ్రహం చేతనే మానవులకు అద్వైత భావన చిగురిస్తుందని దత్తాత్రేయుడు చెప్పడంలో కూడా ఇదే నిగూఢార్థము. అంతవరకు 'నేను వేరు - భగవంతుడు వేరు' అని భావిస్తూ ఉండిన సాధకునిలో ఆత్మయే పరమాత్మ **(అయమాత్మా బ్రహ్మ)** అనే భావన ఏర్పడటానికి ఈశ్వరానుగ్రహమే ప్రధాన కారణము. అదియే బుద్ధియోగ ప్రదానము. భక్తునికి లభించిన భగవ త్ప్రసాదము. ***ధియో యో నః ప్రచోదయాత్ -*** 'వరేణ్యుడు, వరణీయుడు అయిన ఆ దేవుడు మా బుద్ధిని ప్రకాశంలో ప్రవర్తింప చేయు గాక!' అనే గాయత్రీ మంత్ర వాక్యం లోని అంతర్భావం కూడా ఇదే.

**సిరులు వలదు నీ చూపే సిరులు మాకు**
**వలదు వరము నీ నగవే పరము మాకు**
**బుద్ధి దీపము వెలిగించు భవ్య చరిత**
**నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!**

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

భగవంతుడు ప్రసాదించే బుద్ధి యోగము చేత **(యేన బుద్ధి యోగేన)** ఆత్మయే పరమాత్మ అనే జ్ఞానాన్ని పొంది, ఆ జ్ఞానం చేత పరమాత్మను తమ స్వరూపంగా పొందుతారు **(మాం పరమేశ్వరం ఆత్మభూతం, ఆత్మత్వేన, ఉపయాన్తి ప్రతిపద్యన్తే).**

*భగవంతుడు బుద్ధి యోగాన్ని సతతయుక్తు లైన భక్తులకే ఎందుకిస్తాడు? చదవండి.*

**తేషా మే వానుకంపార్థ మహ మజ్ఞానజం తమః ।**
**నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥** 11

**తేషాం-ఏవ-అనుకంపార్థం-అహం-అజ్ఞానజం-తమః**
**నాశయామి-ఆత్మభావస్థః-జ్ఞానదీపేన-భాస్వతా**

అహం = నేను
తేషాం = వారి యొక్క
అనుకంపార్థం ఏవ = అనుగ్రహము కొరకే
ఆత్మ భావస్థః = ఆత్మభావము నందున్న
భాస్వతా = స్వయంప్రకాశము గల
జ్ఞానదీపేన = జ్ఞాన ప్రకాశము చేత
అజ్ఞానజం = అవివేక జనిత
తమః = చీకటిని
నాశయామి = నశింప చేస్తున్నాను

**అర్జునా! భక్తులను అనుగ్రహించాలని నేను వాళ్ళ బుద్ధిలో నిలుస్తాను. ప్రకాశించే జ్ఞాన దీపం చేత, వారిలో అజ్ఞానం సృష్టించిన అంధకారాన్ని అదృశ్యం చేస్తాను.**

**వ్యాఖ్య**

## దివ్యానుగ్రహం

భగవంతుని కొరకు మనం అడుగు ముందు కేస్తే, భగవంతుడు పది అడుగులు మన వైపుకు చకచకా వేసుకుంటూ వస్తాడని మహాత్ముల అనుభవం. అనన్యులై, సతతయుక్తులై, ప్రీతి పూర్వకంగా భక్తులు నన్ను ఆరాధిస్తూ ఉంటే, నన్నే తదేకంగా దర్శిస్తూ, నన్నే సేవిస్తూ ఉంటే, నేను వాళ్ళను చూడక పోతే, కనికరించక పోతే, కాపాడక పోతే, మరెవరు కనికరిస్తారు? అని భగవంతుడు ఆలోచిస్తాడట. ఇది ఆచార్యుల అభిప్రాయం.

తనను ఎవరు చూస్తారో దీపం వాళ్ళను చూస్తుంది. తనను ఆశ్రయించిన భక్తులను భగవంతుడు అనుగ్రహిస్తాడు. ఆరాధనా హృదయంతో మనం ఆయన వైపు చూస్తూ ఉంటే, అనుగ్రహ బుద్ధితో భగవంతుడు మనల్ని అవలోకిస్తూ ఆశీర్వదించడానికి సిద్ధ పడతాడు. దయ చూపే కార్యంలో నిమగ్న మవుతాడు.

***తేషా మేవ కథం నామ శ్రేయః స్యాత్*** - 'నన్నే ఆశ్రయించుకొని, నిరంతరం నా సేవ లోనే చరిస్తున్న వీళ్ళు శ్రేయస్సును పొందే దెలా? మరో ఆలోచన లేకుండా ఉన్నారు. సతత యుక్తులై ప్రేమతో సేవిస్తున్నారు. ఇదంతా అలౌకిక మైన కర్మే కదా! మరి, కర్మ జరిగితే ఫలితం అందాలి కదా! అదే కదా నా దయ అంటే ***(అనుకంపనం).*** కనుక వాళ్ళను దయ చూచేందుకు నేను ఏదైనా చెయ్యాలి ***(అనుకంపార్థం దయ హేతోః).***

ఏదో ఒకటి చెయ్యాలి. ఆ చేసే దేదో వారికి శ్రేయోదాయకంగా ఉండాలి. మోక్షార్థమై ఉండాలి. అలాంటి మేలు చేయడానికి నేను వాళ్ళ బుద్ధిలో ప్రవేశిస్తాను. వాళ్ళ అంతఃకరణంలో ఆత్మభావంలో ఉంటాను ***(ఆత్మ భావస్థః ఆత్మనః భావః అంతఃకరణా శయః తస్మిన్ ఏవ స్థితః).*** అంతఃకరణములో జ్ఞానవృత్తిగా ప్రకాశిస్తాను.

'నా భక్తుల బుద్ధిలో చీకటి ఉంది. అదే మోహ మనే చీకటి ***(మోహాంధకారం).*** ఒకటి మరొకటిగా తెలిసే ఈ మోహమనే తిమిరం అజ్ఞానం వల్ల కలిగింది ***(అజ్ఞానజం).*** ఇది నేడు ఏర్పడింది కాదు. అనేక జన్మలలో ఆర్జించుకున్న మోహ తిమిరం. ఈ చీకటిని సమూలంగా నశింప చేసి, వారి జీవితాలలో నిత్య కాంతిని నింపడమే నేను వారిపై చూపే దయ.

కనుక వారిని అనుగ్రహించి ఆశీర్వదించేందుకు నేను వారి బుద్ధి యందు నిలిచి ***(ఆత్మ భావస్థః),*** వెలిగే జ్ఞానదీపం చేత ***(భాస్వతా జ్ఞానదీపేన)*** వారి బుద్ధి లోని అజ్ఞాన జనితమైన మోహ తిమిరాన్ని నశింప చేస్తాను ***(అజ్ఞానజం తమః నాశయామి)'*** అంటున్నాడు భగవంతుడు.

ఇక్కడ మోహ మనే కార్యం, అజ్ఞాన మనే కారణం, ఈ రెండిటిని కలిపి చీకటిగా చెబుతున్నాడు. కార్యంలో కారణమే ఉంటుంది కనుక, మోహంలో ఉండేదంతా అజ్ఞానమే. కనుక, ప్రకాశించే జ్ఞానదీపం చేత అజ్ఞానమును, అజ్ఞాన జనితమైన మోహము అనే చీకటిని భగవంతుడు నశింప చేస్తూ ఉన్నాడు అని అర్థం.





ఒక్కసారి వెను దిరిగి చూస్తే, సతత యుక్తులై సదా మచ్చిత్తత్వాది సాధనల చేత **(మచ్చిత్తత్వాది ప్రకారైః** *-9 వ శ్లో)* భగవంతుని ప్రీతి పూర్వకంగా భక్తులు ఆరాధించడం వల్ల భగవదనుగ్రహాన్ని పొందుతారు. అట్టి భక్తులను అనుగ్రహించేందుకు భగవంతుడు వారి బుద్ధిలో జ్ఞానదీపాన్ని వెలిగిస్తాడు. జ్ఞానదీప ప్రకాశం చేత అజ్ఞానము, అజ్ఞాన జనిత మోహాంధకారము నశిస్తుంది. ఈ విధంగా తనను ఆశ్రయించిన భక్తులను భగవంతుడు అనుగ్రహిస్తాడు.

భక్తుల బుద్ధిలో జ్ఞానదీపాన్ని వెలిగించడము అంటే, ఆత్మయే పరమాత్మ అనే జ్ఞానవృత్తిని కలిగించడ మని భావము. కనుక, బుద్ధిలో వెలిగే జ్ఞానదీపము ఏదో కాదు, తన్నిష్ఠమైన వృత్తి విశేషము. జ్ఞానవృత్తి విశేషము. ఆత్మయే బ్రహ్మము అనే జ్ఞానమే జ్ఞానవృత్తి. నేను జీవుణ్ణి. పరిమితుణ్ణి. పుట్టే వాణ్ణి. చచ్చే వాణ్ణి అనే దంతా అజ్ఞాన వృత్తి. అదే అజ్ఞాన తిమిరము. జీవుడే శివుడు అనే జ్ఞానవృత్తి అజ్ఞానవృత్తిని నశింప చేస్తుంది. ఇక్కడే జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. జ్ఞానవృత్తి అజ్ఞాన వృత్తిని నశింప చేస్తుందే గాని ఆత్మను అందించదు. సృష్టించదు.

ఘటాదులను ఆవరించి యున్న తమస్సును సూర్యోదయ ప్రకాశము ఎలా నశింప చేస్తూ ఉందో, అలాగే ఆత్మను ఆవరించి యున్న అజ్ఞాన అంధకార మనే ఆవరణమును జ్ఞానవృత్తి నశింప చేస్తూ ఉంది. ఆవరణ భంగము జరగ గానే, చీకటి తొలగిన తరువాత ఘటాదులు ప్రకాశించినట్లు, అజ్ఞానము నశించ గానే ఆత్మ స్వయంగా ప్రకాశిస్తుంది.

పూర్వ శ్లోకంలో భగవానుడు బుద్ధియోగాన్ని ప్రసాదించాడు **(దదామి).** కాని, ఇక్కడ అజ్ఞాన తిమిరాన్ని తానే స్వయంగా నశింప చేస్తున్నాడు **(నాశయామి).** ఈ తేడాను గీతా భక్తులు స్పష్టంగా గ్రహించాలి. లేకపోతే, అనేక అపార్థాలు, అనర్థాలు తలెత్తుతాయి.

***దదామి*** అంటే ఇవ్వడము. ఇచ్చేవాడు ఉన్నాడు అంటే, పుచ్చుకొనే వాడు కూడా ఉన్నాడు. ఇక్కడ జీవేశ్వరుల భేదం స్పష్టంగా కనిపిస్తూ ఉంది. భక్తిలో ఇది అనివార్యం.

***నాశయామి*** అన్నప్పుడు పరమేశ్వరుడే స్వయంగా నశింప చేస్తున్నాడు. ఆయనే వెలుగు. ఆయనే దీపం. నశింప చేసే వాడూ తానే. పూర్వ శ్లోకంలో ***దదామి*** లాగా ఇక్కడ పుచ్చుకొనే వాడు లేడు. వాస్తవానికి ఇక్కడ కర్త లేడు. కర్త లేకుండానే జరిగే కార్యమిది. చీకటిని పోగొట్టే కార్యము వెలుగుకు లేదు. దీపం వెలుగుతుంది. అంతేగాని, చీకటిని పోగొట్టాలని వెలగదు. కాకపోతే, దీపకాంతిలో చీకట్లు నిలవ లేవు. అంతే. చీకటి అదృశ్యమై జ్యోతి ఒక్కటే ఉంటుంది. జ్ఞానం విషయంలో కూడా అంతే. జ్ఞాన జ్యోతి ఒక్కటే ఉంటుంది.

పూర్వ శ్లోకంలో ***(దదామి)*** ద్వైత ముంది. ప్రస్తుత శ్లోకంలో ద్వైతం లేదు. అద్వైతమే జ్ఞానరూపంలో భాసిస్తూ ఉంది.

## జ్ఞానదీపం

ప్రకాశిస్తున్న జ్ఞానదీపం చేత అజ్ఞాన జనితమైన మోహాంధకారాన్ని నేను నశింప చేస్తాను అన్నాడు భగవంతుడు. చీకటి సమస్య అయితే దానికి వెలుగొక్కటే పరిష్కారము. జ్ఞానదీపము చేత అజ్ఞానాంధకారమును తొలగించడమే కర్తవ్య మైనపుడు, దీపమును ప్రజ్వలింప చేసే కార్యాన్ని విడిచిపెట్టి, మరొక కార్యము, అది ఏదైనా కావచ్చు, దానిని ఆచరించి పొందే ప్రయోజనము ఉండదు. అందుచేత, **భాస్వతా** అనే విశేషణమును ప్రయోగించి 'ప్రకాశిస్తున్న జ్ఞానదీపము చేత' అని చెప్పడం జరిగింది. ఈ జ్ఞానదీపాన్ని శ్రీ శంకర భాష్యం రూపకాలంకారంలో దివ్యంగా అభివర్ణించింది.

ఇది **భాస్వతా జ్ఞానదీపం,** అంటే ప్రకాశించే జ్ఞానదీపము. దీపము ప్రకాశించాలి అంటే ప్రధానంగా

(1)వత్తి (2) నూనె (3) ప్రమిద (4) గాలి ఉండి తీరాలి. ఈ నాల్గింటిలో ఏ ఒక్కటి లేకపోయినా ప్రకాశము ప్రమాద యుతమే. మరి, ఇక్కడ మనం చూస్తున్న జ్ఞానదీపానికి ఇవి ఏమిటో అర్థం చేసుకుందాం. ఈ జ్ఞానదీపం వివేక ప్రత్యయ రూపము.

'బ్రహ్మచర్యము, సత్యము, అహింస మొదలైన సాధనల సంస్కారంతో ఏర్పడిన ప్రజ్ఞయే' ఈ జ్ఞాన దీపానికి వత్తి ***(బ్రహ్మచర్యాది సాధన సంస్కారవత్ ప్రజ్ఞా వర్తినా).*** 'వైరాగ్యమే' ఈ దీపానికి ఆధారమైన ప్రమిద ***(విరక్తాన్తః కరణాధారేణ).*** 'భక్తి వలన ప్రాప్తించిన అనుగ్రహమే' తైలము. ఈ తైలము చేత వత్తి తడుపబడి ఉంది ***(భక్తి ప్రసాద స్నేహాభిషిక్తేన).*** 'ఈశ్వర భావన యందు నిరంతరాసక్తి' అనే గాలి చేత ఈ దీపం చలిస్తూ ఉంటుంది ***(మద్భావ నాభినివేశ వాతారితేన).*** ఈ దీపము 'విషయాల నుండి విడిపడి, రాగద్వేషాల చేత కలుషితం కాని బుద్ధి' అనే గాలి లేని గదిలో ఉంది ***(విషయ వ్యావృత్త చిత్త రాగద్వేషా కలుషిత నివాతాప వరకస్థేన).*** ఈ విధమైన ఉపకరణాది సహకార విషయాలతో ప్రజ్వలించే జ్ఞానదీపము సమ్యగ్దర్శన ప్రకాశంతో విరాజిల్లుతూ ఉంది. ఈ విధంగా నిత్యాభియుక్తులై భగవంతుని నిరంతరాసక్తి చేత సేవించు భక్తులు మోక్షరూపుడైన భగవంతుని కన్నా అన్యమైన దానిని ఆశించరు కనుక, అది తెలిసిన భగవంతుడు వారిని అనుగ్రహించి తన స్వస్వరూపమును వారి ఆంతర్యంలో అభివ్యక్తం చేస్తాడు. ఈ విషయాన్నే కఠోపనిషత్తు కూడా ధృవ పరచింది.

***నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన***
***యమే వైష వృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥***

ఆత్మ ప్రవచనములచే లభించదు. మేధాశక్తి చేత ప్రాప్తించేది కాదు. విశేష శ్రవణము చేత సాధ్యము కాదు. (అర్హతను గుర్తించి) అతడు ఎవరిని ఎన్నుకుంటాడో అతనికే తన స్వస్వరూపమును అభివ్యక్తం చేస్తాడు. ఎవరికి అభివ్యక్త మవుతుందో వారే దర్శిస్తారు.

*జ్ఞానప్రాప్తికి భగవదనుగ్రహము అవశ్యమని, భగవత్కృప అనేది భక్తికే సాధ్యమని అర్జునుడు అర్థం చేసుకున్నాడు. భక్తి కార్యాన్ని దివ్యంగా సాగించడానికి, ఈశ్వర విభూతి వైభవము ఎంతగానో ఉపయుక్త మని భావించి, పూర్వం సంక్షిప్తంగా చెప్పిన విభూతులను విశేషించి విస్తారంగా చెప్పమని అర్జునుడు భగవంతుని ప్రార్థిస్తున్నాడు.*

**అర్జున ఉవాచ :**

పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్ ॥ 12
ఆహుస్త్వా మృషయః సర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥ 13

***పరం-బ్రహ్మ-పరం-ధామ-పవిత్రం-పరమం-భవాన్***
***పురుషం-శాశ్వతం-దివ్యం-ఆదిదేవం-అజం-విభుం***
***ఆహుః-త్వాం-ఋషయః-సర్వే-దేవర్షిః-నారదః-తథా***
***అసితః-దేవలః-వ్యాసః-స్వయం-చ-ఏవ-బ్రవీషి-మే***





| | | |
|---|---|---|
| భవాన్ | = | నీవు |
| పరంబ్రహ్మ | = | పరబ్రహ్మవు |
| పరంధామ | = | పరమ తేజస్వరూపుడవు |
| పరమం పవిత్రం | = | పరమ పవిత్రుడవు |
| త్వాం | = | నిన్ను |
| శాశ్వతం | = | నిత్యునిగా |
| దివ్యం | = | దివ్యమైన |
| పురుషం | = | పురుషునిగా |
| ఆదిదేవం | = | ఆదిదేవునిగా |
| అజం | = | పుట్టుక లేని వానినిగా |
| విభుం | = | ప్రభువుగా |
| సర్వే | = | సమస్తమైన |
| ఋషయః | = | మహర్షులు |
| దేవర్షిః | = | దేవర్షి యైన |
| నారదః | = | నారదుడు |
| తథా | = | అలాగే |
| అసితః | = | అసితుడు |
| దేవలః | = | దేవలుడు |
| వ్యాసః | = | వ్యాసుడు |
| ఆహుః | = | తెలిపినారు |
| స్వయం చ ఏవ | = | స్వయము గనే |
| మే | = | నా కొరకు |
| బ్రవీషి | = | చెబుతున్నావు |

**అర్జునుడు పలికెను :**

**భగవాన్! నీవు పరబ్రహ్మవు. పరంధాముడవు. పరమ పావనుడవు. పరమ పురుషుడవు. నిత్యుడవు. ప్రకాశ స్వరూపుడవు. ఆది దేవుడవు. పుట్టుక లేని వాడివి. సర్వవ్యాపివి.**
**ఋషు లందరు - దేవర్షి నారదుడు, అసితుడు, దేవలుడు, వేదవ్యాసుడు - అందరూ అలాగే చెబుతున్నారు. నువ్వు కూడా నాకు ఆ విధం గానే చెబుతున్నావు.**

**వ్యాఖ్య**

**అర్జునుని అవగాహన**

ఈ రెండు శ్లోకాలలో శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవంతుడే అని అర్జునుడు తన విశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నాడు. కేవలం పరమాత్మకు మాత్రమే సంబంధించిన కొన్ని లక్షణాలను పేర్కొంటూ స్తుతిస్తున్నాడు. ఈ విధమైన స్థిర విశ్వాసానికి పరమేశ్వరుడు స్వయంగా బోధిస్తున్న దానిని ప్రమాణంగా స్వీకరిస్తూ, గతంలో తాను మహర్షుల నుండి ఆలకించిన విషయాన్ని ఆప్త వాక్యంగా గ్రహిస్తూ, తన స్వానుభవాన్ని కూడా జోడిస్తూ తన అవగాహనను అభివ్యక్తం చేస్తున్నాడు.

బాగుంది. శ్రీకృష్ణుడు భగవంతుడే అనే సత్యాన్ని మహర్షుల ద్వారా పూర్వమే విని ఉన్నప్పుడు, నాల్గవ అధ్యాయారంభంలో, కృష్ణా! నువ్వు ఇప్పుడు పుట్టావు. సూర్యుడు సృష్ట్యాది లోనే ఉన్నాడు. మరి నువ్వు ఆదిలో సూర్యునికి బోధించినట్లు చెబుతున్న విషయాన్ని ఎలా స్వీకరించేది? ***(కథం విజానీయామ్?)*** అని అర్జునుడు ఎందుకు ప్రశ్నించాడు? తెలిసే ప్రశ్నించాడా? తెలియక ప్రశ్నించాడా? అనే ప్రశ్నను ఆ సందర్భంలో లేవనెత్తి నేను సుదీర్ఘంగా వ్యాఖ్యానించాను. చివరికి, అర్జునుడు తెలిసే ప్రశ్నించాడు అనే విషయాన్ని నేను సహేతుకంగా వివరించాను. అక్కడ నా వ్యక్తిగత మైన అభిప్రాయాన్ని చెబుతూ అర్జునుడికి తెలిసినా తనకు ఆరాధ్యుడైన అచ్యుతుడు స్వయంగా చెబితే వినాలని కుతూహల పడి ప్రశ్నించాడు అన్నాను. ఆ అభిప్రాయం సశాస్త్రీయమే నని ఇక్కడ ధృవ పడింది. 'కృష్ణా! నువ్వే నాకు స్వయంగా చెబుతున్నావు' అని అర్జునుడు స్పష్టంగా పలికాడు ***(స్వయమేవ మే బ్రవీషి).***

నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు మొదలగు ఋషులు చెబుతూ ఉంటే గతంలో విన్నాడు. ప్రస్తుతం శ్రీకృష్ణుడు స్వయంగా చెబుతూ ఉంటే వింటున్నాడు.

అసితుడు వ్యాసుని శిష్యుడు, దేవలమహర్షి తండ్రి. దేవలఋషి ధౌమ్యాచార్యుని జ్యేష్ఠ భ్రాత. ధౌమ్యాచార్యుడు మనకు మహాభారతం, అరణ్య పర్వంలో గణనీయ మైన పాత్రను పోషిస్తూ కనిపిస్తాడు. అరణ్యంలో తన నాశ్రయించిన బ్రాహ్మణులను, సాధువులను ఎలా పోషించాలి? అని ధర్మరాజు ప్రార్థించి నపుడు, సూర్య మంత్రాన్ని ఉపదేశించి, సూర్యదేవుని అనుగ్రహంతో అక్షయ పాత్రను ధర్మరాజు సాధించడానికి కారకుడు ధౌమ్యాచార్యుడే. ఈ ధౌమ్యాచార్యుని అన్నగారే దేవలఋషి.

దేవల ఋషి శ్రీమద్భాగవతం అష్టమ స్కంధములో అగుపిస్తాడు. 'హూహూ' అనే పేరు గల గంధర్వ శ్రేష్ఠుడు దేవల ఋషి శాప కారణం గానే మొసలిగా జన్మించి, సరోవరంలో గజేంద్రుని కాలు పట్టుకుంటాడు. గజేంద్ర మోక్షంలో దేవలఋషి ప్రస్తావన ఉంది ***(ముక్తో దేవల శాపేన హూహూ గన్ధర్వ సత్తమః).***

ఋషుల ద్వారా గతంలో అర్జునుడు ఆలకించినా, గురు ముఖతః శ్రవణం చేయడం వల్ల ఈ జ్ఞానము దృఢమైంది. కనుకనే బ్రహ్మ లక్షణాలను దివ్యంగా వర్ణిస్తున్నాడు.

**బ్రహ్మ నిర్దేశము**

జగద్గురు వైన గీతాచార్యుని స్తుతించడములో తనకు అవగతమైన పరమార్థ తత్త్వ వైభవాన్ని దివ్యంగా అభివర్ణిస్తున్నాడు అర్జునుడు.

భగవంతుడు ఒక కాలానికి పరిమితుడు కాడు, అంటే కాలపరిచ్ఛేదం లేనివాడు అని చెప్పడానికి 'పరంబ్రహ్మ' మనే పదప్రయోగమును, కాల పరిచ్ఛేదము లేని భగవంతుడు ఒక ప్రదేశానికి పరిమితుడు కాడని చెప్పడానికి 'పరంధామ' శబ్ద ప్రయోగమును, ఆయన వస్తువు కాదు జ్ఞానము మాత్రమే అని తెలియ చేయడానికి 'పవిత్ర' పదమును ప్రయోగించి, ***పరంబ్రహ్మ, పరంధామ, పవిత్ర*** మనే పదాల ద్వారా పరమాత్మను అపరిచ్ఛిన్నునిగా, అనంతునిగా అభివర్ణించాడు ***(అనంతః దేశకాల వస్తు అపరిచ్ఛిన్నః).***

ప్రస్తుతం 'పవిత్ర' మనే పదాన్ని మాత్రం ప్రత్యేకమైన స్పృహతో అసమానంగా పేర్కొన్నాడు. 'జ్ఞానానికి మించిన పవిత్రమైన వస్తువు మరొకటి లేద'ని నాల్గవ అధ్యాయం లోనే భగవంతుడు స్పష్టం చేశాడు *(4 - 38).* పరమేశ్వరుడు జ్ఞాన స్వరూపుడు కనుకనే పవిత్రాలలో పవిత్రుడుగా, మంగళకరమైన వాటిలో మంగళ స్వరూపుడుగా కీర్తింప బడ్డాడు ***(పవిత్రాణాం పవిత్రం యో మంగళానాంచ మంగళం*** - విష్ణుసహస్రనామం).

**సాధన సాధ్య సంబంధము**

అర్జునుడు మోక్షకామి. మోక్షం జ్ఞానరూపంలో ఉందని అర్థం చేసుకున్నాడు. జ్ఞానము పవిత్ర మైనది అని కూడా తెలుసుకున్నాడు. అట్టి జ్ఞానము బుద్ధిలో స్థిరంగా నిలవాలి అంటే భగవంతుడు జ్ఞానదీపాన్ని వెలిగించాలి. జ్ఞానదీపాన్ని అందరి బుద్ధులలో భగవంతుడు ఎందుకు వెలిగిస్తాడు? ఎవరిపై తన అనుగ్రహాన్ని వర్షింప చేయాలి అనుకుంటాడో, వారి బుద్ధుల లోనే వెలిగిస్తాడు.

మరి, భగవదనుగ్రహం ఎవరికి కలుగుతుంది? ఎవరు మచ్చిత్తత్వాది సాధనల ద్వారా, నిత్యాభియుక్తులై పరమేశ్వరునే భక్తితో సేవిస్తుంటారో, అట్టి వారి పైనే భగవదనుగ్రహం పడుతుంది. ఇదీ క్రమము.

సర్వదా, సర్వ కార్యాల ద్వారా భగవంతుని ఉపాసించే వారికి అమంగళం ఉండదు. పైగా ఈశ్వరానుగ్రహం ప్రాప్తిస్తుంది. బుద్ధిలో జ్ఞానదీపం ప్రకాశిస్తుంది. కారణం, వారి హృదయాలలో కేవలం భగవంతుడు ఉండటమే ***(ఆత్మ భావస్థః).***

***సర్వదా సర్వ కార్యేషు నాస్తి తేషాం అమంగళమ్ ।***
***యేషాం హృదిస్థో భగవాన్ మంగళాయతనో హరిః ॥***





ఏ భక్తుల హృదయాలలో మంగళ స్వరూపుడైన భగవానుడు ఉంటాడో, వారికి ఎక్కడ, ఎప్పుడు, ఏ కార్యాల యందు కూడా అమంగళము అనేది ఉండదు అని బృహన్నారాయణము.

కనుక, భక్తి సాధన చెయ్యాలని, భగవదనుగ్రహం పొందాలని, తద్వారా పవిత్రుడై, పవిత్రమైన జ్ఞానమును పొంది తరించాలి అనే సాధన సాధ్య సంబంధ విషయమైన అవగాహన పూర్ణంగా అర్జునునికి ఏర్పడటం చేత, విభూతి ఆరాధన ద్వారా పవిత్రు డయ్యేందుకు మరి కొన్ని విశిష్ట మైన విభూతులను అనుగ్రహించ మని అచ్యుతుని అర్థిస్తున్నాడు. భగవంతుని స్తుతిస్తున్నాడు.

*భగవ ద్వైభవాన్ని అర్జునుడు వర్ణిస్తున్నాడు.*

**సర్వమేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ ।**
**న హి తే భగవ న్వ్యక్తిం విదు ర్దేవా న దానవాః ॥** 14

**సర్వం-ఏతత్-ఋతం-మన్యే-యత్-మాం-వదసి-కేశవ**
**న-హి-తే-భగవన్-వ్యక్తిం-విదుః-దేవాః-న-దానవాః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కేశవ | = | కృష్ణా | భగవన్ | = | భగవంతుడా! |
| యత్ | = | ఏ విషయమును | తే | = | నీ యొక్క |
| మాం | = | నన్ను గూర్చి | వ్యక్తిం | = | స్వరూపమును |
| వదసి | = | చెబుతున్నావో | దేవాః | = | దేవతలు |
| ఏతత్ | = | ఈ | నవిదుః | = | ఎరుగరు |
| సర్వం | = | సమస్తమును | దానవాః | = | దానవులు |
| ఋతం | = | సత్యమని | న హి విదుః | = | ఎరుగరు కదా! |
| మన్యే | = | తలుస్తున్నాను | | | |

**కేశవా! కృష్ణా! నువ్వు ఏదేది చెప్పావో అదంతా సత్యమే అని భావిస్తున్నాను. భగవాన్! నీ పుట్టుకను దేవదానవులు కూడా ఎరుగ లేరు.**

**వ్యాఖ్య**

**ప్రామాణ్య నిశ్చయం**

***ప్రమాకరణం ప్రమాణం*** - 'ప్రమ' అంటే జ్ఞానము. జ్ఞానమును, అనగా ప్రమను కలిగించేది ప్రమాణము. అదే శాస్త్రము. శాస్త్ర మంటే వేదము. అందుచేత ప్రామాణ్యం కాని విషయాల్ని ఆర్ష ధర్మానుయాయులు అంగీకరించరు. అలాగే ప్రమాణ విషయము నందు శ్రద్ధ లేని వారు కూడా ప్రమాణ ఫలాన్ని అందుకోలేరు. శాస్త్రము, అనగా ప్రమాణము సంప్రదాయ గాడిలో నిలిచి బోధించే వ్యక్తి నుండి అంది నపుడే అది బుద్ధికి పడుతుంది. కనుక, శ్రోతకు ప్రమాణ ఫలం అందాలి అంటే శాస్త్రం మీద ఎంత విశ్వాసం ఉందో, శాస్త్రాన్ని అందించే వక్త, లేదా గురువు మీద కూడా అంతే విశ్వాసం ఉండాలి. అప్పుడే ప్రమాణం ఫలిస్తుంది ***(శాస్త్రస్య గురువాక్యస్య సత్య బుద్ధిః).*** ఇదే శ్రద్ధ. అర్జునుడు ఆ విధమైన శ్రద్ధా ప్రకటనం చేస్తున్నాడు.

గతంలో మహర్షుల ద్వారా వినడానికి, ప్రస్తుతం సాక్షాత్తు జగద్గురువైన శ్రీకృష్ణుని ముఖతః వినడానికి అదే తేడా. ప్రామాణ్య నిశ్చయం జరిగి నపుడే గురుబోధ వంట పడుతుంది. అందుకనే శ్రీకృష్ణుడు చెప్పిన దంతా సత్యమే అని తన విశ్వాసాన్ని పార్థుడు ప్రకటిస్తున్నాడు. ఇక్కడ సత్యం అనే దానికి పర్యాయ పదంగా 'ఋతం'ను వాడాడు. ఋతం అంటే సత్యమే అయినా, ఋతం అనే పదము మరేదో కూడా చెబుతుంది.

***సద్భిః అర్యతే ఋతమ్ -*** సత్పురుషుల చేత, లేదా ఋషుల చేత పొందబడేది ఋతము. ప్రస్తుతం కృష్ణుడు చెబుతున్నదే గాక, గతంలో తనకు ఋషులు చెప్పిన దంతా ***(ఏతత్ సర్వం)*** కూడా సత్యమే అని తాను భావిస్తున్నాడనే అర్థం ధ్వనిస్తూ ఉంది. భగవదామోదం ఉన్నప్పుడే ఋషుల మాటలైనా ప్రమాణా లవుతాయి.

ఈశ్వరుడు, ఈశ్వర జ్ఞానం వేరు కాదని ఇప్పటికే అనేక చోట్ల చెప్పుకున్నాం. వేదము జ్ఞానమయము. వేద నారాయణుడు జ్ఞాన స్వరూపుడు. కనుక, శ్రుతి ఆమోద ముంటే భగవంతుని ఆమోదం ఉన్నట్లే.

**దేవతలకు తెలిసిందా?**

**దానవులకు తెలుస్తుందా?**

భగవంతుని పుట్టుక, లేదా ప్రభావము ***(వ్యక్తిం ప్రభవం)*** దేవతలకు తెలియదు. ఇక దానవుల కేమి తెలుస్తుంది? భగవంతుని యందు రాగం గల వారు దేవతలు. ద్వేషం గల వారు దానవులు. భగవంతుణ్ణి రాగంతో తెలుసుకో లేము. ద్వేషం తోనూ పొంద లేము. ఆయన జ్ఞానానికే లభ్యుడు.

దేవతల్ని రక్షించడానికి, దానవుల్ని శిక్షించడానికి ఆదిదేవుడు అనేక అవతారాలను ధరించాడు. అలాంటి దేవదేవుని సురాసురులు ఎలా తెలుసుకుంటారు?

దేవదానవులు ఎవరో కారు. కశ్యప మహాముని కుమారులు. కశ్యపుడు నవబ్రహ్మలలో ఒకడు. ఆయనకు దితి, అదితి అని ఇద్దరు భార్యలు. అదితి సంతానము దేవతలు. దితి సంతానము దానవులు. దేవతల్ని రక్షించడానికి, దానవుల్ని శిక్షించడానికి అవతరించిన దేవదేవుని అదితి కశ్యపుల సుతులైన సురులు ఎలా తెలుసుకుంటారు? దితి కశ్యపుల కుమారులైన అసురు లెలా తెలుసుకుంటారు? వారుభయులకూ తండ్రి, నవబ్రహ్మలలో ఒకరైన కశ్యపుడే తెలుసుకోలేక పోయాడు కదా! ఈ అర్థం అర్జునుడు సంబోధించిన 'కేశవ' నామం నుండి వ్యక్త మవుతుంది.

*క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽ హం సర్వదేహినామ్*
*ఆవాం తవాంగే సంభూతౌ తస్మాత్ కేశవ నామవాన్*

బ్రహ్మ రుద్రాదులు ఆయన నుండి జన్మించడం చేత భగవంతునికి 'కేశవ' అనే పేరు కలిగింది అని హరివంశము.

*దేవ దానవు లందరికీ ఆదికారణ మైన ఆదిదేవుని తెలుసుకోవడం ఎవరి తరమూ కాదు. తనను తెలుసుకోవడం తనకే సాధ్యం.*

**స్వయ మే వాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।**
**భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15**

***స్వయం-ఏవ-ఆత్మనా-ఆత్మానం-వేత్థ-త్వం-పురుషోత్తమ***
***భూతభావన-భూతేశ-దేవదేవ-జగత్పతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పురుషోత్తమ | = | పురుషశ్రేష్ఠుడా! | త్వం | = | నీవు |
| భూతభావన | = | భూతములను సృష్టించిన | ఆత్మానం | = | నిన్ను |
| భూతేశ | = | భూతప్రభువా! | స్వయం ఏవ | = | స్వయముగనే |
| దేవదేవ | = | దేవతలకు దేవుడా! | ఆత్మనా | = | నీ చేతనే |
| జగత్పతే | = | జగత్ప్రభువా | వేత్థ | = | తెలుసుకుంటున్నావు |





**పురుషోత్తమా! భూతభావనా! భూతేశా! దేవదేవా! జగన్నాథా! నువ్వేమిటో నీ కొక్కడికే తెలుసు.**

**వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।**
**యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16**

***వక్తుం-అర్హసి-అశేషేణ-దివ్యాః-హి-ఆత్మవిభూతయః***
***యాభిః-విభూతిభిః-లోకాన్-ఇమాన్-త్వం-వ్యాప్య-తిష్ఠసి***

| | | | | | |
|---|---|---|---|---|---|
| త్వం | = | నీవు | తిష్ఠసి | = | ఉన్నావో |
| యాభిః | = | ఏ | దివ్యాః హి | = | దివ్యములైన |
| విభూతిభిః | = | విభూతుల చేత | ఆత్మవిభూతయః | = | ఆ ఆత్మవిభూతులను |
| ఇమాన్ | = | ఈ | అశేషేణ | = | నిశ్శేషముగా |
| లోకాన్ | = | లోకములను | వక్తుం | = | చెప్పుటకు |
| వ్యాప్య | = | వ్యాపించి | అర్హసి | = | తగుదువు |

**కృష్ణా! నువ్వు నీ విభూతుల చేత లోకాలన్నీ వ్యాపించావు. నీ విభూతులు దివ్యమైనవి . వాటిని చెప్పడం నీ కొక్కడికే సాధ్యం.**

**వ్యాఖ్య**

కృష్ణా! అన్నిటినీ, అందరినీ సృష్టించిన వాడవు నీవే. నీవే ఆదికారణానివి. భూతభావనుడవు. అలాగే అందరినీ పోషించే భూతేశుడవు నీవు. నీవే జగత్పతివి. అలాంటి నీ నుండి ఆవిర్భవించిన లోకాలు, ఆ లోకాలలో జీవించే వారు నిన్నెలా తెలుసుకుంటారు? నిన్ను నీవే తెలుసుకో గలవు. మరొకరు తెలుసుకో లేరు.

మా లోకంలో తెలిసిన వారు ఒకరు చెబితేనే మరొకరు తెలుసుకుంటూ ఉంటారు, ఏదైనా. నువ్వు అలా కాదు. ఒకరు చెప్పే అవసరం లేకుండా నిన్ను నీవే తెలుసుకుంటావు ***(త్వం స్వయం వేత్తా).*** అయినా, నిన్ను గూర్చి మరొకడు చెప్పాలి అంటే, అతడు నీతో సముడై ఉండాలి. అలా ఎవరున్నారు కనుక?

అయినా నా పిచ్చి గాని, మా లోకం లోనే ఒకరి మనస్సులో ఏముందో మరొకరికి అర్థం కాక చస్తుంటారు. కనీసం, ఎవరి మనస్సు వారి కర్థం అవుతుంది అని పూర్వం సర్ది చెప్పుకునే వారు. ఇప్పుడు ఆ ఆశలు కూడా లేవు. ఎవరి మనస్సు వాళ్ళకు అర్థం గాకనే, మరొకరికి డబ్బిచ్చి సలహాలు అడుగుతుంటారు. అలాంటి వారు నిన్ను తెలుసుకోగలరా?

పైగా, నీ విభూతులు అంతటా, అన్ని లోకాలలో వ్యాపించి ఉన్నప్పుడు, వాటిని అర్థం చేసుకొనే శక్తి ఎవరి కుంటుంది? నీకు తప్ప!

ఆకాశాన్ని ఆకాశమే తెలుసుకోవాలి. ఇక్కడ ఉండే నక్క, అక్కడ ఉండే నక్షత్రము ఆకాశాన్ని ఏమి తెలుసుకుంటాయి?

ఆకాశాన్నే తెలుసుకొనే అవకాశం లేనపుడు, ఆకాశానికి ఆధారమైన, సూక్ష్మాతి సూక్ష్మమైన నిన్ను గూర్చి తెలుసుకోవడం గాని, చెప్పడం గాని ఎవరికి సాధ్యం? ఎవరి కైనా సాధ్యమైతే, అది ఒక్కరికే. ఆ ఒక్కరు ఎవరో కాదు. నువ్వే.

*తనకు తానుగా తెలుసుకొనే అవకాశం లేదని గ్రహించిన అర్జునుడు, భగవ ద్విభూతులను వివరించ మని పరమేశ్వరునే అడుగుతున్నాడు.*

**కథం విద్యా మహం యోగింస్త్వాం సదా పరిచిన్తయన్ ।**
**కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా ॥** 17

**కథం-విద్యాం-అహం-యోగిన్-త్వాం-సదా-పరిచింతయన్**
**కేషు-కేషు-చ-భావేషు-చింత్యః-అసి-భగవన్-మయా**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యోగిన్ | = | యోగీశ్వరా | భగవన్ | = | భగవంతా |
| అహం | = | నేను | కేషు కేషు చ | = | ఏయే |
| త్వాం | = | నిన్ను | భావేషు | = | భావముల యందు |
| సదా | = | ఎల్లప్పుడు | మయా | = | నా చేత |
| పరిచింతయన్ | = | ధ్యానము చేయుచు | చింత్యః | = | చింతించదగిన వాడవు |
| కథం | = | ఎటుల | అసి | = | అగుదువు |
| విద్యాం | = | తెలిసికొందును | | | |

**యోగీశ్వరా! సదా ధ్యానిస్తూ నిన్ను నేను తెలుసుకొనేదెలా? భగవంతా! ఏయే వస్తువులలో నిన్ను ధ్యానించాలి?**

**వ్యాఖ్య**

పరమేశ్వరుడు సృష్టికి ఉపాదాన కారణ మైనపుడు, ఈ విశ్వమంతా పరమేశ్వరుడే. విశ్వం లోని ప్రతి వస్తువు పరమేశ్వరుడే. కుండ కుండగా ఉండటానికి మట్టి ఎలా కారణమో, విశ్వంలో ఏ వస్తువైనా, ఆ వస్తువుగా ఉండటానికి పరమాత్మే కారణము. కుండలో మట్టి ఎక్కడ ఉంది అంటే ఏమి చెప్పగలం? విశ్వంలో భగవంతుడు ఎక్కడున్నాడు, ఏ వస్తువులో ఉన్నాడు అని ప్రశ్నిస్తే ఏం చెప్పగలం? ఎక్కడ లేడు కనుక ఒక్కచోట ఉన్నాడు అని చెప్పాలి?

అంతటా భగవంతుడే ఉన్నా, అన్ని వస్తువులలో వాసుదేవుడే ఉన్నా, పరిమిత మైన మన మనస్సు సర్వత్ర నిండి యున్న పరమేశ్వర విభూతి చైతన్యాన్ని ధ్యానించ గలదా? అందుచేతనే మనస్సును నిలబెట్టుకోవడానికి ఏదో ఒక ఆలంబనం కావాలి. సాకార విభూతులలో దేనినో ఒక దానిని ఎన్నుకొని, దానిని ధ్యానానుకూలంగా మార్చుకోవాలి. అందుకే, ఏయే వస్తువులలో నిన్ను ధ్యానించ గలను? అని అర్జునుడు అడుగుతున్నాడు.

ఈ సందర్భంలో పరమేశ్వరుని *యోగి* అని, *భగవాన్* అని సంబోధించడం అర్జునుని లోని గీతా జ్ఞానానికి, అవగాహనకు అద్దం పడుతూ ఉంది.

***భగః అస్య అస్తీతి భగవాన్*** - 'భగము' కలవాడు భగవంతుడు. భగము అంటే సమగ్రమైన ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, సంపద, జ్ఞానము, వైరాగ్యము - ఈ ఆరు కళ్యాణ గుణములు కలవాడు భగవంతుడు. ఇవన్నీ భగవంతుని ఐశ్వర్యములే. విభూతులే. ఏయే విభూతులను ధ్యానం చెయ్యాలో చెప్పమని అడిగే సందర్భంలో అర్జునుడు శ్రీకృష్ణుని ***భగవన్*** అని సంబోధించడం ఎంతగానో సందర్భోచితంగా ఉంది.

అంతే గాక, ఏయే వస్తువులలో ధ్యానించాలి అని అడుగుతున్న ఈ సందర్భం లోనే, ***యోగిన్*** అని పరమాత్మను సంబోధించడం మరొక విశేషం. ఎందుకంటే, తాను ధ్యానం చెయ్యడానికి ఉద్యుక్తు డౌతున్నాడు. అది యోగ సాధన. యోగసాధన ద్వారా పొందబడే వాడు కనుక పరమేశ్వరుడు ***యోగిన్*** అయ్యాడు ***(యోగః జ్ఞానం తేనైవ గమ్యత్వాత్ యోగీ).***

*ఈశ్వర విభూతులను మళ్ళీ వినాలని అర్జునుడు ఆసక్తు డవుతున్నాడు.*





**విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥** 18

**విస్తరేణ-ఆత్మనః-యోగం-విభూతిం-చ-జనార్దన**
**భూయః-కథయ-తృప్తిః-హి-శృణ్వతః-న-అస్తి-మే-అమృతం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| జనార్దన | = | కృష్ణా! | కథయ | = | చెప్పు |
| ఆత్మనః | = | నీ యొక్క | అమృతం | = | జ్ఞానామృతమును |
| యోగం | = | యోగమును | శృణ్వతః | = | వింటున్న |
| విభూతిం చ | = | విభూతిని | మే | = | నాకు |
| విస్తరేణ | = | విస్తారముగా | తృప్తిః | = | సంతృప్తి |
| భూయః | = | మరల | న అస్తి హి | = | కలగడం లేదు |

**జనార్దనా! కృష్ణా! నీ యోగమును, విభూతిని సవిస్తరంగా మళ్ళీ చెప్పు. నువ్వు చెప్పే అమృతం లాంటి విషయాలు ఎంత విన్నా తృప్తి కలగడం లేదు.**

**వ్యాఖ్య**

భగవదైశ్వర్యాన్ని, ఈశ్వర విభూతులను మళ్ళీ **(భూయః)** చెప్పమని **(కథయ)** అర్జునుడు అచ్యుతుని అర్థిస్తున్నాడు. ఏడవ అధ్యాయంలో **రసోఽహ మప్సు కౌన్తేయ** అంటూ ప్రారంభించి కొన్ని భగవ ద్విభూతులను వివరించిన గీతాచార్యుడు, తొమ్మిదవ అధ్యాయంలో మళ్ళీ **అహం క్రతు రహం యజ్ఞః** అంటూ మొదలెట్టి మరి కొన్ని విభూతులను ప్రవచించాడు. అందుచేతనే ఇప్పుడు మళ్ళీ చెప్పమని అర్జునుడు అడుగుతున్నాడు. ఇప్పటికే ఒకటికి రెండు చోట్ల చెప్పి నపుడు మళ్ళీ చెప్పడ మెందుకు? చెప్పమని అడగడ మెందుకు? దానికి సమాధానం కూడా అర్జునుడే చెబుతున్నాడు. ఎంత విన్నా, వింటూ ఉన్నా **(శృణ్వతః)** తనకు తృప్తి కలగడం లేదట **(మే నాస్తి తృప్తిః)**. ఎందుకని తృప్తి కలగడం లేదు? బోధనా విషయం అమృతం లాంటిది కావడమే. అదే కారణం అంటున్నాడు. ఎంతటి అపూర్వమైన గురుశిష్య సంబంధమో ఇది!

అమృత బోధను అందించే గురువు ఒక వైపు, బోధామృతాన్ని పరవశించి పానం చేసే శిష్యుడు మరొక వైపు. చూడటానికి రెండు కళ్ళు సరిపోవడం లేదు. అలా ఉండాలి గురుశిష్యు లంటే. శిష్యుని శ్రద్ధకు వశపడి గురువు బోధిస్తూ ఉంటే, గురు బోధను శ్రద్ధాభక్తులతో పరవశించి శిష్యుడు వింటున్నాడు. గురుబోధ యందు పార్థునికి ఉన్న ప్రీతి, శిష్యుడిని అని చెప్పుకొనే ప్రతి వ్యక్తికీ, అతడు ఏ కాలం వాడైనా, ఏ దేశంలో ఉన్నవాడైనా, తప్పక ఉండి తీరాలి. అప్పుడే గురుబోధ ఫలిస్తుంది.

అమృతాన్ని దేవతలు కూడా త్రాగుతారు. అమృతాన్ని త్రాగిన వారు అమరు లవుతారు. అంతమాత్రాన, వారు జనన మరణాలను దాటి పోలేరు. అమృత స్వరూపులు కాలేరు. కాని, భగవంతుని జ్ఞానామృతాన్ని పానం చేసిన వారు అమృత స్వరూపు లవుతారు. కనుకనే, అమృతము లభించే సురలోక భోగాలను త్యజించి వచ్చిన కుంతీతనయుడు, బోధామృతాన్ని పానం చేయడానికి పరమేశ్వరుని పాదాలను ఆశ్రయించాడు. సురులు పానం చేసేది బ్రతికించే అమృతము. భక్తులు, జ్ఞానులు పానం చేసేది బ్రతుకు నిచ్చే, బ్రతికి ఉండగానే మోక్షము నిచ్చే తత్త్వామృతము. అందుకే తృప్తి కలగడం లేదు, తనివి తీరడం లేదు అంటున్నాడు అర్జునుడు. నిజమే, మోక్షము ప్రాప్తించే వరకు భక్తుని చిత్తము ఇలాగే ఉంటుంది. ఉండాలి.

తీరని ఆర్తిని, వెలితిని తీర్చుకొనే ప్రయత్నంలో, భగవ దైశ్వర్యాన్ని ధారణ చేసి, ధ్యానించి, తరించాలని భావించడం చేతనే, ఈశ్వర విభూతులను విస్తారంగా చెప్పమని ప్రార్థిస్తున్నాడు పార్థుడు. తన దివ్య విభూతులను వర్ణించడం భగవంతుడు ఇక ప్రారంభిస్తాడు. అర్జునుడు గీతలో శ్రీకృష్ణుని ప్రార్థించినట్లే, అర్జునుని పౌత్రుడు, పుణ్యాత్ముడు అయిన పరీక్షిత్తు శ్రీ శుకమహర్షిని భాగవతంలో అలాగే ప్రశ్నించాడు.

*క॥ ధారణ యే క్రియ నిలుచును? ధారణ కే రూప మెద్ది ధారణ యనగా?*
*ధారణ పురుషు మనోమల మే రీతి హరించు? నాకు నెరిగింప గదే॥*

అని గంగాతీరంలో పరీక్షిన్మహారాజు ప్రశ్నించి నపుడు, ***హరి విశాల రూప మందు జిత్తము చేర్చి నిలుప వలయు బుద్ధి నెరపి బుధుడు*** అని బదులిచ్చాడు శుకమహర్షి. ఆ ప్రయత్నం లోనే విభూతి ధ్యానం ఇక్కడ ప్రాప్తిస్తూ ఉంది.

ఈ సందర్భంలో అర్జునుడు గీతాచార్యుని ***జనార్దన*** అని సంబోధించాడు. ***జనైః అర్ద్యతే యాచ్యతే యస్మాత్ సః జనార్దనః -*** జనుల చేత అర్థింప బడేవాడు, యాచింప బడేవాడు, ప్రార్థింప బడేవాడు కనుక ఆయన జనార్దనుడు. అంతేకాదు. ***జనాన్ అర్దయతి సుఖయతీతి జనార్దనః -*** జనులను సుఖపెట్టే వాడు, ఆనందింప చేసేవాడు కనుక ఆయన జనార్దనుడు.

'జనార్దనా! మోక్షాన్ని కాంక్షించి నిన్ను అర్థిస్తున్నా. జనార్దనా! సాధన సాధ్యాలలో నువ్వే ప్రత్యక్షమై తృప్తి చెందని నన్ను తృప్తి పరచు. సంతృప్తి పరచు. స్వాత్మానుభూతిని ప్రసాదించు' అనే అభ్యర్థన ***జనార్దన*** సంబోధనములో ఇమిడి ఉంది.

*అర్జునుని భాగ్యంగా ప్రాప్తించిన జగద్గురువు విభూతుల మూటను విప్పే కార్యంలో నోరు విప్పుతున్నాడు.*

**శ్రీ భగవానువాచ :**

హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నా స్త్యన్తో విస్తరస్య మే ॥ 19

*హంత-తే-కథయిష్యామి-దివ్యాః-హి-ఆత్మవిభూతయః*
*ప్రాధాన్యతః-కురుశ్రేష్ఠ-న-అస్తి-అంతః-విస్తరస్య-మే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| హంత | = | అహో! | కురుశ్రేష్ఠ | = | అర్జునా! |
| తే | = | నీ కొరకు | మే | = | నా యొక్క |
| దివ్యాః హి | = | దివ్యములైన | విస్తరస్య | = | విభూతి విస్తారమునకు |
| ఆత్మవిభూతయః | = | నా విభూతులను | అంతః | = | అంతము |
| ప్రాధాన్యతః | = | ముఖ్యంగా | న అస్తి హి | = | లేదు గదా! |
| కథయిష్యామి | = | చెబుతున్నాను | | | |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**కురుశ్రేష్ఠా! అర్జునా! నా విభూతులు దివ్యములు కదా! వాటిలో ప్రధాన మైనవి చెబుతాను. విస్తరించి చెప్పడానికి వాటికి అంతం ఉంటే కదా!**

**వ్యాఖ్య**

ఈశ్వర ధ్యానాన్ని అనుష్ఠించడానికి ఉపకరించే పరమాత్మ విభూతులను విస్తరించి చెప్పమని అర్జునుడు





అడిగాడు. పిసికిన పిండినే మళ్ళీ పిసికినట్లు ***(పిష్ట పేషణ న్యాయము).*** చెప్పిన విభూతుల విషయాన్నే మళ్ళీ చెప్పడ మెందుకు? అని పరమేశ్వరుడు సంశయిస్తాడేమో నని, ఎంత విన్నా తృప్తి కలగడం లేదు కనుక, మళ్ళీ ***(భూయః)*** సవిస్తరంగా వివరించ మని అర్జునుడు ప్రార్థించాడు.

సవిస్తరంగా బోధించ మని అర్జునుడు అడిగితే, దివ్యమైన తన విభూతులకు అంతము లేదు కనుక, వాటిని సాకల్యంగా వివరించడానికి సాధ్య పడదు కనుక, ప్రాధాన్యతను దృష్టిలో ఉంచుకొని చెబుతాను అంటున్నాడు భగవంతుడు.

ఇక్కడ ప్రాధాన్యత అంటే, పరమేశ్వరుని అశేష కళ్యాణ గుణ విశేషాలలో ఎక్కడెక్కడ ఏదేది ప్రాధాన్యతను సంతరించుకొని ఉందో, అద్దానిని వివరిస్తాను అని అర్థము ***(ఏతత్ ప్రాధాన్యతః యత్ర యత్ర ప్రధానా యాయా విభూతిః తాం తాం ప్రధానాం ప్రాధాన్యతః కథయిష్యామి అహం).*** భగవంతునికి తేజోవంతము లైన విభూతులు ఉన్నాయి. తేజము లాగే శక్తికి సంబంధించినవి, బలానికి సంబంధించినవి కూడా ఉన్నాయి. ఇవే గాక విద్య, పౌరుష, మహత్త్వ విశేషాలలో ఎక్కడెక్కడ ఏదేది శ్రేష్ఠమో దానిని వివరిస్తాను అని అంటున్నాడు.

**అనంత విభూతులు**

భగవంతుడు అనంతుడు. కనుక, ఆయన విభూతులు కూడా అనంతము. ఇల లోని ఇసుక రేణువుల్ని, ఆకాశం లోని నక్షత్రాలను లెక్కించడం ఎలా సాధ్యపడదో, పరమేశ్వరుని అంతం లేని విభూతులను వివరించడం కూడా అలాగే సాధ్య పడదు.

ఈశ్వర విభూతులను విస్తరించి చెప్పడం సాధ్యం కాదు అని గీతాచార్యుడు అన్న మాటకి భాష్యకారు లైన శ్రీ శంకరులు 'సాకల్యంగా వివరించడానికి వంద సంవత్సరాలైనా సరిపోవు' అని వ్యాఖ్యానించారు ***(అశేషతస్తు వర్ష శతేనాపి న శక్యాః వక్తుం).*** ఇలా అనడంలో ఒక శ్లేష కూడా ఉంది. చెప్పడానికి వంద సంవత్సరాలు సరిపోవు అంటే, వినడానికి వంద సంవత్సరాలు సరిపోవు అనే కదా అర్థం! ఒకవేళ, చెప్పేవాడు సర్వ శక్తిమంతుడు కనుక, వంద సంవత్సరాలలో చెప్పేయగలడు అని అశాస్త్రీయంగా ఆలోచించినా, వినే వాడు వంద సంవత్సరాలు వినగలడా అనేది ప్రశ్న. ఎందుకని వినలేడు? మానవుని ఆయుర్దాయమే వంద సంవత్సరాలు కనుక! ***(శతం దీర్ఘమాయుః!).***

అర్జునా! అంతం లేని విభూతులను ప్రాధాన్యతను బట్టి వివరిస్తాను అంటే, కేవలం విభూతుల్ని వర్ణించడమే కాకుండా, విశ్వంలో దేని నైనా విభూతిగా దర్శించడం ఎలాగో అర్థమయ్యేలా చేస్తాను అని భావము. త్రాడును అందిస్తాను, ఆ పైన నువ్వే ప్రాకి పైకి వద్దువు గాని అని అర్థము.

ముముక్షువు లైన సాధకులకు ఈ విభూతి వైభవము అర్థమైతే, సాధన అందమైన మలుపు తిరుగుతుంది. అందరిలో ఉన్నది ఈశ్వర చైతన్యమే నని, ఎవరు ఎలా ఉన్నా, ఏది ఎలా ఉన్నా, అదంతా ఈశ్వర విభూతియే నని అర్థ మవుతుంది. ఈ అవగాహనలో తనను తాను అతీతంగా ఊహించుకొని అహంకారంతో విఱ్ఱ వీగడం గాని, లేక తనను తాను నీచంగా ఊహించుకొని కృంగి పోవడం గాని, లేక అన్యులను హీనంగా చూడటం గాని జరగదు. ఈ విధమైన పరివర్తన జీవితాన్ని అమాంతం ప్రగతి పథంలో నడుపుతుంది.

ఈ సందర్భంలో అర్జునుని **కురుశ్రేష్ఠా!** అని సంబోధించాడు వాసుదేవుడు. కురువంశంలో శ్రేష్ఠుడు అనేది బాహ్యార్థము. **కురు** అంటే చెయ్యి అని అర్థము. ఆచరించు అని భావము. శ్రేష్ఠుడు అంటే ఉత్తముడు లేదా ఉన్నతుడు అని అర్థం. అర్జునా! ధ్యానాన్ని సాగించడానికి నా విభూతి విశేషాలను వివరించ మని కోరావు. ఆచరించే వారిలో నువ్వు శ్రేష్ఠుడివి కనుక, విని విడిచి పెట్టడం కాకుండా, విడవకుండా ప్రారంభిస్తున్నాను.

పట్టుకొని, హృదయంలో పెట్టుకొని సాగిపో! అని సూచిస్తున్నాడు.

*'అర్జునా! అందులో ఏది ప్రథమ విభూతియో దాని తోనే మొదలు పెడుతున్నా. ఆలకించు!'* అంటూ *విభూతులను ఆరబోస్తున్నాడు.*

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।**
**అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మన్త ఏవ చ ॥** 20

***అహం-ఆత్మా-గుడాకేశ-సర్వభూతాశయస్థితః***
***అహం-ఆదిః-చ-మధ్యం-చ-భూతానాం-అంతః-ఏవ-చ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| గుడాకేశ | = | అర్జునా! | భూతానాం | = | భూతములకు |
| సర్వభూతాశయస్థితః | = | సర్వప్రాణుల యొక్క అంతర్హృదయము నందున్న | ఆదిః చ | = | ఆదియును |
| | | | మధ్యం చ | = | స్థితియును |
| ఆత్మా | = | ఆత్మను | అంతః చ | = | లయమును |
| అహం | = | నేను | అహం ఏవ | = | నేనే |

**గుడాకేశా! అర్జునా! అందరి హృదయాలలో ఉండే ఆత్మను నేను. ప్రాణులకు నేనే ఆదిని. నేనే స్థితిని. అంతము కూడా నేనే.**

**వ్యాఖ్య**

**ఆత్మ విభూతి**

విభూతి వర్ణనములో ఇదొక అద్భుతమైన ఆరంభము. ఇక్కడ నుండి ఇరవై శ్లోకాలలో, అంటే ముప్పై తొమ్మిదవ శ్లోకము వరకు విభూతులే వివరింప బడతాయి. మొదటి విభూతి పరమేశ్వరుడే. అందుచేత *అహం* అంటూ కదిలాడు.

ప్రాధాన్యత అంటే ఏదో అనుకున్నాను. ముందు తనను గూర్చే చెప్పు కుంటున్నాడు. ఆత్మస్తుతి కృష్ణుడికి కూడా తప్పలేదా! అని అర్జునుడు ఎక్కడ భావిస్తాడో నని, 'అర్జునా! మొదట నన్ను గూర్చి చెప్పుకున్నా నని నీకు అనిపిస్తే, పోనీ నువ్వే మొదట అనుకో!' అంటున్నాడు ఆనంద మోహనుడు.

'అదెలా? ***అహం*** అంటూ ముందు నిన్ను చెప్పేసుకున్నావు కదా! మళ్ళీ నే నేమిటి? అని ఆలోచిస్తున్నావా? బాగా చూడవయ్యా! ***అహం ఆత్మా*** - నేను ఆత్మను అన్నాను. అంతే కాదు. ***సర్వభూతాశయస్థితః*** - అందరి హృదయాలలో ఉన్న ఆత్మను అన్నాను. అర్జునా! మరి నువ్వెవరు? నువ్వూ సచ్చిదానంద స్వరూపమైన ఆత్మవే. అది నేనే. నువ్వు ఆత్మ అని నీకు అర్థమైతే, నువ్వు నేనే కదా! నేను నువ్వే కదా! మనిద్దరి మధ్య ఇక భేద మెక్కడుంది? అంతా అభేదమే కదా! ***(త్వమేవాఽహం . . . తత్త్వమేవ త్వమేవ తత్).*** ఇది అఖండ మహావాక్య బోధ నాయనా! ***తత్త్వమసి*** వాక్యార్థము. స్వరూప లక్షణము. ఇదే నా మొదటి విభూతి' అంటున్నాడు భగవానుడు.

ఇక్కడ గోవిందుని బోధలో ఉన్న గమ్మత్తు చూశారా! విభూతుల్ని విస్తరించి చెప్పడం సాధ్యం కాదు అన్నాడు. ప్రారంభిస్తూనే శ్లోకం మొదటి పాదం లోనే, మొదటి విభూతి లోనే సమస్తాన్ని, అనంతాన్ని సవిస్తరంగా చెప్పేశాడు. అఖండాత్మను తన ప్రథమ విభూతిగా ఎప్పుడైతే వర్ణించాడో, సమస్తము అఖండాత్మ లోనే ఇమిడి ఉన్నందున, ఈశ్వర విభూతులను సాకల్యంగా చెప్పిన వాడయ్యాడు. అదే గీతా వైభవము. గీతాచార్యుని ప్రాభవము.





**స్వరూప విభూతి**

ఏది ఉన్నా, ఎవరు ఉన్నా, అవి అలా ఉండట మనేది ఆత్మపై ఆధారపడి ఉంది అని ముందే తెలుసు కున్నాం కదా! యావత్ ప్రపంచానికి సత్తా స్ఫురణలను ప్రసాదించేది పరమాత్మయే కదా! కనుక ఉన్న దేదైనా, దాని వైభవము పరమేశ్వరునిదే.

క్షీరం మధురంగా ఉంటుంది. కాని ఆ మాధుర్యం ఎవరిది అనే ప్రశ్న పడితే, ఆ మాధుర్యము క్షీరానిది కాదు, క్షీరసాగరునిది అని అర్థ మవుతుంది. ఎందుకని? క్షీరం అలా ఉండటానికి కారణమైన వాడు తానే కనుక.

కాబట్టి, ప్రారంభము లోనే ఆత్మ విభూతిని వివరించి, ***కొండ అద్ద మందు కొంచెమై ఉండదా!*** అన్నట్లు, సమస్త విస్తార విభూతులు ఒక్క విభూతి లోనే ఒదిగి ఉండేలా పొదిగాడు. ఇదే పారమార్థిక రూప విభూతి.

అర్జునా! నువ్వు ఒక విభూతివి. మొదట నిన్ను నీవు విభూతిగా అర్థం చేసుకుంటే, ఆ తరువాత అన్నీ విభూతులు గానే అర్థ మవుతాయి. నీవు నీకు విభూతిగా అర్థం కానపుడు, అన్య విభూతులు అర్థమయ్యే ప్రశ్నే లేదు. ***శివో భూత్వా శివం పూజయేత్*** - శివుడవై, ఆ తరువాత శివుని పూజించు అనే నిగూఢమైన శాస్త్ర వాక్యానికి ఇదే అర్థం.

నిన్ను నువ్వు ఆత్మగా ఎప్పుడు అర్థం చేసుకుంటావో, అప్పుడు అందరి హృదయాలలో ప్రకాశించేది ఒకే ఆత్మ కనుక, అందరినీ, అన్నిటినీ పరమేశ్వర విభూతులు గానే దర్శిస్తావు. ఇది అర్థమైతే, విభూతి యోగం సమాప్త మైనట్లే. కానీ, ఇది అంత సులభంగా అర్థమయ్యే విషయం కాదు కనుక, దీనినే ఇరవై శ్లోకాలలో చెప్ప వలసి వస్తూ ఉంది.

**రూప విభూతి**

అర్జునా! సర్వ ప్రాణులకు ఆది మధ్యాంతాలు నేనే ***(అహమేవ ఆదిః భూతానాం కారణం, తథా మధ్యం స్థితిః, అన్తః ప్రలయః)*** అంటున్నాడు. అంటే, 'ఎవరి నుండి ఈ సమస్తమూ ఆవిర్భవించిందో, ఎవరిలో ఉంటూ ఉందో, ఎవరిలో లయిస్తూ ఉందో, అది నేనే' అనే తైత్తిరీయ శ్రుతి ప్రతిపాదించిన తటస్థ లక్షణాన్ని వివరిస్తూ, ఈ రూప వైభవము నాదే అంటున్నాడు. శ్లోకం లోని మొదటి పాదంలో స్వరూప విభూతిని ప్రథమ విభూతిగా వర్ణించి, శ్లోకము లోని రెండవ పాదంలో విశ్వరూపు డైన పరమేశ్వరుని రూప విభూతిని తటస్థ లక్షణం ద్వారా చెబుతున్నాడు. ఇది రెండవ విభూతి.

ఉత్తమాధికారులకు ప్రథమ విభూతి, మధ్యమాధికారులకు ద్వితీయ విభూతి సరిపోతాయి. ఈ రెండిటితో విభూతులను వివరించే ప్రథమ శ్లోకమైన ప్రస్తుత శ్లోకం ముగిసింది. ఇక ఇక్కడ నుండి ప్రవాహ రూపంలో వివరింపబడే విభూతు లన్నీ మందాధికారులకే నని సంప్రదాయంలో కనిపించే ఆచార్యుల అభిమతం.

ఆకాశానికి దూరంగా ఎవ్వరూ పోలేరు. ఇక ఆత్మకు దూరంగా ఎవ్వరైనా పోగలరా? ఆకాశానికి ఆధారమైంది ఆత్మే. ఆకాశం ఆత్మ నుండే వచ్చింది ***(తతః ఆకాశః సంభూతః).*** ఆత్మ లేకుండా ఎవ్వరూ లేరు. వాస్తవానికి ఉన్నది ఆత్మ ఒక్కటే. దీనిని స్వరూప విభూతిగా పేర్కొని జీవేశ్వరుల మధ్య భేదం లేదని నిరూపించాడు ***(జీవేశ్వర భేదం నాస్తి).*** ఇక రెండవ విభూతి యైన రూప విభూతిని వివరిస్తూ, ఈశ్వర జగత్తుల మధ్య భేదము లేదని నిర్ణయించాడు ***(ఈశ్వర జగద్భేదం నాస్తి).*** కనుక, ఆత్మయే సదా ధ్యేయ వస్తువు అనేదే మొదటి శ్లోకంలో చెప్పబడిన రెండు విభూతుల యొక్క సారాంశము.

ఈ శ్లోకంలో అర్జునుని *గుడాకేశా!* అని పిలిచాడు పరమేశ్వరుడు. 'గుడాకా' అంటే నిద్ర. 'ఈశ' అంటే ప్రభువు. గుడాకేశుడు అంటే నిద్రను జయించిన వాడు అని అర్థము *(గుడాకా నిద్రా తస్యాః ఈశః గుడాకేశః జిత నిద్రః ఇత్యర్థః).* స్వరూప స్థితిని అనుభూతిగా పొందాలి అంటే, అజ్ఞాన రూపమైన నిద్రను జయించాలి అని *గుడాకేశ* సంబోధనతో తెలియ చేశాడు.

*ఇక ఏయే రూపాలలో పరమేశ్వరుడు ధ్యేయరూపుడో చెబుతున్నాడు.*

**ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్ ।**
**మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ ॥** 21

*ఆదిత్యానాం-అహం-విష్ణుః-జ్యోతిషాం-రవిః-అంశుమాన్*
*మరీచిః-మరుతాం-అస్మి-నక్షత్రాణాం-అహం-శశీ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | మరుతాం | = | మరుత్తులలో |
| ఆదిత్యానాం | = | ద్వాదశాదిత్యులలో | మరీచిః | = | మరీచిని |
| విష్ణుః | = | విష్ణువును | నక్షత్రాణాం | = | నక్షత్రములలో |
| జ్యోతిషాం | = | జ్యోతులలో | శశీ | = | చంద్రుడను |
| అంశుమాన్ | = | కిరణములు గల | అహం | = | నేను |
| రవిః | = | సూర్యుడను | అస్మి | = | అయి యున్నాను |

**అర్జునా! ఆదిత్యులలో నేను విష్ణువు. జ్యోతులలో కిరణాలు గల సూర్యుణ్ణి. మరుత్తులలో మరీచిని. నక్షత్రాలలో చంద్రుణ్ణి నేనే.**

వ్యాఖ్య

**ఆదిత్యులలో విష్ణువు**

ద్వాదశ ఆదిత్యులలో తాను విష్ణువు అనే పేరు గల ఆదిత్యుడు *(ద్వాదశ ఆదిత్యేషు విష్ణుః నామ ఆదిత్యః).* అదితికి పుట్టిన వారు ఆదిత్యులు. వారు పన్నెండు మంది. వారే ధాతా, మిత్ర, అర్యమా, శక్ర, వరణ, అంశు, భగ, వివస్వాన్, పూషా, సవితా, త్వష్టా మరియు విష్ణువు. వీరిలో పన్నెండవ వాడైన విష్ణువు తాను అంటున్నాడు. ఈ విషయాన్ని మహాభారతం - శాంతిపర్వంలో శ్రీకృష్ణుడే స్వయంగా అర్జునునికి చెప్పినాడు.

***వ్యాప్తే మే రోదసీ పార్థ కాంతి రభ్యధికా స్థితాః*** - అత్యధిక మైన కాంతితో నేను భూమ్యాకాశాలలో ప్రకాశిస్తున్నాను. కనుక, అర్జునా! నన్ను విష్ణువు అని పిలుస్తారు *(విష్ణుః ఇతి అభిసంజ్ఞితః).*

ఇక్కడ 'విష్ణు' శబ్దమును ఆదిత్యులలో చూచి నపుడు, వామనమూర్తి అనే అర్థం కూడా వస్తుంది. అదితి కశ్యపులకు బిడ్డగా జన్మించుట చేత విష్ణువు ఆదిత్యు డయ్యాడు *(ఆదిత్యాం కశ్యపాత్ వామన రూపేణ జాత ఇతి ఆదిత్యః).* వామనమూర్తిని విభూతిగా ఉపాసించ మని కఠోపనిషత్ కూడా చెప్పింది *(మధ్యే వామన మాసీనం).*

**జ్యోతిస్సులలో రశ్మిమంతుడైన రవి**

జ్యోతి ర్మండలములో ప్రకాశించే జ్యోతిస్సులలో పరమేశ్వరుడు కిరణాలు గల రవి రూపుడు. అంటే, సూర్యుడు *(ఆదిత్యాత్మా).* రసమును స్వీకరించే కార్యమును నిర్వర్తించడము చేత సూర్యుడు 'రవి' శబ్ద వ్యపదేశ్యు డయ్యాడు. రసము అంటే జలము అని అర్థము. సముద్ర జలాలను ఉడికించి, ఆవిరిగా మార్చి, వాటిని మేఘ మండలములో నిలిపి, తిరిగి భూమండలానికి జీవనంగా వర్ష రూపంలో అందించడం చేత, సూర్యుడు రవి





నామధేయుడు *(రసాన్ ఆదత్తే రవిః).* ఈ విభూతిని తొమ్మిదవ అధ్యాయంలో కూడా చూశాము *(9 - 19).*

**మరుత్తులలో మరీచి**

ప్రకాశించే దేవతామూర్తులు మరుత్తులు. వారిలో అతిశయించిన ప్రకాశము కల మరీచి పరమేశ్వరుడే *(తేజస్వినా మపి తేజస్త్వాత్ మరీచిః).* ఎవరిలో ఏ తేజస్సు దివ్యంగా శోభించినా దానిని భగవ ద్విభూతిగా భావించాలి. అలా చేయడం చేత అహంకారం తలెత్తదు. తేజమును ఈశ్వర విభూతిగా గుర్తించ గానే ఈశ్వర సన్నిధిలో ఉన్నాము అనే అనుభూతి కలుగుతుంది. సన్నిధి సేవ ప్రాప్తిస్తుంది.

**నక్షత్రాలలో చంద్రుడు**

నక్షత్రాలలో తాను చంద్రుడట *(నక్షత్రాణాం అహం, శశీ చంద్రమాః).* ఇక్కడ కూడా ప్రకాశాతిశయమే ప్రధానము. ప్రస్తుతం శ్లోకం లోని నాలుగు విభూతులు కూడా తేజోమయ విభూతులే.

ఇక్కడ మరొక వ్యాఖ్యానము కూడా ఉంది. భగవద్గీతకు హనుమంతుడు పైశాచిక భాషలో వ్యాఖ్యానము వ్రాసినాడట. అక్కడ 'నక్షత్ర' అంటే గచ్ఛతి, పోవుట అనే అర్థాన్ని గ్రహించి, ***యోవా ఇహ యజమానోఽముం లోకం నక్షత్రే తత్ నక్షత్రాణాం నక్షత్రత్వమ్*** - ఈ లోకంలో పుణ్యకర్మ లాచరించిన యజమానులు వాటి ఫలాన్ని అనుభవించడానికి ఆ లోకానికి **(నక్షన్తే)** పోతున్నారు **(గచ్ఛన్తి).** అంటే, ఆ లోకాన్ని పొందుతున్నారు అని అర్థం. అందుచేత అది నక్షత్ర లోకము. ఆ నక్షత్ర మేదో అది చంద్రుడే. మరణానంతరము దక్షిణాయనంలో ప్రయాణించే వారిని గూర్చి చర్చించి నపుడు ఈ విషయాన్ని మనం చర్చించు కున్నాము కూడా ***(తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే*** *... 8 వ అ - 25 వ శ్లో).*

*మరి కొన్ని విభూతులను విందాము.*

**వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః ।**
**ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥** 22

**వేదానాం-సామవేదః-అస్మి-దేవానాం-అస్మి-వాసవః**
**ఇంద్రియాణాం-మనః-చ-అస్మి-భూతానాం-అస్మి-చేతనా**

| | | | | | |
|---|---|---|---|---|---|
| వేదానాం | = | వేదములలో | ఇంద్రియాణాం | = | ఇంద్రియాలలో |
| సామవేదః | = | సామవేదము | మనః | = | మనస్సును |
| అస్మి | = | అయి ఉన్నాను | అస్మి | = | అయి ఉన్నాను |
| దేవానాం | = | దేవతలలో | భూతానాం | = | భూతములలో |
| వాసవః | = | ఇంద్రుడను | చేతనా చ | = | చైతన్యమును |
| అస్మి | = | అయి ఉన్నాను | అస్మి | = | అయి ఉన్నాను |

**అర్జునా! వేదాలలో నేను సామ వేదాన్ని. దేవతలలో ఇంద్రుణ్ణి. ఇంద్రియాలలో నేను మనస్సు. ప్రాణుల లోని చేతనమును నేనే.**

వ్యాఖ్య

**వేదాలలో సామవేదం**

వేదాలలో సామవేదం తాను అంటున్నాడు **(వేదానాం మధ్యే సామవేదః అస్మి).** సామాత్మకం కావడం చేత వేదాలలో సామవేదం ఈశ్వర విభూతిగా కీర్తించ బడింది. **సా చ అమశ్చ సామ** - **సాః** మరియు **అమః** కలిసి

**సామః** అవుతుంది. 'సాః' అంటే ఋక్కు, 'అమః' అంటే గీత రూపమైన స్వరము. ఈ రెండిటి ఐక్యమే 'సామము'.

***సామవేదో గానేన రమణీయత్వాత్*** - గాన మాధుర్యము చేత రమణీయ మైనది కనుక, సామవేదము ఈశ్వర విభూతిగా చెప్పబడిందని నీలకంఠాచార్యుల వ్యాఖ్యానము. పఠించిన వారిని పావనము చేస్తుంది కనుక, పారాయణ ప్రధానం కావడం చేత కూడా ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది.

వేదాంత హృదయమైన **తత్త్వమసి** మహావాక్యము కూడా సామవేదం లోని ఛాందోగ్యోపనిషత్తు లోనే ఉంది.

మూడు సామములతో సామగుల చేత స్తుతింపబడే వాడు కనుక భగవంతుడు **త్రిసామా** నామధేయుడు ***(త్రిభిః సామభిః సామగైః స్తుత ఇతి త్రిసామా).*** పరమేశ్వరుడు సామగానము చేయువాడు కనుక **సామగః** నామధేయుడు ***(సామగాయతీతి సామగః).*** తానే సామవేద స్వరూపుడు కావడం చేత **సామ** శబ్దవాచ్యుడు ***(సామవేదో஽స్మి).*** ఈ మూడు నామాలు విష్ణుసహస్రనామం అరవై రెండవ శ్లోకంలో **త్రిసామా సామగ స్సామః** అని వరుసగా పఠింప బడ్డాయి. అంతే కాదు. నూట ఆరవ శ్లోకంలో **సామ గాయనః** అని కూడా భగవానుడు స్తుతింప బడ్డాడు. సామగాయనుడు అంటే సామములను గానం చేసే వాడు అని అర్థము ***(సామాని గాయతీతి సామ గాయనః).*** ఈ విధంగా సామవేదము ఈశ్వర విభూతి యని విష్ణుసహస్రనామం నాలుగు నామాలతో కీర్తించింది. ఇంతెందుకు? భారతీయ సంగీత శాస్త్రానికి సామవేదమే ఆధార మనే ఖ్యాతి కూడా ఉంది. బహుశ ఇదే కారణ మేమో, శాస్త్రీయ సంగీత కళా స్వరూపమైన శ్రీ త్యాగరాజస్వామి సామవేద వైభవాన్ని తన కృతులలో ఎంతగానో కీర్తించారు. అమృత తుల్యమైన సంగీత విద్య సామవేదము నుండే పుట్టింది అన్నారు ***సామజ వర గమన*** అనే కీర్తనలో. ***సామజవరగమన*** అంటే, సామవేదం నుండి పుట్టిన సంగీతములో గమించే వాడు అని అర్థము. ఇక చరణానికి వస్తే,

*సామ నిగమజ సుధామయ గాన విచక్షణ*
*గుణశీల ! దయాల వాల! మాం పాలయ!*
*సామజ వరగమన , సాధుహృత్సార , సాబ్జపాల , కాలాతీత , విఖ్యాత ,*

సామవేదము నుండి పుట్టిన అమృత తుల్యమైన సంగీత శాస్త్రములో ప్రవీణుడు, కళ్యాణ గుణశీలుడు, దయకు పాదు వంటి వాడైన భగవానుడు తనను పాలించు గాక! అని ప్రార్థించాడు త్యాగరాజ స్వామి.

వేదాలలో సామవేదానికి ప్రముఖమైన స్థానాన్ని ఇవ్వడం చేతనే, 'వేదాలలో నేను సామవేదాన్ని' ***(వేదానాం సామవేదో஽స్మి)*** అంటూ, సామవేదాన్ని తన విభూతిగా ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు ప్రవచిస్తే, ఈ భావాన్నే చిత్తంలో ధరించి, తంబుర చేత పట్టుకొని ***నాద తను మని శం*** అనే సంస్కృత కీర్తనను శివుని స్తుతిస్తూ, హృదయాలను రంజింప చేస్తూ తంజావూరు పుర వీధులలో చిత్తరంజని రాగంలో ఆలపించారు త్యాగరాజ స్వామి.

*నాదతను మనిశం శంకరం - నమామి మే మనసా, శిరసా* // నాద //
*మోదకర నిగమోత్తమ సామ - వేద సారం వారం వారం* // నాద //

నాదమే శరీరముగా కలిగిన పరమశివుని సదా మనసా, శిరసా నమస్కరిస్తున్నాను. సంతోషదాయక మైనది ***(మోదకర),*** వేదాలలో శ్రేష్ఠ మైనది అయిన ***(నిగమోత్తమ)*** సామవేదము యొక్క సార రూపుడైన ***(సామవేద సారం)*** శ్రీ శంకర భగవానుని పదే పదే ***(వారం వారం)*** నమస్కరిస్తున్నాను అని గానం చేశారు త్యాగరాజ స్వామి.





## దేవతలలో దేవేంద్రుడు

దేవతలలో తాను వాసవుడట. వాసవుడు అంటే ఇంద్రుడు **(రుద్రాదిత్యానాం వాసవః ఇన్ద్రః అస్మి).** ఇంద్రుడు సురరాజు కనుక శ్రేష్ఠుడు. వామనావతారంలో భగవంతుడు అదితి కశ్యపులకు బిడ్డగా జన్మించాడు. అంతకు ముందే వారికి కుమారుడుగా ఇంద్రుడు జన్మించాడు. ఆ విధంగా పరమేశ్వరుడు వాసవునికి అనుజుడై వాసవానుజుడయ్యాడు. అటు శ్రేష్ఠత్వము, ఇటు జ్యేష్ఠత్వము, రెండూ ఉండటం చేత ఇంద్రుడు ఈశ్వర విభూతి అయ్యాడు.

## ఇంద్రియాలలో మనస్సు

పదకొండు ఇంద్రియాలలో పరమేశ్వరుడు మనస్సు ***(ఇన్ద్రియాణాం ఏకాదశానాం చక్షురాదీనాం మనః చ అస్మి).*** కన్ను మొదలైన ఐదు జ్ఞానేంద్రియాలు, వాక్కు మొదలైన ఐదు కర్మేంద్రియాలు కలిపి దశేంద్రియాలు. మనస్సుతో కలిపి పదకొండు ఇంద్రియాలు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు మనస్సు పైనే ఆధారపడి ప్రవర్తిస్తాయి. జ్ఞానేంద్రియాల ద్వారా విషయ జ్ఞానమును స్వీకరించేది, కర్మేంద్రియాలు విషయాలలో చరించడానికి ఆజ్ఞ లిచ్చేది మనస్సే కనుక, బాహ్య కరణాలైన దశేంద్రియాల కన్నా, అంతఃకరణమైన సంకల్ప వికల్పాత్మక మగు మనస్సే ప్రముఖ మైంది కావడం చేత, ఇంద్రియాలలో మనస్సు భగవంతుని విభూతి. పైగా, ఇంద్రియాలు వాటి వాటి కార్యాలను మాత్రమే ప్రత్యేకంగా నిర్వహిస్తూ ఉంటే, మనస్సు ఇంద్రియా లన్నిటి లోను ప్రవేశించి సామాన్యంగా వ్యవహరిస్తూ ఉంటుంది.

## ప్రాణులలో చేతనము

మానవుల లోని దేహేంద్రియ మనోబుద్ధుల సంఘాతములో నిత్యము అభివ్యక్త మయ్యే చేతనము, అంటే బుద్ధివృత్తి ఈశ్వర విభూతి **(కార్యకరణ సంఘాతే నిత్యాభివ్యక్తా బుద్ధివృత్తిః చేతనా).** వివేకము కలిగి, వివేచనతో, విచక్షణా పూరితంగా వ్యవహరించే అభాస సహితమైన **(చిదాభాస)** బుద్ధివృత్తియే చేతనము. బుద్ధిలో చైతన్యము ప్రతిఫలించుట చేత ఉత్పన్న మయ్యే బుద్ధి వివేకమే చేతనము **(చిచ్ఛాయావేశతో బుద్ధౌ భానం** - దృగ్దృశ్య వివేకః). చైతన్యము అంతటా వ్యాపించి యున్నా అంతటా స్ఫురించదు. స్వచ్ఛమైన జలములో ప్రతిబింబము గోచరించినట్లు, బుద్ధి యందే ప్రతిఫలిస్తుంది **(సదా సర్వగతో ప్యాత్మా న సర్వత్ర భాసతే, బుద్ధౌ ఏవావ భాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్** - ఆత్మబోధః). చైతన్య ప్రతిబింబము కావడం చేత చేతనము లేక బుద్ధివృత్తి ఈశ్వర విభూతి.

*మరి కొన్ని విభూతులను వరుసగా చెప్పుకుందాం.*

**రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్ష రక్షసామ్ ।** 23
**వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణా మహమ్ ॥**

**రుద్రాణాం-శంకరః-చ-అస్మి-విత్తేశః-యక్షరక్షసాం**
**వసూనాం-పావకః-చ-అస్మి-మేరుః-శిఖరిణాం-అహం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| రుద్రాణాం | = | రుద్రులలో | వసూనాం | = | వసువులలో |
| శంకరః చ | = | శంకరుడును | పావకః చ | = | అగ్నిహోత్రుడను |
| అస్మి | = | అయి ఉన్నాను | శిఖరిణాం | = | శిఖరములు గల కొండలలో |
| యక్షరక్షసాం | = | యక్షులలోను రాక్షసుల లోను | మేరుః | = | మేరు పర్వతమును |
| విత్తేశః | = | కుబేరుడను | అహం | = | నేను |
| | | | అస్మి | = | అయి ఉన్నాను |

**అర్జునా! రుద్రులలో నేను శంకరుణ్ణి. యక్ష రాక్షసులలో కుబేరుణ్ణి. వసువులలో అగ్నిని. పర్వతాలలో నేను మేరు పర్వతాన్ని.**

**వ్యాఖ్య**

**రుద్రులలో శంకరుడు**

పదకొండు మంది రుద్రులలో శంకరుడు భగవద్విభూతి (*రుద్రాణాం ఏకాదశానాం శంకరః చ అస్మి*). ద్వాదశాదిత్యులలో తాను విష్ణువని ప్రారంభంలో చెప్పిన గీతాచార్యుడు, ఏకాదశ రుద్రులలో తాను శంకరుణ్ణి అని ప్రస్తుత శ్లోకంలో అంటున్నాడు.

*హరశ్చ బహురూపశ్చ త్ర్యంబక శ్చాపరాజితః ।*
*వృషో కపిశ్చ శంభుశ్చ కపర్దీ రైవత స్తథా ॥*
*మృగవ్యాధశ్చ శర్వశ్చ కపాలీ చ విశామ్పతే,*
*ఏకాదశైతే కథితా రుద్రా స్త్రిభువనేశ్వరాః ॥*

హరుడు, బహురూపుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, వృషాకపి, శంభువు, కపర్ది, రైవతుడు, మృగవ్యాధుడు, శర్వుడు, కపాలి - వీరే ఏకాదశ రుద్రులు. ఇవి హరివంశము లోని శ్లోకాలు.

ఈ ఏకాదశ రుద్రులలో శంకరుడు భగవద్విభూతి, నిజమే. మరి ఈ ఏకాదశ రుద్రుల నామాలలో శంకర నామం లేనే లేదు కదా అనే సందేహము తప్పక వస్తుంది. ఇక్కడ 'శంభువు' అని చెప్పబడిన నామమే 'శంకర' నామము. రెండిటికి ఒకే వ్యుత్పత్త్యర్థము.

*శం* అంటే సుఖము, శుభము, మంగళము, మోక్షము అని అర్థాలు. *శం సుఖం కరోతి ఇతి శంకరః* - భక్తులకు సుఖమును కలిగించు వాడు శంకరుడు. *శం సుఖం భక్తానాం (మంగళం మోక్షం) భావయతీతి శంభుః* - భక్తులకు శుభాన్ని, సుఖాన్ని, మోక్షాన్ని ప్రసాదించే వాడు శంభువు. కనుక శంభువు అన్నా శంకరు డన్నా ఒక్కటే.

**యక్ష రాక్షసులలో కుబేరుడు**

యక్షరాక్షసులలో తాను విత్తేశుడు. విత్తమునకు ప్రభువు. అంటే కుబేరుడు అని అర్థము (*విత్తేశః*). విత్తము అంటే లక్ష్మి. విత్తేశుడు వాస్తవానికి లక్ష్మీపతియే. కాకపోతే, విత్తము కుబేరుని అధీనంలో ఉంది. ఆ కారణం చేతనే కుబేరుడు విత్తేశుడు. *కుంబతి ధనమ్. కుబి ఆచ్ఛాదనే* - ధనమును దాచేవాడు కుబేరుడు. అంతే కాదు. ధనాన్ని వితరణ చేసే శక్తి గల వాడే విత్తేశుడు. విత్తాన్ని దాచి పెట్టుకొనే వాడు ధన దాసుడౌతాడే గాని ధనేశుడు కాలేడు. విత్తానికి ప్రభువు విష్ణుదేవుడు. విత్తానికి అధిష్ఠాన దేవత కుబేరుడు. కనుక ధనాన్ని తన అధీనంలో ఉంచుకొని పరమేశ్వరునికి విధేయుడుగా ఉన్న కుబేరుడు ఈశ్వర విభూతి.

**వసువులలో పావకుడు**

ఎనిమిది మంది వసువులలో పావకుడు ఈశ్వర విభూతి. పావకుడు అంటే అగ్ని (*వసూనాం అష్టానాం పావకః చ అస్మి అగ్నిః*). ఈ అష్ట వసువు లెవరో మహాభారతం - ఆదిపర్వంలో ఒక్క శ్లోకం చెబుతూ ఉంది.

*ధరోధ్రువశ్చ సోమశ్చ అహశ్చై వానిలోఽ నలః ।*
*ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవోఽ ష్టౌ ప్రకీర్తితాః ॥*

ధరుడు, ధ్రువుడు, సోముడు, అహుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు - ఈ ఎనిమిది మంది అష్ట వసువులు. వీరిలో పావకుడు ఈశ్వర విభూతి. మళ్ళీ, శంకరుని విషయంలో తలెత్తిన మీమాంసే





ఇక్కడ కూడా తలెత్తుతుంది. ఈ శ్లోకంలో చెప్పిన అష్ట వసువుల పేర్లలో పావక నామమే లేదు కదా!

నిజమే. అక్కడ శంభు నామము శంకర నామ మైనట్లు, ఇక్కడ అనల నామము పావక నామము. అలా ఎందుకు అనుకోవాలి? 'అనల' నామం గ్రహిస్తే అగ్ని అనే అర్థం వస్తుంది. మరి 'అనిల' నామం గ్రహిస్తే వాయువు కదా! అలాంటప్పుడు అష్ట వసువులలో వాయువును ఈశ్వర విభూతిగా ఎందుకు చెప్పకూడదు? కుదరదు.

*పూఙ్ పవనే. పునాతీతి* - పవిత్రము చేయువాడు కనుక పావకుడు. శుద్ధి చేసే వాటిలో అగ్నిదేవుడు శ్రేష్ఠుడు. పైగా మన, తన భేదం లేకుండా దేని నైనా భస్మం చేస్తాడు. వివాహమైనా, గృహప్రవేశ మైనా, యజ్ఞయాగాదు లైనా, జ్యోతి ప్రజ్వలనము చేయకుండా ఏ శుభ కార్యాన్ని ఆవిష్కరించము. కారణం, శుద్ధి జరిగితేనే సిద్ధి. శ్రీరాముడు లంకలో అడుగు పెట్టాలంటే, ముందుగా లంక శుద్ధి పడాలి. హనుమంతుడు లంకా దహనం చేయడంలో అంతర్భావం అదే. కనుక అష్ట వసువులలో అగ్ని ఈశ్వర విభూతి.

**పర్వతాలలో మేరు పర్వతము**

శిఖరములు గల పర్వతాలలో మేరు పర్వతము ఈశ్వర విభూతి (*మేరుః శిఖరిణామ్ శిఖరవతామ్, అహమ్*). కొన్ని పర్వతాలు శృంగములతో ఉంటాయి. కొన్ని శృంగములు లేకుండా ఉంటాయి. ఎత్తైన గిరులు శిఖరాలతో శోభిస్తూ ఉంటాయి. వాటిలో మేరు పర్వతము తన విభూతి అంటున్నాడు భగవంతుడు. ఎక్కడ ఏది అసమానమైన వైభవమును ప్రదర్శిస్తూ ఉంటుందో అది ఈశ్వర వైభవమే నని భావించాలి. అదే విభూతియోగ సారము.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।
సేనానీనా మహం స్కన్దః సరసామస్మి సాగరః ॥ 24

*పురోధసాం-చ-ముఖ్యం-మాం-విద్ధి-పార్థ-బృహస్పతిం*
*సేనానీనాం-అహం-స్కందః-సరసాం-అస్మి-సాగరః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | స్కందః | = | కుమార స్వామిని |
| పురోధసాం | = | రాజ పురోహితులలో | చ | = | మరియు |
| ముఖ్యం | = | ముఖ్యుడైన | సరసాం | = | సరస్సులలో |
| బృహస్పతిం | = | బృహస్పతిగ | సాగరః | = | సముద్రుడను |
| మాం | = | నన్ను | అహం | = | నేను |
| విద్ధి | = | తెలుసుకో! | అస్మి | = | అయి ఉన్నాను |
| సేనానీనాం | = | సైన్యాధిపతులలో | | | |

**పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతి నేనే. సేనాధిపతులలో నేను కుమారస్వామిని. సరస్సులలో నేను సాగరాన్ని.**

**వ్యాఖ్య**

**పురోహితులలో బృహస్పతి**

పురోహితులలో రాజ పురోహితుడు శ్రేష్ఠుడు. రాజ పురోహితులలో దేవరాజ పురోహితుడు శ్రేష్ఠుడు. అతడే బృహస్పతి. పురోహిత శ్రేష్ఠుడు. శ్రేష్ఠత్వ మున్నందున బృహస్పతి ఈశ్వర విభూతి.

ప్రజ లందరు రాజుకు నమస్కరిస్తారు. రాజు పురోహితునికి నమస్కరిస్తాడు. కనుక, రాజు కన్నా రాజ పురోహితుడు శ్రేష్ఠుడు.

రాజు లందరిలో దేవరాజైన దేవేంద్రుడు శ్రేష్ఠుడు. దేవరాజైన ఇంద్రుడు బృహస్పతికి నమస్కరిస్తాడు కనుక, దేవరాజ పురోహితుడైన బృహస్పతి పురోహితులలో శ్రేష్ఠుడు.

***బృహతాం దేవనాం వేద మంత్రాణాం వా పతిః బృహస్పతిః -*** దేవతలను, వేద మంత్రాలను 'బృహత్తులు' అంటారు. బృహత్తులకు పతి కనుక ఆయన బృహస్పతి. సురగురువు ***(సురాణాం ఆచార్యః).*** శ్రేష్ఠమైన వాక్కులు పలికే వాడు. బుద్ధిశాలి. విజ్ఞాన వాచస్పతి.

### సేనాధిపతులలో స్కందుడు

సేనలను నడిపే వాడు సేనాపతి, లేదా సేనాధిపతి. శివకుమారుడైన స్కందుడు, అంటే సుబ్రహ్మణ్యస్వామి దేవతల సేనను నడిపే వాడు ***(దేవ సేనాం నయతి ప్రాపయతి).*** అందుచేత సేనాపతులలో దేవసేనా పతి అయిన స్కందుడు ముఖ్యుడు.

***శత్రూన్ స్కందతి శోషయతి స్కందః -*** శత్రువులను శోషింప చేసేవాడు అయినందున కార్తికేయుడు స్కందుడు. శత్రు బాధను భరించలేక మనం దేవతలను ఆరాధిస్తూ ఉంటాం. అట్టి దేవతలకే శత్రు బాధను నివారించే వాడు అయి నందున సేనాపతులలో స్కందుడు శ్రేష్ఠుడు. కనుక ఆయన ఈశ్వర విభూతి.

### సరస్సులలో సాగరము

సరస్సులు అంటే జలాశయాలు. జలాశయాలు రెండు రకాలు. నిలకడగా ఒకే చోట ఉండేవి. నిలకడ లేకుండా ప్రవహించేవి. ప్రస్తుతం మనం నిలకడగా ఉండే జలాశయాలను చూస్తున్నాం. ప్రవహించే వాటిని మున్ముందు చూడబోతాము.

ప్రవాహం లేకుండా ఉండే జలాశయాలను సరస్సులు అంటారు. ఇవి మళ్ళీ రెండు రకాలు. ఖాతము, అఖాతము. త్రవ్వబడింది ఖాతము ***(ఖన్యత ఇతి ఖాతమ్).*** మనుషుల చేత త్రవ్వ బడింది. మరి, బంగాళా ఖాతాన్ని మనుషులు త్రవ్వారా? అందుచేత అది అఖాతము. అంటే మనుషుల చేత త్రవ్వ బడనిది ***(న ఖన్యత ఇతి అఖాతమ్).*** మరెవరు త్రవ్వారు? దేవతలు త్రవ్వారు. దేవతలు త్రవ్వినది కనుక అది దేవఖాతము ***(దేవైః ఖన్యత ఇతి దేవ ఖాతమ్).*** దేవఖాతాలైన సరస్సులలో ప్రధాన మైనది సముద్రము ***(సరసాం యాని దేవ ఖాతాని సరాంసి తేషాం సరసాం సాగరః అస్మి భవామి).***

**మహర్షీణాం భృగు రహం గిరా మ స్మ్యేక మక్షరమ్ । 25**
**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥**

***మహర్షీణాం-భృగుః-అహం-గిరాం-అస్మి-ఏకం-అక్షరం***
***యజ్ఞానాం-జపయజ్ఞః-అస్మి-స్థావరాణాం-హిమాలయః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | అస్మి | = | అయి ఉన్నాను |
| మహర్షీణాం | = | మహర్షులలో | యజ్ఞానాం | = | యజ్ఞములలో |
| భృగుః | = | భృగుమహర్షిని | జపయజ్ఞః | = | జపయజ్ఞమును |
| గిరాం | = | మాటలలో | స్థావరాణాం | = | స్థావరములలో |
| ఏకం | = | ఒకటే అయిన | హిమాలయః | = | హిమాలయమును |
| అక్షరం | = | అక్షరమును | అస్మి | = | అయి ఉన్నాను |





**మహర్షులలో నేను భృగు మహర్షిని. వాక్కులలో ఏకాక్షర మైన ఓంకారాన్ని, యజ్ఞాలలో జప యజ్ఞము నేనే. స్థావరాలలో నేను హిమాలయాన్ని**

**వ్యాఖ్య**

### మహర్షులలో భృగు మహర్షి

సప్త ఋషులలో భృగు మహర్షి శ్రేష్ఠుడు. సప్త ఋషులను ఉటంకించే శ్లోకాలలో ప్రథమంగా భృగువే ఉంటాడు ***( భృగు ర్మరీచి రత్రిశ్చ ).*** ప్రాధాన్యతను బట్టి ప్రథమ స్థానము. కనుక భృగువు ఈశ్వర విభూతి.

భృగువును వరుణుని కుమారుడిగా తైత్తిరీయ శ్రుతిలో చూస్తాం. అద్భుతమైన తాత్త్విక విషయాలను చర్చించిన శ్రేష్ఠుడు భృగువు. త్రిమూర్తులనే పరీక్షించిన ఘనుడు అని పురాణాలు చెబుతాయి. ఈ కారణాల చేత సప్త ఋషులలో భృగుమహర్షి ఈశ్వర వైభవంగా శోభించాడు.

### వాక్కులలో ఓంకారము

***గిరాం*** అంటే వాక్కులు. ***ఏకం అక్షరమ్*** అంటే ఒకే ఒక్క అక్షరము. అదే ఓంకారము. భగవంతుడు ఓంకార స్వరూపుడు. ప్రణవ రూపుడు. ఓంకారానికి ఓంకారేశ్వరునికి అభిధాన అభిధేయ సంబంధము ఉంది. భగవంతుడు అభిధేయము. ఓంకారము అభిధానము. అంటే, భగవంతుని పేరు ఓంకారము, లేదా ప్రణవము ***(తస్య వాచకః ప్రణవః).*** నామము, నామి వేరు కానందున, భగవంతునికి భగవ న్నామానికి తేడా లేదు ***(వాచ్య వాచకయోః అభేదః).*** అందుచేత, ఒకే అక్షరమైన ఓంకారము భగవ త్స్వరూపము. ***ఓమిత్యేకాక్షరం బ్రహ్మ*** అనే విషయాన్ని ఎనిమిదవ అధ్యాయంలో కూడా మనం చూశాం *(8 - 13).*

పరమాత్మ వాచకమైన ఓంకారము ప్రణవము ***(ప్రణవో నామ పరమాత్మనో వాచక ఓంకారః).*** ఓంకారము లేకుండా పరమేశ్వరుణ్ణి స్తుతించ లేము. ఓంకారముతో కీర్తింప బడేవాడు కనుక ఆయన ప్రణవ స్వరూపుడు ***(ఓమితి ప్రణౌతి ఇతి ప్రణవః*** - వేదం).

భగవంతుణ్ణి ఏ రూపంతో కొలిచినా, ఏ పేరుతో పిలిచినా, ముందు 'ఓంకారం' ఉండి తీరాలి. ***ఓం నమో నారాయణాయ, ఓం నమశ్శివాయ, ఓం నమో భగవతే వాసుదేవాయ -*** చూశారా! అదే ఓంకార వైభవము. అందుకే అది ఈశ్వర విభూతి.

### యజ్ఞాలలో జపయజ్ఞము

యజ్ఞాలలో జపయజ్ఞము ఈశ్వర విభూతి. ఓంకారాన్ని ఒకే అక్షర రూపమని తెలుసుకున్నాం. **జప** శబ్దం రెండు అక్షరాలతో ఉంది.

***జకారో జన్మ విచ్ఛేదః పకారః పాపనాశనః ।***
***జన్మ కర్మ కరో యస్మాత్ తస్మా జ్జప ఇతి స్మృతః ॥***

జన్మ రాహిత్యమును సూచిస్తూ **జ** కారము, పాప నాశాన్ని ప్రస్తావిస్తూ **ప** కారము **జప** శబ్దంలో శోభిస్తున్నాయి. జన్మకర్మలను నశింప చేసేది కనుక అది జప మన బడింది. అందుచేత యజ్ఞాలలో జప యజ్ఞము ఈశ్వర విభూతి.

యజ్ఞ యాగాదులను నిర్వహించడము అనేది వ్యయ ప్రయాసలతో కూడిన కార్యము. ధనం కావాలి. జనం ఉండాలి. అప్పుడే యజ్ఞాలు నిర్వహింప బడతాయి. యజ్ఞ సామగ్రులు, యజ్ఞ ద్రవ్యాలు, యాజ్ఞికులు - ఇవన్నీ ఉంటేనే యజ్ఞము.

కానీ జప యజ్ఞానికి ఇవేవీ అవసరం లేదు. వ్యయము లేదు. ప్రయాస ఉండదు. సాధకుడు స్వతంత్రంగా ఒక్కడే కూర్చుని చేసుకోవచ్చు. హింసాయుత మైంది కాదు. విరాళా లివ్వమని ఎవ్వరినీ బాధించ నవసరం లేదు. ఏ కాలంలో నైనా చేసుకోవచ్చు. ఏ ప్రదేశంలో నైనా ఆచరించ వచ్చు. ఎందుకని? జపంలో ఎవరో లేరు - జపించే సాధకుడు, జపింపబడే నామము, నామి మాత్రమే ఉన్నారు. అందుచేత జపయజ్ఞము ఈశ్వర విభూతి.

**స్థావరాలలో హిమాలయము**

చలించకుండా ఉండే వాటిలో హిమాలయము ఈశ్వర విభూతి. శిఖర ప్రధానంగా మనం మేరు పర్వతాన్ని చూశాం. ఇక్కడ శిఖర ప్రాధాన్యంతో పాటు వైశాల్యము కూడా ప్రముఖము. కనుక, స్థావరాలలో భగవంతుడు హిమాలయము ***(స్థావరాణాం స్థితి మతాం హిమాలయః).***

హిమము అంటే మంచు. మంచు తాపమును పోగొట్టే స్వభావం గలది ***(హన్తి తాప మితి హిమమ్).*** తాపమును పోగొట్టడమే కాకుండా జలాలను వృద్ధి చేస్తుంది కూడా ***(వర్ధతే జలమ్ అనేనేతి హిమమ్).*** గంగాది పుణ్య నదులు హిమాలయాల వల్లనే వృద్ధి చెందుతున్నాయి. కనుక హిమాలయము ఈశ్వర విభూతి.

అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ 26

*అశ్వత్థః-సర్వవృక్షాణాం-దేవర్షీణాం-చ-నారదః*
*గంధర్వాణాం-చిత్రరథః-సిద్ధానాం-కపిలః-మునిః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వవృక్షాణాం | = | సర్వ వృక్షములలో | గంధర్వాణాం | = | గంధర్వులలో |
| అశ్వత్థః | = | రావిచెట్టును | చిత్రరథః | = | చిత్రరథుడను |
| దేవర్షీణాం చ | = | దేవర్షులలో | సిద్ధానాం | = | సిద్ధులలో |
| నారదః | = | నారదుడను | కపిలః మునిః | = | కపిల మునిని |

**వృక్షాలలో నేను అశ్వత్థ వృక్షాన్ని. దేవర్షులలో నారదుణ్ణి. గంధర్వులలో నేను చిత్రరథుణ్ణి. సిద్ధులలో కపిల మహర్షి నేనే.**

**వ్యాఖ్య**

**వృక్షాలలో అశ్వత్థ వృక్షము**

వృక్షాలలో అశ్వత్థ వృక్షము భగవద్విభూతి. అశ్వత్థము అంటే రావి చెట్టు. దీనిని సంసార వృక్షము అని కూడా అంటారు. దీనిని మున్ముందు పురుషోత్తమప్రాప్తి యోగంలో విస్తారంగా చెప్పుకుందాం. ఈ సందర్భములో విభూతి ప్రాధాన్యమే కనుక, మంగళకర మైన అశ్వత్థానికి నమస్కారం చెబుదాము. అశ్వత్థము త్రిమూర్తుల స్వరూపము అంటుంది శాస్త్రం. వృక్షాలలో రాజు వంటిది అని దీనిని పెద్దలు శ్లాఘించారు.

***మూలతః బ్రహ్మరూపాయ మధ్యతః విష్ణు రూపిణే***
***అగ్రతః శివ రూపాయ తస్మై వృక్ష రాజాయ తే నమః ॥***

అశ్వత్థానికి మూలంలో బ్రహ్మదేవుడు, మధ్య భాగమైన కాండము మరియు శాఖాదులలో శ్రీ మహావిష్ణువు, అగ్ర భాగాన పరమశివుడు ఉంటారని ప్రతీతి. అందుచేత వృక్షరాజైన అశ్వత్థానికి నమస్కారం అన్నారు.

**దేవర్షులలో నారదుడు**

ఋషులు అందరిలో ఉంటారు. అన్ని చోట్ల ఉంటారు. రాజులలో ఋషు లున్నారు. వారు రాజర్షులు.





బ్రాహ్మణులలో ఋషు లున్నారు. వారు బ్రహ్మర్షులు. నరులలో ఋషు లున్నారు. వారు నరర్షులు. దేవతలలో ఋషు లున్నారు. వారు దేవర్షులు. అలా దేవర్షులైన వారిలో నారదమహర్షి భగవద్విభూతి.

***నరస్య ధర్మ్యం నారమ్ -*** నరులు ఆచరించ వలసిన ధర్మమును 'నారం' అంటారు. అట్టి ధర్మాన్ని అనుగ్రహించే మహాత్ముడు నారదమహర్షి. ***నారం (నరాణాం ధర్మం) దదాతి ఉపదిశతి ఇతి నారదః -*** నరులు ఆచరించ వలసిన ధర్మాన్ని ఉపదేశించే వాడు నారదుడు.

***దేవాశ్చ తే ఋషయశ్చ దేవర్షయః దేవానాం ఋషయః ఇతి వా -*** దేవతలుగా జన్మించారు. ఋషులుగా వాసి కెక్కారు. కనుక వారు దేవర్షులు. అట్టి దేవర్షులలో నారదమహర్షి ఈశ్వర విభూతి. ఆయన వ్యాస వాల్మీకాదులకు స్ఫూర్తి దాత. ధ్రువ ప్రహ్లాదాది భక్తులకు భక్తి ప్రదాత.

వ్యాస విరచితమైన అష్టాదశ పురాణాలలో నారద మహర్షి లేని పురాణం లేదు. అయినా వ్యాస మహర్షికి తృప్తి కలగలే దేమో, నారద పురాణం అని ప్రత్యేకంగా మరొక పురాణాన్ని రచించాడు.

**గంధర్వులలో చిత్రరథుడు**

గంధర్వులలో చిత్రరథుడు అనే గంధర్వుడు ఈశ్వర విభూతి. గంధర్వులు గొప్ప కళాకారులు. ***గానం ధారయన్తి -*** గానకళలో గొప్ప ప్రావీణ్యము కలవారు. అంతే కాదు. వారు గొప్ప సువాసన కలిగి ఉంటారట ***(సౌరభం గంధం అర్వన్తి ఇతి).*** ఎన్ని ప్రావీణ్యతలు ఉన్నా, గాన విద్యే వారిలో ప్రధానమైంది. ***గానం ధర్మః యేషాం తే గంధర్వాః -*** గానమే ధర్మముగా గల వారు గంధర్వులు. వారిలో చిత్రరథుడనే గంధర్వుడు గానశ్రేష్ఠుడు. కనుక అతడు ఈశ్వర విభూతి.

కుబేరుని ఉద్యాన వనం పేరు చైత్ర రథం. దీనిని చిత్రరథుడే అద్భుతంగా నిర్మించినట్లు ఉంది. ***చిత్ర రథో నామ గంధర్వ రాజః తేన నిర్మితమ్ చైత్ర రథమ్ -*** చిత్రరథుడు అనే గంధర్వరాజు నిర్మించినది కనుక కుబేరుని ఉద్యాన వనమును చైత్ర రథమ్ అంటారు. ఇతడు బహు చిత్రంగా రథాన్ని నడిపే వాడట. అందుచేత కూడా ఇతనికి చిత్రరథుడని నామధేయం వచ్చింది అంటారు. ఏది ఏమైనా, ఇవన్నీ అసమాన వైభవాలే కనుక చిత్రరథుడు ఈశ్వర విభూతి.

**సిద్ధులలో కపిలుడు**

సిద్ధ పురుషులలో కపిల మహర్షి ఈశ్వర విభూతి. కపిలుడు దేవహూతి కర్దముల పుత్రుడు. కపిలుడు భగవంతుని అంశావతారము. భాగవతము - తృతీయ స్కంధములో కపిలుని చరిత్ర సమగ్రంగా ఉంది. కర్దముడు సన్యసించి వెళ్ళిన తరువాత కపిలుడు తల్లి యైన దేవహూతికి జ్ఞానోపదేశం చేస్తాడు. అదే కపిలగీత.

కపిలుని బోధామృతమును పానం చేసి దేవహూతి తరించింది. కపిలుని జ్ఞానబోధను ఆలకించిన మాతృదేవి దేవహూతి, 'సర్వగతుడైన ఈ దివ్యాత్ముని నా గర్భము ఎలా భరించింది?' అని నిశ్చేష్టు రాలైంది.

***నీవు***
తే॥ ***లీల నాత్మీయ పాదాంగుళీ వినిర్గతామృతము గ్రోలినట్టి మహాత్మ! నీవు***
***గడగి నా పూర్వ భాగ్యంబు కతన నిపుడు పూని నా గర్భమున నేడు పుట్టితయ్య!***

మహానుభావా! ప్రళయ కాలంలో వటపత్రశాయివై, కాలి బొటన వ్రేలును నోటిలో ఉంచుకొని, లీలావతార మూర్తివై అమృతాస్వాదనము చేస్తూ ఉంటావు. నా భాగ్యంగా ఇప్పుడు నా కడుపున పుట్టావు అన్నది దేవహూతి.

కపిలదేవుని అనుగ్రహంతో దేవహూతి సిద్ధిని పొందినది. తల్లిని ఉద్ధరించిన ప్రదేశ మైనందున దానిని 'మాతృగయ' అంటారు. ఆమె దేహము తీర్థరూపాన్ని ధరించింది.

ఉచ్చైఃశ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్ ।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ 27

ఉచ్చైఃశ్రవసం-అశ్వానాం-విద్ధి-మాం-అమృతోద్భవం
ఐరావతం-గజేంద్రాణాం-నరాణాం-చ-నరాధిపం

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్వానాం | = | గుఱ్ఱములలో | నరాణాం చ | = | నరులలో |
| అమృతోద్భవం | = | అమృతముతో పుట్టిన | నరాధిపం | = | రాజు |
| ఉచ్చైఃశ్రవసం | = | ఉచ్చైః శ్రవము | మాం | = | నన్ను |
| గజేంద్రాణాం | = | ఏనుగులలో | విద్ధి | = | తెలుసుకో |
| ఐరావతం | = | ఐరావతము | | | |

**అశ్వములలో, అమృతము కొరకు క్షీర సాగరమును మథించి నపుడు పుట్టిన ఉచ్చైఃశ్రవము అనే గుఱ్ఱము నేనే. ఏనుగులలో నేను ఐరావతాన్ని. నరులలో రాజును నేను.**

**వ్యాఖ్య**

**అశ్వములలో ఉచ్చైఃశ్రవము**

అమృతము కొరకు దేవ దానవులు క్షీర సాగరాన్ని మథించి నపుడు పుట్టిన అనేక దివ్యమైన వస్తువులలో ఉచ్చైఃశ్రవము అనే గుఱ్ఱము ఒకటి. అది ఇంద్రుని గుఱ్ఱ మైంది. దానిని మించిన అశ్వ శక్తిని, వేగాన్ని మరొక చోట చూడలేము. అందుచేత అది ఈశ్వర విభూతి.

**గజములలో ఐరావతము**

ఐరావత మనేది మహేంద్రుని పట్టపు టేనుగు. అది శ్వేతహస్తి. నాలుగు దంతాలతో ప్రకాశిస్తూ ఉంటుంది. ***ఇరాః ఆపః సంతి యత్ర సః ఇరావాన్ సముద్రః తత్ర జాతః ఐరావతః*** - 'ఇరములు' అంటే జలములు. ఇరములు కలవాడు కనుక సముద్రుడు ఇరావంతుడు. ఇరావంతుని నుండి పుట్టింది కనుక అది ఐరావతము. మంగళకర మైనది. జంతువులలో ఏనుగు ఎత్తైనది. ఏనుగులలో ఐరావతము శ్రేష్ఠ మైనది. అందుచేత అది ఈశ్వర విభూతి.

**నరులలో నరాధిపుడు**

నరులకు అధిపుడు నరాధిపుడు. అంటే పాలించే రాజు. పరిపాలనా దక్షుడు కావడం చేత రాజు ఈశ్వర విభూతి. ***నా విష్ణుః పృథివీ పతిః*** - విష్ణుదేవుని అంశ కాని వాడు రాజు కాలేడు అని నానుడి. రాజు శక్తిమంతుడు. ప్రజలను ధర్మ మార్గమున నడిపే వాడు. ధర్మ రూపంలో ఉన్నది దైవమే కనుక, ధర్మ ప్రభువు ఈశ్వర విభూతిగా గుర్తింప బడ్డాడు. ఇది ధర్మ ప్రభువులకు వర్తిస్తుందే గాని అధర్మపరులైన రాజులకు వర్తించదు.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్ ।
ప్రజన శ్చాస్మి కందర్పః సర్పాణా మస్మి వాసుకిః ॥ 28

ఆయుధానాం-అహం-వజ్రం-ధేనూనాం-అస్మి-కామధుక్
ప్రజనః-చ-అస్మి-కందర్పః-సర్పాణాం-అస్మి-వాసుకిః

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | ధేనూనాం | = | ఆవులలో |
| ఆయుధానాం | = | ఆయుధములలో | కామధుక్ | = | కామధేనువు |
| వజ్రం | = | వజ్రాయుధము | అస్మి | = | అయి ఉన్నాను |





| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రజనః చ | = | పుట్టించునట్టి | సర్పాణాం | = | సర్పములలో |
| కందర్పః | = | మన్మథుడను | వాసుకిః | = | వాసుకిని |
| అస్మి | = | అయి ఉన్నాను | అస్మి | = | అయి ఉన్నాను |

**ఆయుధాలలో నేను వజ్రాయుధము. ధేనువులలో కామధేనువు. పుట్టించే వారిలో మన్మథుణ్ణి. సర్పాలలో నేను వాసుకిని.**

**వ్యాఖ్య**

**ఆయుధాలలో వజ్రాయుధము**

ఆయుధాలలో ఇంద్రుని ఆయుధమైన వజ్రాయుధము ఈశ్వర విభూతి. మహాత్ముడైన దధీచి మహాముని అస్థి వలన జనించింది కనుక పవిత్ర మైనది, పరమ శక్తివంత మైనది అయిన వజ్రాయుధము ఈశ్వర విభూతి. పర్వతాలను సైతం ఖండించే సామర్థ్యము గల ఆయుధము.

**ధేనువులలో కామధేనువు**

క్షీర సాగరాన్ని మథించి నపుడు ఐరావతము, ఉచ్చైఃశ్రవము లాగా కామధేనువు కూడా ఆవిర్భవించింది. ఇది మామూలు ఆవు కాదు. దేవధేనువు. దీనిని దేవ దానవు లిరువురూ కలిసి వసిష్ఠునికి సమర్పించారు.

సాధారణంగా ఆవులు పాలిస్తాయి. కాని, కామధేనువు అలా కాదు. నువ్వు ఏది ఆశిస్తే అది నీ పాలవుతుంది. ఏదైనా ఇస్తుంది. ఎంతైనా ఇస్తుంది. అలా మరొక రివ్వలేరు. అందుచేత కామధేనువు ఈశ్వర విభూతి.

**ప్రజన కారణాలలో మన్మథుణ్ణి**

జనోత్పత్తి హేతువులలో ఆకర్షణను కలిగించే అద్భుత శక్తి మదనునిది. కామోద్రేకాలను రెచ్చగొట్టి ఇరువురిని ఒకటి చేసి సంతతి కొనసాగుటకు కారణమైన మన్మథుడు ఈశ్వర విభూతి. కందర్ప సుందరుని గూర్చిన ఒక శ్లోకం బహు ప్రాచుర్యాన్ని పొందింది.

**ఏక ఏవ ద్విధా కర్తుం బహవ స్సంతి ధన్వినః ।**
**మార ఏకో మహాధన్వీ ద్వయ మేకం కరోత్యసౌ ॥**

బాణ ప్రయోగం చేసే వారు ప్రపంచంలో చాలా మంది ఉన్నారు. వారు బాణాన్ని దేనిపై విడిస్తేఅది ఖండింప బడుతుంది. ఒకటి రెండు కావచ్చు. మరెన్నైనా కావచ్చు. అలాగే మారుడు, అనగా మన్మథుడు కూడా పుష్ప బాణ హస్తుడై ఉంటాడు. కాకపోతే మనుషులు బాణ ప్రయోగం చేస్తే ఒకటి రెండవుతాయి. మారుడు బాణం వేశాడా, రెండు ఒకటౌతాయి. రెంటిని ఒకటి చేసే బాణాన్ని మన్మథుడే వేయగలడు. అందుచేత కందర్పుడు ఈశ్వర విభూతి.

**సర్పాలలో వాసుకి**

విష సర్పాలలో భయంకరమైన విషమును విరజిమ్మే వాసుకి ఈశ్వరుని విభూతి. పాల సముద్రాన్ని చిలకడానికి ఈ వాసుకినే త్రాడుగా ఉపయోగించారు. వాసుకిని మందర పర్వతానికి చుట్టి క్షీర సాగరాన్ని దేవదానవులు మథించారు. దారుణ మైన విషం కలిగిన వాసుకి ఈశ్వర విభూతి.

అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్ ।
పితౄణా మర్యమా చాస్మి యమః సంయమతా మహమ్ ॥ 29

**అనంతః-చ-అస్మి-నాగానాం-వరుణః-యాదసాం-అహం**
**పితౄణాం-అర్యమా-చ-అస్మి-యమః-సంయమతాం-అహం**

| | | | |
|---|---|---|---|
| అహం | = నేను | అహం | = నేను |
| నాగానాం | = నాగులలో | పితౄణాం | = పితృదేవతలలో |
| అనంతః చ | = అనంతుడను | అర్యమా చ | = అర్యముడను |
| యాదసాం | = జలచరములలో | సంయమతాం | = సంయమనము చేయు వారిలో |
| వరుణః | = వరుణుడను | యమః | = యముడను |
| అస్మి | = అయి ఉన్నాను | అస్మి | = అయి ఉన్నాను |

**నాగులలో నేను అనంతుణ్ణి. జల దేవతలలో వరుణుణ్ణి. పితృ దేవతలలో అర్యముణ్ణి. నిగ్రహవంతులలో యముణ్ణి నేనే.**

**వ్యాఖ్య**

**నాగులలో అనంతుడు**

నాగులలో అనంతనాగుడు ఈశ్వర విభూతి ***(నాగానాం అనంతః అస్మి).*** అనంత విభూతికి ముందు వాసుకి విభూతిని చూశాం. ఈ రెండిటికి ఉన్న తేడాను అర్థం చేసుకోవాలి.

సర్పాలలో వాసుకి, నాగులలో అనంతుడు భగవ ద్విభూతులు. వాసుకి సర్పరాజు. అనంతుడు నాగరాజు.

ఒక్క తల మాత్రమే ఉండి, విషం కలిగినవి సర్పాలు. అనేక తలలు కలిగి విషం లేకుండా ఉండేవి నాగులు. ఇదే ముఖ్యమైన తేడా. సర్పాలకు రాజైన ***(సర్పాణాం రాజా)*** వాసుకి పాతాళంలో ఉంటుంది ***(వసతి పాతాలే ఇతి వాసుకిః).*** నాగులకు రాజైన ***(నాగానాం రాజా)*** అనన్తుడు వైకుంఠంలో ఉంటాడు ***(వసతి వైకుంఠే ఇతి అనన్తః).*** అనంతుడే ఆదిశేషుడు. ఎవరి మీద నారాయణుడు శయనించి ఉంటాడో అతడే ఆదిశేషుడు ***(శేతే హరి రస్మిన్నితి శేషః).*** విషపూరిత మైన సర్పాలలో విషము అతిశయించి ఉండుట చేత వాసుకి ఈశ్వర విభూతి. విష శూన్యమైన నాగులలో వేయి పడగలతో శోభిస్తూ, వైకుంఠునికి పడకగా, దిండుగా, గొడుగుగా సర్వమూ తానై ఉన్నందున అనంతుడు ఈశ్వర విభూతి.

**జల దేవతలలో వరుణుడు**

జలాలకు, జలచరాలకు అధిపతి వరుణుడు. నీరు భగవ త్స్వరూపము కనుక వరుణుడు ఈశ్వర విభూతి. వర్షాభావ పరిస్థితులలో జనులు వరుణుని ప్రార్థిస్తూ యాగాలు నిర్వహిస్తారు. వరా లివ్వమని ప్రార్థిస్తారు ***(వృణోతి వరా నముం లోకః ఇతి).*** వారి ప్రార్థనలను అందుకొని వర్షరూపంలో జనావళిని వరుణుడు అనుగ్రహిస్తాడు.

వరుణుడు పశ్చిమ దిక్కును పాలిస్తూ ఉంటాడు. అందుచేత, సాయం సంధ్యా సమయంలో అస్తమిస్తున్న సూర్యునిలో నారాయణుని స్మరిస్తూ, వరుణ ప్రార్థన చేస్తారు. ***ఇమం మే వరుణ శ్రుధీహవమ్*** - 'ఓ వరుణుడా! నా ప్రార్థన నాలకించు' (తైత్తిరీయ సంహిత).

**పితృ దేవతలలో అర్యముడు**

పితృ దేవతలలో అర్యముడు శ్రేష్ఠుడు కనుక అతడు ఈశ్వర విభూతి. గమనము నందు వేగము అతిశయించిన వాడు అర్యముడు ***(ఇయర్తి గచ్ఛతీతి అర్యమా).*** ఈ కారణం చేత అర్యముడు భగవద్వైభవము.





**నిగ్రహవంతులలో యముడు**

నిగ్రహించుట యందు, దండించుట యందు, సమయ పాలనము నందు తనకు సాటి లేరనే ఖ్యాతి వహించిన సమవర్తి యమధర్మరాజు. ఈ కారణాల చేత ఆయన భగవ ద్విభూతి అయ్యాడు. న్యాయ నిర్ణయంలో మొక్కవోని ప్రతాప ప్రభావాలు కలవాడు యముడు.

ప్రజలను నియమించే వారందరూ యములే **(యమనాత్ యమాః ప్రజా సంయమోద్యమాః).** అలా నియమ నిష్ఠ గల వారిలో యముడు రాజు వంటి వాడు **(తేషు రాజత ఇతి).** అందుచేత, ఆయన యమరాజు. అలాగే ధర్మ నిర్వహణము నందు, యమరూపు లైన వారిలో యమరాజు శ్రేష్ఠు డైనందున యమధర్మరాజుగా విరాజిల్లుతూ ఈశ్వర విభూతిగా శోభిస్తున్నాడు.

ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాల: కలయతా మహమ్ । 30
మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥

**ప్రహ్లాదః-చ-అస్మి-దైత్యానాం-కాలః-కలయతాం-అహం**
**మృగాణాం-చ-మృగేంద్రః-అహం-వైనతేయః-చ-పక్షిణాం**

| | | | |
|---|---|---|---|
| అహం | = నేను | మృగాణాం చ | = మృగములలో |
| దైత్యానాం | = దైత్యులలో | మృగేంద్రః | = సింహమును |
| ప్రహ్లాదః చ | = ప్రహ్లాదుడను | పక్షిణాం | = పక్షులలో |
| కలయతాం | = గణిత శాస్త్రజ్ఞులలో | వైనతేయః చ | = గరుత్మంతుడను |
| కాలః | = కాలమును | అస్మి | = అయి ఉన్నాను |

**దైత్యులలో నేను ప్రహ్లాదుణ్ణి. లెక్కెట్టే వారిలో కాలము నేనే. మృగాలలో నేను సింహము. పక్షులలో గరుత్మంతుడు నేనే.**

**వ్యాఖ్య**

**దైత్యులలో ప్రహ్లాదుడు**

దితికశ్యపుల పుత్రులు దైత్యులు, అంటే రాక్షసులు. రాక్షస వంశంలో పుట్టిన వారిలో శ్రేష్ఠుడు ప్రహ్లాదుడు. దుష్టుడైన హిరణ్యకశిపుని కుమారుడు. సర్వులకు హ్లాదమును కలిగించి ప్రహ్లాదు డయ్యాడు. సర్వగుణ సంపన్నుడు. వర్ణింప శక్యము గాని దివ్యగుణ యుతుడు.

*కి॥ గుణనిధి యగు ప్రహ్లాదుని గుణము లనేకములు గలవు గురుకాలమునన్*
*గణుతింప నశక్యంబులు ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్ ॥*

సుగుణ నిధి అయిన ప్రహ్లాద కుమారుని గుణాలు అన్ని ఇన్ని అని చెప్పలేక పోయారు. లెక్కించడానికి సమయం సరిపోయేది కాదట. ఆయన సుగుణాలను వర్ణించడం ఆదిశేషునికి **(ఫణిపతి)**, దేవగురువునకు **(బృహస్పతి)**, శారదాపతి అయిన బ్రహ్మదేవునకు **(భాషాపతి)** కూడా సాధ్యం కాదు అన్నది పోతన భాగవతము.

'రాక్షసుడై పుట్టినా ఫరవాలేదు. రాక్షసుడిలా జీవించకు' అనే సందేశాన్ని ప్రపంచానికి అందించిన భక్తాగ్రగణ్యు డైన ప్రహ్లాదుడు భగవంతుని దివ్యవిభూతి.

**గుణించే వారిలో కాలము**

లెక్కించే వారిలో **(కలయతాం)** తాను కాలమట **(అహః కాలః).** అందుచేత, కాలము ఈశ్వర విభూతి.

లెక్కించే వారిలో, లెక్కలలో ఎందరో మేధావులు ఉన్నారు. వారు ఎంత మేధావులైనా, లెక్కించడంలో ఎక్కడో ఒక చోట తప్పుగా లెక్కించక పోరు. ఎంత లెక్కించినా దోషం లేకుండా లెక్కించే సామర్థ్యం ఒక్క కాలానికే ఉంది. అందుచేత కాలం భగవ ద్విభూతి.

చక్కగా లెక్కించడములో కాలానికి మించిన వారు లేరు. క్షణాలు, నిముషాలు, గంటలు, రోజులు, వారాలు, పక్షాలు, మాసాలు, త్రైమాసాలు, షణ్మాసాలు, వత్సరాలు, దశాబ్దాలు, శతాబ్దాలు అంటూ సర్వాన్ని, సమస్తాన్ని కాలం లెక్కించుకుంటూ పోతుంది ***(కాలయతి గణయతి సర్వమితి కాలః).*** ఇలా లెక్కించుకుంటూ విశ్వాన్నంతా మ్రింగుతూ పోతుంది. కాలం మ్రింగని వస్తువు ఉండదు. ఒక దశలో ప్రపంచాన్నే కాలం మ్రింగేస్తుంది ***(కాలః జగద్భక్షకః).*** అది కూడా కాల గణితము పైనే, గుణితము పైనే ఆధారపడి ఉంటుంది. అందుచేత, నేను కాలాన్ని ***(కాలోఽ స్మి)*** అంటూ భగవంతుడు కాలాన్ని తన విభూతిగా అభివర్ణించాడు. ఇది అర్థమైన వారు కాలాన్ని క్షణం కూడా వ్యర్థం చెయ్యరు. కాలాన్ని చక్కగా వినియోగించుకున్న వారే కాలాతీతులై శోభిస్తారు.

**మృగాలలో సింహము**

క్రూర మైనవి, భయంకర మైనవి మృగాలు. అట్టి మృగాలకు రాజైన మృగరాజు భగవ ద్విభూతి. మృగరాజే మృగేంద్రుడు. అదే సింహము.

పరాక్రమము నందు అసమాన శక్తి గలది సింహము. ఏనుగు అంత పెద్ద జంతువైనా, దాని కుంభ స్థలమును ఛేదించే శక్తి సింహానికి ఉంది. ఈ విధమైన అసమాన పరాక్రమము భగవ ద్విభూతి.

పరాక్రమముతో పాటు అభయస్థితి దాని సహజ గుణము. అందుచేతనే గజవ్యాఘ్రాదులు అరణ్యాలలో ఉన్నా సింహమే మృగరాజు అయింది. అరణ్యానికి రాజుగా సింహాన్ని ఎన్నుకున్న దెవరు? 'మృగేంద్ర' బిరుదును ఇచ్చిం దెవరు? సిఫారసులతో 'పద్మశ్రీ'లు విరబూస్తాయి. స్వశక్తితో 'మృగశ్రీ'లు పుట్టుకొస్తాయి. అందుచేత సింహము ఈశ్వర విభూతి.

భగవంతుడికి సింహ *(సింహః)* మనే పేరు కూడా ఉంది. ***విక్రమ శాలిత్వాత్ సింహవత్ సింహః*** - పరాక్రమము నందు సింహము లాంటి సింహము భగవంతుడు. 'నృ' శబ్ద లోపం చేత నృసింహుడే సింహుడు అని అర్థము ***(నృ శబ్ద లోపేన నృసింహః ఏవ సింహః).***

**పక్షులలో వైనతేయుడు**

పక్షులలో వైనతేయుడు ఈశ్వర విభూతి. వైనతేయుడే గరుత్మంతుడు. వినతాపుత్రుడు కావడం చేత గరుత్మంతుని వైనతేయుడు అంటారు.

పరమేశ్వరుని వాహనం కావడం చేత గరుత్మంతుడు పవిత్రాత్ముడు. శుభరూపుడు. ఆయన దర్శనమే శుభప్రదం. అందుచేతనే, లోక వ్యవహారంలో కూడా గరుడ పక్షిని చూడగానే, శుభం జరుగుతుందని భావించి నమస్కరిస్తూ ఉంటారు. గరుత్మంతుడు ఎగిరి నంత ఎత్తుకు ఏ పక్షీ ఎగర లేదు. అదే గరుత్మంతునిలో అతిశయించిన వైభవము. ఈశ్వర విభూతి.

**పవనః పవతా మస్మి రామః శస్త్రభృతా మహమ్ । 31**
**ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ ॥**

*పవనః-పవతాం-అస్మి-రామః-శస్త్రభృతాం-అహం*
*ఝషాణాం-మకరః-చ-అస్మి-స్రోతసాం-అస్మి-జాహ్నవీ*





| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | మకరః | = | మొసలిని |
| పవతాం | = | పవిత్రము చేసెడి వాటిలో | అస్మి | = | అయి ఉన్నాను |
| పవనః | = | వాయువును | చ | = | మరియు |
| శస్త్రభృతాం | = | ఆయుధ ధారులలో | స్రోతసాం | = | నదులలో |
| రామః | = | శ్రీరాముడను | జాహ్నవీ | = | గంగానదిని |
| అస్మి | = | అయి ఉన్నాను | అస్మి | = | అయి ఉన్నాను |
| ఝషాణాం | = | చేపలలో | | | |

**పార్థా! పవిత్రం చేసే వాటిలో నేను వాయువును. శస్త్రధారులలో శ్రీరాముణ్ణి నేనే. మత్స్య జాతిలో నేను మకరాన్ని, నదులలో గంగానది నేనే.**

**వ్యాఖ్య**

**పావనం చేసే వాటిలో పవనము**

పవిత్రం చేసే వాటిలో **(పవతాం పావయితౄణాం)** వాయువు **(పవనః వాయుః)** పరమేశ్వరుని విభూతి. ***పవతే ఇతి పవనః*** - పవిత్రం చేసేది పవనము లేదా గాలి. అలా పవిత్రం చేసే శక్తి జడమైన వాయువుకు ఎక్కడిది? అది పరమేశ్వరుని వైభవము. పవిత్రం చేసే కళ్యాణ గుణము జ్ఞాన స్వరూపుడైన పరమేశ్వరునికే ఉంది. పరమేశ్వరుని శక్తే వాయువులో ఉంది. అందుకే వాయువు పవిత్రం చేయ గలుగుతూ ఉంది. పవనాన్ని పయనింప చేసే శక్తి భగవంతునిది. అందుచేత వాయువు పరమేశ్వరుని విభూతియై ఎన్నిటినో పవిత్రం చేస్తూ ఉంది.

వాయువులో అద్భుతమైన శక్తి ఉంది. అద్భుతమైన వేగంతో చలించే గుణమూ ఉంది. అందుచేత కేవలం పవిత్రం చేయడమే కాకుండా, పరుగు లెత్తుతూ పయనించి మరీ పవిత్రం చేస్తుంది.

మట్టి కూడా పవిత్రం చేస్తుంది. జలం కూడా పవిత్రం చేస్తుంది. మృత్తికా స్నానం, జల స్నానం శుద్ధి పడేందుకే చేస్తాము. జల మృత్తికాదులు శుద్ధి చేస్తాయి. కాని, తాము అశుద్ధం కాకుండా ఉండలేవు. మృత్తికోదకాలు అశుద్ధ మైనపుడు గాలి పరుగు లెత్తుతూ వెళ్ళి వాటిని శుద్ధి చేస్తుంది. ఇదంతా ఈశ్వర వైభవము.

శుద్ధి చేసే గుణం గల జలమృత్తికాదులు తాము ఉన్న చోటే ఉండి శుద్ధి చేస్తాయి. కాని, వాయువు అలా కాదు. పని కట్టుకొని పరుగు లెత్తుకుంటూ పోయి శుద్ధి చేస్తుంది.

అగ్ని కూడా శుద్ధి చేస్తుంది కదా! అవును. అందుకే అగ్నిని **పావకః** అన్నారు. ఆ విషయాన్ని మనం విభూతిగా చెప్పుకున్నాం. కాని, ఈ సందర్భంలో మరి కొంత స్పష్టత అవసరం.

అగ్ని పవిత్రం చేస్తుంది. జల మృత్తికాదుల లాగా తాను అశుద్ధం కాదు. కాని, వాయువు లాగా పరుగు లెత్తి పవిత్రం చేయలేదు. అదేమిటి? అగ్ని ప్రమాదాలు జరిగి నపుడు ఒక చోట నుండి మరొక చోటికి అగ్ని వ్యాపిస్తూ ఉండటం మనం చూస్తున్నాము కదా! అగ్ని వాయు వేగాన్ని పుంజుకోలేక పోవచ్చు. కాని, జల మృత్తికాదుల వలె కాకుండా, పయనించి పునీతం చేస్తూ ఉంది కదా! అనే సందేహం తలెత్త వచ్చు. ఇక్కడ ప్రధానంగా అర్థం చేసుకోవలసిన విషయం ఒకటి ఉంది. అగ్ని తనంతట తాను విస్తరించ లేదు. వాయు తాకిడికే అగ్ని చలిస్తుంది. అగ్ని ప్రమాదాలు విస్తార మయ్యేది వాయువు తోడైనపుడే.

పవిత్ర సాధనంగా వాయువు చరించడమే గాక, సర్వ ప్రాణుల, వృక్ష లతాదుల జీవనానికి కూడా తానే

కారణమై ఉంది. ఇదంతా భగవద్విభూతి. భగవంతుని స్ఫూర్తి చేత, భగవదాజ్ఞలకు తల వంచి వాయువు ఈశ్వర విభూతిగా చరిస్తూ ఉంది.

***భీషాస్మా ద్వాతః పవతే -*** భయంతో గాలి వీస్తూ ఉంది అన్నది ఉపనిషత్తు. భగవద్భీతితో గాలి వీస్తూ ఉంది. భగవంతుని స్ఫూర్తిని నింపుకొని పవిత్రమైన కార్యాలను వేగవంతముగా నిర్వహిస్తున్న వాయువును భగవ ద్విభూతిగా దర్శించడమే కాకుండా, ప్రత్యక్ష దైవంగా కూడా భక్తులు ఆరాధిస్తూ ఉంటారు.

**నమస్తే వాయో! త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి ! త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి!**

ఓ వాయుదేవుడా! నీకు నమస్కారము. నువ్వే ప్రత్యక్ష దైవానివి. నిన్ను కనిపించే దైవంగా నేను అర్థం చేసుకుంటున్నాను.

## శస్త్రధారులలో శ్రీరాముడు

శస్త్రములు ధరించిన వారిలో శ్రీరాముడు తానే అంటున్నాడు భగవంతుడు ***(శస్త్రాణాం ధారయిత్రూణాం దాశరథిః రామః అహమ్).*** ఇక్కడ రాముడు అంటే బలరాముడో లేక పరశురాముడో అనే సందేహం రావచ్చు. అలాంటి సంశయానికి అవకాశం లేకుండా, ***దాశరథిః రామః*** అన్నారు భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి. దశరథ రాముడు అనే అర్థం స్పష్టమైంది.

శస్త్రాస్త్రాలు లేకుండా రాముణ్ణి చూడలేము. సదా కోదండపాణి గానే శ్రీరాముడు దర్శన మిస్తాడు. ఎవరైనా శస్త్రాస్త్రాలు ఎందుకు ధరిస్తారు? శత్రు సంహారానికే. మరి, అలాంటప్పుడు శత్రువును ఎదుర్కొనే సమయాలలో మాత్రం ధరిస్తే సరిపోతుంది కదా! సదా శస్త్రధారియై, అస్త్రధారియై, కోదండధారియై శ్రీరాముడు ఉండటానికి కారణ మేమిటి?

బాహ్య శత్రువులు ఎప్పుడో గాని రారు. అంతః శత్రువులు ఎప్పుడైనా రావచ్చు. కామక్రోధాది శత్రువులను ఎదుర్కొనేందుకు సాధకులు సదా సంసిద్ధులై ఉండాలి అని తెలిపేందుకే శ్రీరాముడు సదా కోదండపాణిగా దర్శన మిస్తాడు. రామబాణముతో సాటి యైనది లేదు. సాగరాన్ని ఎండింప చేసే శక్తి ఒక్క రామ బాణానికి ఉంది. అట్టి అసమాన వైభవము రామ బాణానికి ఉండటం చేతనే, 'శస్త్రధారులలో నేను శ్రీరాముణ్ణి' అంటున్నాడు.

## మత్స్యాలలో మకరము

మకరము జలచరము. మత్స్యజాతికి చెందింది. నీళ్ళల్లో దాని శక్తి అసమానము. అద్భుతము. ఏనుగును సైతం నీళ్ళల్లో నిలువరించే సామర్థ్యం మకరానికి ఉంది. గజేంద్ర మోక్షంలో కరిమకరుల సంగ్రామం మనకు తెలిసిందే కదా! కనుక అట్టి నిరుపమాన పరాక్రమమును మకరంతో సమానంగా మరొకటి ప్రదర్శించ లేదు కనుక మకరము ఈశ్వర విభూతి.

## నదులలో గంగానది

ప్రవహించే నదులలో గంగానది ఈశ్వర విభూతి. గంగాస్నానం పాపనాశము, పుణ్యప్రదము అని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. మహాత్ములు దివ్యంగా ప్రవచిస్తున్నారు. కనుకనే, 'ప్రవహించే నదులలో జాహ్నవి నా విభూతి' అంటున్నాడు ***(స్రోతసామ్ అస్మి జాహ్నవీ గంగా).***

గంగానదికి ***జాహ్నవీ*** అనే పేరు కూడా ఉంది. ***జాహ్నవీ*** అంటే ***జహ్ను తనయా*** అని అర్థము ***(జహ్నోః తనయా జాహ్నవీ) -*** జహ్ను మహాముని చెవి నుండి పుట్టింది కనుక గంగ ***జాహ్నవీ*** అని పిలువ బడింది.





గంగ వైభవాన్ని వర్ణించడం వేయి నాల్కల ఆదిశేషునికి కూడా సాధ్యం కాదు. హరిహరుల వైభవాన్ని తనలో నింపుకున్న గంగమ్మ భూతలంపై ప్రవహించడం మానవులు, మహర్షులు చేసుకున్న పుణ్యము.

***హరి చరణాత్ గాం భూమిం గతా గంగా -*** హరి చరణాల నుండి కదలి భూమిని చేరింది కనుక ఆమె గంగ.

***హరోత్త మాంగాత్ భూమిం గతా గంగా -*** హరుని శిరస్సు నుండి భూమికి చేరింది కనుక ఆమె గంగ.

గంగానదిని మనం కేవలం నదిగా చూడటం లేదు. భగవత్స్వరూపంగా భావిస్తున్నాం. భగవతిగా ఆరాధిస్తున్నాం. ఈ విధమైన అవగాహనను పాశ్చాత్య దేశాలలో మనం ఊహించ లేము. ఒక నది విషయంలో ఇంతటి పవిత్ర భావన అనాదిగా జనుల హృదయాలలో సుప్రతిష్ఠం కావడానికి గంగ వైభవమే కారణము.

పవిత్రమైన గంగాతీరం లోనే మహర్షులు తపస్సు నాచరించి తరించారు. ఆ తీరం లోనే పవిత్రమైన శాస్త్ర చర్చ విస్తారంగా సాగింది. అక్కడే ఆర్ష సంప్రదాయం వెల్లి విరిసింది. గంగా జలాలలో హిందువులు భగవద్దర్శనం చేస్తారు. ఈ భావన మనకు ఈశ్వర భావన వల్లనే ఏర్పడింది. అందుకే, 'నదులలో నేను గంగానదిని' అంటున్నాడు పరమేశ్వరుడు. గంగమ్మ తల్లి వైభవాన్ని ఒక పుస్తకంగా వ్రాయ గలిగినంత విషయము మనస్సు నుండి దొర్లుతున్నా, సందర్భాన్ని దృష్టిలో ఉంచుకొని, చేతులు కట్టేసుకొని, శిరమొడ్చి నమస్కరిస్తూ, గంగాస్తుతితో తృప్తి చెందుతున్నా!

**భాగీరథి సుఖదాయిని మాతః**  
**తవ జల మహిమా నిగమే ఖ్యాతః।**  
**నాహం జానే తవ మహిమానం**  
**పాహి కృపామయి మామజ్ఞానమ్ ॥**

అమ్మా! భాగీరథీ! సుఖదాయినీ! తల్లీ! నీ పవిత్ర జలాల వైభవమును వేదాలు కీర్తించాయి. నీ మహిమ నాకేం తెలుసు? తల్లీ! దయామాతా! నేను అజ్ఞానిని. నన్ను కాపాడు తల్లీ!

**సర్గాణా మాది రన్తశ్చ మధ్యం చైవాహ మర్జున ।** 32  
**అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్ ॥**

***సర్గాణాం-ఆదిః-అంతః-చ-మధ్యం-చ-ఏవ-అహం-అర్జున***  
***అధ్యాత్మవిద్యా-విద్యానాం-వాదః-ప్రవదతాం-అహం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = | అర్జునా! | విద్యానాం | = | విద్యలలో |
| సర్గాణాం | = | సృష్టులలో | అధ్యాత్మవిద్యా | = | ఆత్మవిద్యయు |
| ఆదిః | = | ఆది సృష్టియు | ప్రవదతాం | = | వాదించు వారిలో |
| అంతఃచ | = | అంతమును | వాదః | = | వాదమును |
| మధ్యం చ | = | స్థితియును | అహం | = | నేనే |
| అహం ఏవ | = | నేనే | | | |

**అర్జునా! సృష్టుల యొక్క ఆది మధ్యాంతములు నేనే. విద్యలలో నేను అధ్యాత్మ విద్యను. వాదించే వారిలో నేను వాదాన్ని.**

**వ్యాఖ్య**

### సృష్టులలో ఆది మధ్యాంతాలు

భూతాలకు ఆది మధ్యాంతాలు నేనే అని ఈ అధ్యాయం లోనే ఇరవయ్యవ శ్లోకంలో చెప్పడం జరిగింది. అదే ఇక్కడ మళ్ళీ చెబుతూ ఉన్నా, పునరుక్తి దోషాన్ని ఆపాదించ కూడదు. కారణం, అక్కడ చెప్పింది ప్రధానమైన సృష్టికి సంబంధించిన ఆదిమధ్యాంతాల విషయం. ఇక్కడ చెబుతున్నది సృష్టిలో జరుగుతున్న కార్యా లన్నిటికీ కూడా ఆదిమధ్యాంతాలు తానే అనే విషయం. ఒక విత్తనం నాటుతాము. అది చెట్టు అవుతుంది. కొంత కాలానికి నశించి పోతుంది. ఈ చెట్టు సృష్ట్యాదిలో లేదు. సృష్టి అంతం వరకు ఉండబోదు. కాని, ఈ చెట్టుకు ఆదిమధ్యాంతా లున్నాయి. అలా సృష్టి లోని సృష్టులను చెప్పడమే భగవానుని ఉద్దేశ్యం కనుక ఇక్కడ పునరుక్తి లేదు.

### విద్యలలో అధ్యాత్మ విద్య

ఒక్క అధ్యాత్మ విద్యను ప్రక్కన పెడితే, మిగిలిన విద్యలన్నీ నామ మాత్రమే. అన్నీ అనిత్యాలే. త్రివర్గములకు సంబంధించినవే గాని, జీవులకు శాశ్వతానందాన్ని ప్రసాదించే మోక్షానికి సంబంధించినవి కావు. అధ్యాత్మ విద్య, లేదా బ్రహ్మాత్మ జ్ఞానము ఒక్కటే మోక్ష ప్రదాయిని కనుక, అన్ని విద్యలలో అధ్యాత్మ విద్య శ్రేష్ఠ మైనది. అందువల్ల అది పరమేశ్వరుని విభూతి అయింది. ఛాందోగ్యోపనిషత్తు లోని నారద సనత్కుమార సంవాదములో ఈ విషయం విస్తారంగా చర్చింప బడింది.

### వాదించే వారిలో వాదము

వాదము తర్క సంబంధ మైనది. కాని, ఈ వాదవిద్యను వినియోగించుకొనే వారి విచారములో భేదాలు ఉన్నందున, వాదించే వారిలో ***(ప్రవదతామ్)*** వదన భేదం వల్ల వాద, జల్ప వితండములు అనేవి వినిపిస్తాయి. అదే 'ప్రవదతామ్' అని చెప్పడం లోని విశేషము ***(ప్రవక్తృ ద్వారేణ వదన భేదనా మేవ వాద జల్ప వితండానామ్ ఇహ గ్రహణం).***

వాదము మూడు విధాలు. మొదటిది వాదము. రాగద్వేషాలు లేకుండా కేవలం తత్త్వ నిర్ణయం కొరకు చేసే తర్కము వాదము. రెండవది జల్పము. తనది మాత్రమే సత్యమని నిరూపించుకోవడానికి, ప్రతిపక్షమును ఖండిస్తూ, తన పక్షమును బలపరచుకోవడం జల్పము. మూడవది వితండము. కేవలము పరపక్షమును ఖండించడమే ప్రధానంగా పెట్టుకొని సాగే వాదము వితండము. ఈ మూడిటిలో సత్య నిర్ధారణకు ఉపకరించేది వాద మొక్కటే కనుక, వాదించే వారిలో వాదము భగవ ద్విభూతి.

**అక్షరాణా మకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ ।**
**అహ మే వాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥** 33

***అక్షరాణాం-అకారః-అస్మి-ద్వంద్వః-సామాసికస్య-చ***
***అహం-ఏవ-అక్షయః-కాలః-ధాతా-అహం-విశ్వతోముఖః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అక్షరాణాం | = అక్షరములలో | | ద్వంద్వః చ | = ద్వంద్వ సమాసమును | |
| అకారః | = అకారమును | | అస్మి | = అయి ఉన్నాను | |
| అస్మి | = అయి ఉన్నాను | | అక్షయః | = నశించని | |
| సామాసికస్య | = సమాసములలో | | కాలః | = కాలము | |





| | | | |
|---|---|---|---|
| అహం ఏవ | = నేనే | ధాతా | = ధాతను |
| విశ్వతోముఖః | = సర్వత్ర ముఖములు గల | అహం | = నేనే |

**పార్థా! అక్షరాలలో నేను అకారము. సమాసాలలో నేను ద్వంద్వ సమాసాన్ని, నేను క్షయ మెరుగని కాలాన్ని, నేను సర్వత్ర ముఖాలు గల విధాతను.**

**వ్యాఖ్య**

### అక్షరాలలో అకారము

వాక్యం లోనే భావం ఇముడుతుంది. కాని పదాలు లేనిదే వాక్య నిర్మాణం జరగదు. అక్షరాలు లేనిదే పదాలు ఏర్పడవు. అక్షరాలకు 'అ' కారము ఆది. భాషలు ఏవైనా 'అ' అనే అక్షరము తోనే ప్రారంభ మవుతాయి.

ఆ తరువాత ఎన్ని అక్షరాలు ఉన్నా అవన్నీ 'అ' శబ్దం తోనే ముడిపడి ఉంటాయి. అంటే ఏ అక్షరంలో అయినా 'అ' వ్యాపించి ఉంటుంది ***(అశ్నుతే)***. 'అ' ని మినహాయించి ఏ అక్షరాన్ని కూడా పలకలేము. నోరు తెరవకుండా ఏదీ పలకలేము. కాని, నోరు తెరిస్తే మాత్రం ముందుగా ధ్వనించేది 'అ' శబ్దమే. 'అ' శబ్దంలో ఇదొక గొప్ప విశేషము. ఇందులో భగవదైశ్వర్యం నిండి ఉంది.

భగవంతుడు ఆదిలో ఉంటాడు. అద్వితీయంగా ఉంటాడు. ఆ తరువాత వచ్చే వాటన్నిటిలో వ్యాపించి ఉంటాడు. తాను స్వరూపంగా శోభిస్తాడు. కారణంగా సృష్టిలో రాణిస్తాడు. 'అ' కారమూ అంతే.

పరమేశ్వరుని లాగా ఆరంభంలో ఉంటుంది. అది లేక మరొక అక్షరం ఉండలేదు. ఉన్న అక్షరా లన్నిటిలో తానే ఉంటుంది ***(అకారోవై సర్వ వాక్ - వేదం)***. తాను స్వరూపంగా శోభిస్తూ, కారణంగా అన్నిటిలో వ్యాపించి ఉండే లక్షణం ఆదిదేవునిలో కనిపించినట్లే 'అ' కారంలో కూడా అగుపిస్తూ ఉంది. అన్ని రూపాలలో భగవంతుడే. అలాగే అన్ని అక్షరాలలో 'అ' కారమే ***(అకారోవై సర్వా వాక్ స ఏషా స్పర్శోష్మభిః వ్యజ్యమానా బహ్వీ నానారూపా భవతి!)***. అన్ని అక్షరాలను స్పృశిస్తూ, అన్ని అక్షరాలకు స్ఫురణ నిస్తూ 'అ'కారము అన్నిటిలో వ్యాపించి ఉంటుంది కనుక 'అ'కారము ఈశ్వర విభూతి.

### సమాసాలలో ద్వంద్వ సమాసము

రెండు పదాలను కలిపి ఒక పదంగా ఉచ్చరించడము ద్వంద్వ సమాసము. ఆ రెండు పదాలు కూడా సమాన ప్రాధాన్యం కలిగి ఉంటాయి. సమానార్థం, సమ ప్రాధాన్యంతో భిన్నత్వంలో ఏకత్వంగా శోభించడం చేత, ద్వంద్వ సమాసము ఈశ్వర విభూతి.

### అక్షయ కాలం

గుణించే వారిలో నేను కాలాన్ని అని ముప్పైయవ శ్లోకంలో చెప్పడం జరిగింది. కాని, మళ్ళీ ఇక్కడ అక్షయ కాలం నేను అంటున్నాడు. సమయ వాచకంగా తెలిసే కాలము ఒకటైతే, కాలాతీత మైన కాలము మరొకటి. జగత్తులో కాలం నడుస్తూ ఉంది. ప్రవాహ నిత్యత్వం ఉన్నందున, అది కూడా అక్షయం గానే కనిపిస్తుంది. కాని, దేశకాలాదులు పరిచ్ఛిన్నాలు అని ప్రత్యేకంగా చెప్ప నవసరం లేదు. కనుక, వాస్తవానికి ఇది క్షయ కాలము. పరమాత్మ అక్షయ కాల రూపుడు. క్షయంగా తెలిసే కాలం కూడా అక్షయ బ్రహ్మమే. కాని, అక్షయ పరబ్రహ్మము కాలం కాదు. ఇదే ప్రధానంగా అర్థం కావలసిన కాల భేదము.

### సర్వతోముఖ విధాత

సర్వ కర్మ ఫల ప్రదాత, లేదా విధాత భగవంతుడే. ఆయన సర్వతోముఖుడు. విశ్వతోముఖుడు. ఏదీ

ఆయన దృష్టిని తప్పించుకో లేదు. ధర్మరూపంలో ఉండి సర్వ కర్మలకు ఫలితాలను ప్రసాదిస్తాడు కనుక, ధర్మరూప విధాత కూడా తన విభూతియే (*ధాతా అహం కర్మఫలస్య విధాతా జగతః, విశ్వతో ముఖః సర్వతో ముఖః*).

మృత్యుః సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిః శ్రీ ర్వా క్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా ॥ 34

మృత్యుః-సర్వహరః-చ-అహం-ఉద్భవః-చ-భవిష్యతాం
కీర్తిః-శ్రీః-వాక్-చ-నారీణాం-స్మృతిః-మేధా-ధృతిః-క్షమా

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | శ్రీః | = | లక్ష్మియు |
| సర్వహరః | = | సర్వ సంహారకరు డైన | వాక్ చ | = | వాక్కు |
| మృత్యుః చ | = | మృత్యువును | స్మృతిః | = | జ్ఞాపక శక్తి |
| భవిష్యతాం | = | పుట్ట గల వారి | మేధా | = | బుద్ధియు |
| ఉద్భవః చ | = | పుట్టుకయు | ధృతిః | = | ధైర్యము |
| నారీణాం | = | స్త్రీలలో | క్షమా | = | ఓర్పు |
| కీర్తిః | = | కీర్తి | | | |

**అర్జునా! సమస్తాన్ని హరించే మృత్యువును నేనే. అభ్యుదయాన్ని సాధించే వారిలో అభ్యుదయ కారణము నేనే. స్త్రీలలో కీర్తి, సంపద, వాక్కు, స్మృతి, మేధ, ధైర్యము, క్షమ - అన్నీ నా విభూతులే.**

**వ్యాఖ్య**

### సర్వహర మృత్యువు

మృత్యువు సమస్తమును హరిస్తుంది. అట్టి మృత్యువు కూడా ఈశ్వర విభూతియే అంటున్నాడు. మృత్యువుకు **సర్వహర** అనే విశేషణమును ఎందుకు వాడవలసి వచ్చింది? మృత్యువు సర్వమును హరించక, పంచ ప్రాణాలలో రెండిటిని విడిచిపెట్టి, మూడిటిని పట్టుకు పోతుందా? ఈ సందేహాన్ని పరిహరిస్తూ మృత్యువు రెండు విధాలు అన్నారు భాష్యంలో ఆచార్యులు.

***మృత్యుః ద్వివిధః ధనాదిహరః ప్రాణహరశ్చ, తత్ర యః ప్రాణహరః సః సర్వహరః ఇత్యుచ్యతే*** - హరించే స్వభావం గల మృత్యువు రెండు రకాలు. ఒకటి ధనాదులను హరించేది. రెండవది ప్రాణాన్ని హరించేది. ప్రాణమును హరించే ఈ మృత్యువే సర్వహరము.

ధనము, కీర్తి- ఇలా హరింప బడేవి చాలా ఉన్నాయి. ఆరోగ్యము, ఉద్యోగము, యశస్సు - ఇవన్నీ ఏదో ఒకనాడు హరింప బడేవే. కాకపోతే, వాటిని తిరిగి పొందవచ్చు. కాని ప్రాణహర మృత్యువు సర్వమును హరిస్తుంది (***సర్వం హరతీతి సర్వహర మృత్యుః***). అందుచేత అది ఈశ్వర విభూతి.

### అభ్యుదయ ప్రాప్తి

జీవులు ప్రవృత్తి నివృత్తుల ద్వారా పొందేవి అభ్యుదయ నిశ్శ్రేయసలు. నిశ్శ్రేయసము అంటే మోక్షము. మోక్షము కానిది అభ్యుదయము. అంటే, సుఖ హేతువులైన ధర్మ, అర్థ, కామాలు. ఈ త్రివర్గములు సుఖ హేతువులు కావడానికి పుణ్య ఫలమే కారణం. కనుక పుణ్య భావన, పుణ్య కార్యము, పుణ్య ఫలము - ఈ మూడు పరమేశ్వరుని రూపాలే కావడం చేత వీటి వల్ల లభించే అభ్యుదయము కూడా పరమేశ్వర విభూతియే.





### సప్త సంపదలు

అర్ధాంగిని ధర్మపత్ని అంటారు. ధర్మపత్ని అంటే, భర్తతో ధర్మాచరణములో పాలు పంచుకొనే స్త్రీ మూర్తి అని ఒక అర్థము. పురుషుడు పూర్వం ఆచరించిన ధర్మఫలంగా ప్రాప్తించినది అని మరొక అర్థము. ప్రతి వ్యక్తి సప్త సంపదలను ఆశిస్తాడు. అవే సప్త ధర్మపత్నులు. వారు (1) కీర్తి దేవి (2) శ్రీదేవి (3) వాగ్దేవి (4) స్మృతీ దేవి (5)మేధా దేవి (6) ధృతీ దేవి (7) క్షమా దేవి. ధర్మాచరణంలో ఉండే మోక్షప్రియులకు ఈ సప్త సంపదలు అనాయాచితంగా, ఈశ్వర కృపచే లభిస్తాయి. ఇవన్నీ ఈశ్వర విభూతులు. ఇది తాత్త్విక అవగాహన.

ఇదే గాక, ఈ ఏడు శుభ లక్షణాలు స్త్రీలలో ఉంటాయని, వారి కారణంగా పురుషులకు లభిస్తాయి అనేది మరొక అర్థము. ఈ లక్షణాలు పురుషులలో కూడా ఉన్నప్పటికీ, స్త్రీలకు ప్రాధాన్యాన్ని, ప్రథమ స్థానాన్ని ఇవ్వాలని పరమేశ్వరుడు సంకల్పించి ఉండొచ్చు. ఇది సామాజిక స్పృహతో చెప్పిన భావము.

ఇక పౌరాణికంగా చూస్తే స్వాయంభువ మనువు కుమార్తె ప్రసూతి దక్ష ప్రజాపతి భార్య. వారికి ఇరవై నాల్గు మంది కుమార్తెలు. ఇప్పుడు మనం చూచిన దేవీ సప్తకము వారిలో ఉన్నారు.

ప్రసూతీదక్షుల కుమార్తె లైన కీర్తి దేవి, మేధా దేవి, ధృతీ దేవి - ఈ దేవీ త్రయము యముని భార్యలు. స్మృతీదేవి అంగీరసుని అర్ధాంగి. క్షమాదేవి పులహుని భార్య. శ్రీదేవి విష్ణుపత్ని. వాగ్దేవి బ్రహ్మసతి. వీరిలో ఒక్క శ్రీదేవి మాత్రం ప్రసూతీదక్షుల పుత్రిక కాదు, పౌత్రిక. దక్ష ప్రజాపతి మరొక కుమార్తె యైన ఖ్యాతీ దేవికి భృగువు వలన కలిగిన పుత్రికే శ్రీదేవి. అందరూ ఐశ్వర్య రూపాలే. భగవ ద్విభూతులే.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసా మహమ్ ।
మాసానాం మార్గశీర్షో౽హ మృతూనాం కుసుమాకరః ॥ 35

బృహత్సామ-తథా-సామ్నాం-గాయత్రీ-ఛందసాం-అహం
మాసానాం-మార్గశీర్షః-అహం-ఋతూనాం-కుసుమాకరః

| | | | | | |
|---|---|---|---|---|---|
| తథా | = | అలాగే | మాసానాం | = | మాసములలో |
| అహం | = | నేను | మార్గశీర్షః | = | మార్గశిర మాసమును |
| సామ్నాం | = | సామృక్కులలో | ఋతూనాం | = | ఋతువులలో |
| బృహత్సామ | = | బృహత్సామమును | కుసుమాకరః | = | వసంతమును |
| ఛందసాం | = | ఛందస్సులలో | అహం | = | నేను |
| గాయత్రీ | = | గాయత్రీ ఛందస్సును | | | |

**అర్జునా! సామగానములలో నేను బృహత్సామము. ఛందస్సులలో నేను గాయత్రిని. మాసాలలో మార్గ శీర్షాన్ని. ఋతువులలో వసంతాన్ని.**

**వ్యాఖ్య**

### సామములలో బృహత్సామము

సామ వేదము గాన ప్రధాన మైనది అని చెప్పుకున్నాం. సామగానాలలో వివిధ రాగ స్వరాలతో సాగే గానములకు కొన్ని ప్రత్యేక నామా లున్నాయి. వాటిలో ప్రసిద్ధ మైనది, ప్రముఖ మైనది బృహత్సామము. శ్రావ్యమైన, రాగయుత మైన బృహత్సామము ప్రాముఖ్యాన్ని, ప్రాధాన్యాన్ని బట్టి ఈశ్వర విభూతి అయింది.

### ఛందస్సులలో గాయత్రి

గాయత్రీ మంత్రము వేదరూప మని, వేద సారమని ప్రసిద్ధి. ఈ మంత్రము నాలుగు వేదాలలో ఉంది. ఉపనయన సంస్కార సందర్భమున గాయత్రీ మంత్రోపదేశము చేస్తారు.

జీవితంలో సరియైన నిర్ణయాలు తీసుకోవడానికి స్పష్టమైన ఆలోచనా విధానం సాగే లాగున బుద్ధిని ప్రభావితం చేయమని ప్రార్థించడమే గాయత్రీ మంత్రములో ప్రధాన విషయము. విశ్వామిత్ర మహర్షి మంత్ర ద్రష్ట.

గాయత్రీ మంత్రములో ఇరవై నాలుగు అక్షరా లున్నాయి. రామాయణంలో ఇరవై నాలుగు వేల శ్లోకా లున్నాయి. ఆ ఇరవై నాలుగు వేల లోని ప్రతి వెయ్యిలో, మొదటి శ్లోకం లోని ప్రారంభ అక్షరాన్ని గ్రహిస్తే, మొత్తం ఇరవై నాలుగు అక్షరాలు అవుతాయి. ఆ ఇరవై నాలుగు అక్షరాలతో కూడినదే గాయత్రీ మంత్రము. అంతే కాదు. ఆ ఇరవై నాలుగు శ్లోకాలలో సంపూర్ణ రామాయణము సంక్షిప్తంగా అర్థ మవుతుంది. దానినే గాయత్రీ రామాయణము అంటారు.

గాయత్రిని ఇటు మంత్రము గాను గ్రహించ వచ్చు, అటు ఛందస్సు గాను గ్రహించ వచ్చు. గీతలో శ్లోకాలు మనకు అనుష్టుప్, త్రిష్టుప్ ఛందస్సులలో ఉంటాయి. గాయత్రీ ఛందస్సు వేదం లోనే ప్రశస్తము. మహిమాన్విత మైనది, మహాద్భుత మైనది కావడం చేత గాయత్రి ఈశ్వర విభూతిగా అలరారుతోంది.

### మాసాలలో మార్గశీర్షము

మాసాలలో మార్గశీర్షము ఈశ్వర విభూతి. మృగశిర నక్షత్రముతో కూడిన పున్నమి మార్గశిరము (*మృగశీర్ష నక్షత్ర యుక్తా పూర్ణిమా మార్గశీర్షీ*). ఇది పాడిపంటలు పుష్కలంగా ఉండే మాసము. ఈ మాసంలో ప్రాణులు శక్తివంతంగా ఉంటాయి (*సహ శక్త్యా*). వాతావరణము ఆహ్లాదకరంగా ఉంటుంది. చలి, ఉష్ణము, గాలి అధికంగా లేకుండా, శీతోష్ణ స్థితి సమంగా ఉంటుంది. శీత వాత ఆతప శూన్యంగా ఉండటం చేత ఈ మాసము సుఖ హేతువు. తపో వ్రత దానాలకు అనువైన మాసం. మార్గశీర్ష మాసము యొక్క విశిష్టత ఎంతైనా ఉంది.

ప్రస్తుతం నూతన సంవత్సరం చైత్ర మాసంతో ప్రారంభ మైనట్లు, మహాభారత కాలంలో మార్గశీర్షంతో క్రొత్త సంవత్సరం ఆరంభమయ్యే దని మహాభారతము - అనుశాసనిక పర్వం చెబుతూ ఉంది.

భగవద్గీత కూడా మార్గశీర్షంలో శుద్ధ ఏకాదశి నాడు ఆవిర్భవించింది. ఆ రోజే మనం గీతా జయంతి జరుపుకుంటాము.* ఇవన్నీ ఈశ్వర విభూతులే. అందుచేత, మార్గశీర్షము ఈశ్వర విభూతి.

### ఋతువులలో వసంతము

ఋతువులలో వసంతము ఈశ్వర విభూతి. సర్వ సుగంధ పుష్పములకు ఆకరమైన, అతి రమణీయ మైన ఋతువు వసంత ఋతువు. ***వసన్తి సుఖం యథా తథా అస్మిన్నితి వసంతః*** - దేని యందు జను లందరు సుఖంగా ఉంటారో, అదే వసంతము అని అమరసింహుడు నిర్వచించాడు. ఇదొక అందమైన, అద్భుతమైన అసమానమైన ఋతువు.

వర్ష ఋతువులో వర్ష బాధ. గ్రీష్మ ఋతువులో ఉష్ణ బాధ. శరదృతువు ప్రారంభము నందు కొంత హాయిగా ఉంటుంది. శరదృతువు సమాప్త మయ్యే సరికి రోగాలు ప్రారంభ మవుతాయి. కార్తీక మార్గశిర మాసాలలో యముడు స్వైరవిహారం చేస్తూ ఉంటాడు. ఈ రెండు మాసాలు యముని కోరలు అన్నది శాస్త్రం (***కార్తీక మార్గశిరౌ యమదంష్ట్రౌ***). ఏ చిన్న రోగ మొచ్చినా, వచ్చింది చచ్చేందుకే అంటూ యముడు ప్రాణాల్ని



* పూజ్య స్వామీజీ గీతా జయంతి రోజు పుట్టారు. ఆ రోజే వైకుంఠ ఏకాదశి కూడా కలిసి వచ్చింది.



అమాంతం సంచిలో వేసుకొని పోతూ ఉంటాడు. ఇక హేమంత శిశిరాలలో శీతబాధ ఎలాగూ తప్పదు.

వసంత ఋతువు ఒక్కటే సుమ సౌరభాలను, ఫల సుగంధాలను వెదజల్లుతూ లోకాన్ని ఆనందింప చేస్తుంది. **వసన్తః పుష్ప సమయః పుష్పాణాం సమయః కాలః.** పూలు పూచే కాలము వసంతము. అందుకే అది కుసుమాకరము. **వర్ష తాప శైత్య రోగాదీనాం అభావాత్, స ఋతుః సుఖ మేవ జనయతి** - వర్షము, తాపము, శీతము, రోగాదులు ఉండవు కనుక వసంత ఋతువు సుఖాన్ని కలిగిస్తుంది. చెట్లన్నీ పచ్చని కాంతులతో, తరువు లన్నీ ఫలపుష్పాదులతో శోభాయమానంగా గోచరించే ఈ పవిత్ర వసంత ఋతువు లోనే ధర్మరూపుడైన శ్రీరామచంద్రుడు అవతరించాడు. ఈ విధంగా ఎన్నో అద్భుతాలకు ఆలవాలమైన వసంత ఋతువు ఈశ్వర విభూతిగా విరాజిల్లుతూ ఉంది.

**ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ ।**
**జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్ ॥** 36

**ద్యూతం-ఛలయతాం-అస్మి-తేజః-తేజస్వినాం-అహం**
**జయః-అస్మి-వ్యవసాయః-అస్మి-సత్త్వం-సత్త్వవతాం-అహం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | వ్యవసాయః | = | వ్యవసాయము |
| ఛలయతాం | = | మోసము చేసే వాటిలో | అస్మి | = | అయి ఉన్నాను |
| ద్యూతం | = | జూదమును | అహం | = | నేను |
| తేజస్వినాం | = | తేజోవంతుల | సత్త్వవతాం | = | సాత్త్వికుల యొక్క |
| తేజః | = | తేజస్సును | సత్త్వం | = | సత్త్వగుణమును |
| జయః | = | జయమును | అస్మి | = | అయి ఉన్నాను |
| అస్మి | = | అయి ఉన్నాను | | | |

**మోసగాళ్ళలో జూదము నేను. తేజోవంతులలో నేను తేజస్సును. నేను జయాన్ని ఉద్యమాన్ని సాత్త్వికులలో సత్త్వము నేనే.**

**వ్యాఖ్య**

### మోసాలలో జూదము

*ఛలః* అంటే మోసము, లేదా వంచన. 'మోసాలలో **(ఛలయతాం)** నేను జూదమును **(ద్యూతం అహం)**' అంటూ జూదాన్ని ఈశ్వర విభూతిగా వర్ణించాడు భగవంతుడు. జూదమును 'అక్షక్రీడ' అన్నది శాస్త్రం. అక్ష క్రీడను ఆడకూడ దని వేదం నిషేధం విధించింది. అలాంటి దానిని తన విభూతిగా భగవంతుడు అభివర్ణిస్తున్నాడు.

సూర్యోదయం కాగానే మంచివే గాక చెడు విషయాలు కూడా కనిపిస్తాయి. మంచిని స్వీకరించాలి. చెడును విస్మరించాలి. అన్నిటికీ ఆది కారణం ఒక్కటే అయినపుడు, దేనిని దేని నుండి వేరు చేయగలం? వేరు చేయ వలసింది ఏదైనా ఉంటే, దానిని మనస్సు నుండి వేరు చేయాలి. అదే ద్యూత ప్రస్తావనలో కేంద్ర విషయం.

జూదము ఆట కాదు. కుట్ర. ఆటైతే వినోదాన్ని పంచాలే గాని గుండెల్లో విషాదాన్ని దించ కూడదు. సుఖా న్నివ్వాలే గాని బ్రతుకుల్ని నాశనం చేయకూడదు. జూదం ఎందరి బ్రతుకుల్ని కాల రాచింది! ఎందరి జీవితాలలో దీపాలు ఆర్పేసింది! ఎన్ని రాజ్యాలను కూల్చేసింది! ఎందరు ప్రభువులను అడవుల పాలు చేసింది!

జూదము ధనాన్ని, ధర్మాన్ని రెండిటిని నశింప చేస్తుంది. జూదములో జయాపజయాలు లేవు. గెలుపు ఓటములు లేవు. అపజయమే ఉంది. అనర్థమే ఉంది. అపకీర్తి మాత్రమే ఉంది.

ఓడిన వాడు గెలిచిన వాడు కాడు, నిజమే. మరి గెలిచిన వాడు గెలిచిన వాడేనా? ఒకరిని దుఃఖానికి గురి చేసి మరొకడు సుఖాన్ని పొందడం వాస్తవానికి సుఖం క్రిందికి వస్తుందా? దుర్యోధనుడు గెలిచి ఏమి సాధించాడు? జూదంలో పాల్గొన్న వాడు ఎవడైనా, బ్రతుకులో ఓడిపోయిన వాడే కాని గెలిచిన వాడు కాడు.

పాకానికి ఉపయోగ పడిన అగ్ని మంచిది. మరి గృహ దహనం చేసిన అగ్ని చెడ్డదా? రెండూ ఒక్కటే కదా! భగవ ద్విభూతియే కదా! దేనిని వినియోగించు కోవాలో, ఎలా వినియోగించు కోవాలో తెలిసి ఉండాలి. అంతే.

జూదము ఈశ్వర విభూతి. దానిని మంచికి వినియోగించు కోవచ్చు. లేదా దారి తప్పి చెడుకు, మోసానికి, వంచనకు వినియోగించు కోవచ్చు. అలా దారి తప్పిన బుద్ధి చేసే వంచనే జూదము. అదే బుద్ధిని భగవంతుని విషయంలో ఉపయోగిస్తే, ఉత్తమ ఫలితాలను అందుకోవచ్చు, పరమాత్మనే గెలుచుకోవచ్చు అని తెలియ చెప్పడమే ద్యూతక్రీడా ప్రసంగము.

**తేజోవంతులలో తేజము**

తేజము అంటే ప్రభావము. ఎక్కడ ఏ విధమైన ప్రభావము గోచరించినా, అది భగవ ద్విభూతియే. ఆ ప్రభావము విద్యకు సంబంధించింది కావచ్చు, సాహిత్యం కావచ్చు, సంగీతం కావచ్చు, కళ కావచ్చు, నాట్యం కావచ్చు, వక్తృత్వము కావచ్చు, బలం కావచ్చు - ఏ ప్రభావమైనా, దాని యొక్క సమగ్ర స్వరూపమును కలిగి ఉన్న ఈశ్వరుని నుండే అందాలి కనుక తేజోవంతుల లోని తేజము ఈశ్వర విభూతి.

**జయ విభూతి**

జయము తెలియని వారు లేరు. అపజయ మెరుగని వారూ లేరు. వరద ప్రవాహంలో చిక్కుకొని కొందరు గట్టున పడతారు. కొందరు గుట్టుగా మునిగి పోతారు. గట్టున పడితే జయము. మునిగి పోతే అపజయము. జయాపజయాలలో మునిగి తేలే మానవాళి గొప్ప జయాన్ని పొందితే, ఆ వైభవము పరమేశ్వరునిదై ఉంటుంది. అందుకే అది జయ విభూతి.

**ఉద్యమ విభూతి**

ప్రయత్నం లేని వారు ఫలితాలను సాధించ లేరు. ప్రయత్నాన్ని 'ఉద్యమం' అంటారు. దానిని ప్రస్తుత శ్లోకంలో **వ్యవసాయః** అంటున్నాడు. సరియైన మార్గంలో చరించడమే ఉద్యమించడము. ఉద్యమము, సాహసము, ధైర్యము, బుద్ధి, శక్తి, పరాక్రమము - ఈ ఆరు లక్షణాలు ఎవరిలో ఉంటాయో, వారికి జయమే గాని అపజయము ఉండదు. ఈ జయ లక్షణాలు కల వారికి దైవ సహాయం ఉంటుంది ***(షడేతే యత్ర వర్తన్తే తత్ర దేవః సహాయకృత్).*** జయ లక్షణాలలో ప్రయత్నము మొదటిది. అది ఈశ్వర విభూతి.

**సాత్త్వికులలో సత్త్వము**

మాయ త్రిగుణాత్మికము. మాయను ఉపాధిగా కల వాడు ఈశ్వరుడు, లేదా మాయావి. మాయ తన ఉపాధే అయినా, అది తన అధీనంలో ఉంది. మాయలో రజోగుణ ముంది. తమోగుణ ముంది. కాని, అవి పరమేశ్వరునిలో లేవు. భగవంతుడు సర్వజ్ఞుడు కనుక ఆయన సత్త్వ స్వరూపము. శుద్ధ సత్త్వము. ఈ సత్త్వ ప్రభావం చేతనే ఆయన ముల్లోకాలను పాలిస్తున్నాడు.

అలాగే ఎవరైతే రజోగుణ, తమోగుణాల వలలో చిక్కకుండా సత్త్వ ప్రధానులై చరిస్తారో, వారి లోని సత్త్వము ఈశ్వర సంబంధ మైనది కనుక ఆ సత్త్వము ఈశ్వర విభూతి.





**వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనంజయః ।**
**మునీనా మ ప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః ॥** 37

**వృష్ణీనాం-వాసుదేవః-అస్మి-పాండవానాం-ధనంజయః**
**మునీనాం-అపి-అహం-వ్యాసః-కవీనాం-ఉశనా-కవిః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | మునీనాం | = | మునులలో |
| వృష్ణీనాం | = | యాదవులలో | వ్యాసః | = | వ్యాసుణ్ణి |
| వాసుదేవః | = | వాసుదేవుణ్ణి | కవీనాం | = | కవులలో |
| పాండవానాం | = | పాండవులలో | ఉశనాకవిః అపి | = | శుక్రాచార్యుణ్ణి |
| ధనంజయః | = | ధనంజయుణ్ణి | అస్మి | = | అయి ఉన్నాను |

**అర్జునా! యాదవులలో నేను వాసుదేవుణ్ణి. పాండవులలో అర్జునుణ్ణి. మహర్షులలో వ్యాసుణ్ణి. కవులలో శుక్రాచార్యుణ్ణి.**

**వ్యాఖ్య**

**యాదవులలో వాసుదేవుడు**

యాదవులలో వాసుదేవుడు తానే నట. వసుదేవుని కుమారుడు వాసుదేవుడు. ఆయనే శ్రీకృష్ణుడు ***(వసుదేవస్య అపత్యం).*** 'వాసుదేవ' నామంలో రెండు పదా లున్నాయి. రెండు పదాలు ఒకే వ్యక్తిని అభివర్ణిస్తున్నాయి.

***వాసుశ్చ అసౌ దేవశ్చ - వాసుదేవః -*** 'వాసువు', 'దేవుడు' అనే రెండు పదాలు కలిస్తే వాసుదేవుడు. జగత్తులో అందరి హృదయాలలో ఉండేవాడు కనుక ఆయన వాసువు **(వాసుః జగత్యాం సర్వ హృదయే వసతీతి వాసుః).** ప్రళయకాలంలో జగత్తు విలీన మైనపుడు, తానొక్కడే ప్రకాశిస్తాడు కనుక దేవుడు **(దేవః కల్పాంతే దీవ్యతీతి దేవః).** ఈ విధంగా సద్రూపుడై వాసువైన దేవుడు వాసుదేవుడు. గీతను బోధిస్తున్న వాడు.

**పాండవులలో ధనంజయుడు**

చెప్పే వాడే కాదు, వినే వాడు కూడా తానే నట. అతడే పాండవులలో ధనంజయుడు. అంటే, అర్జునుడు. ***ధనం జయతీతి ధనంజయః -*** రాజసూయ యాగ సమయంలో ధనమును విశేషంగా సాధించుకొని వచ్చాడు కనుక అర్జునుడు ధనంజయుడు. కానీ, ధనమును సాధించిన వాడు ధనమును పొందిన వాడు అవుతాడు. అంతేగాని, ధనమును జయించిన వాడు కాలేడు. కాని, అర్జునుడికి ధన స్పృహ లేదు. కామినీ కాంచనాలు అర్జునుని వశ పరచుకో లేక ఓడి పోయాయి. అందుచేత అర్జునుడు ధనంజయుడు. కనుకనే, గీతను శ్రవణం చేస్తున్నాడు. ప్రాపంచిక వ్యామోహాలు ఉండేవాడు మోక్ష ప్రధానమైన గీతా పీయూషమును పానం చేయలేడు. ఇదంతా ఈశ్వర వైభవము. చెబుతున్న గురువే శిష్యుడై వింటున్న వైనము.

**మునులలో వ్యాసముని**

చెప్పేవాడు, వినేవాడే కాకుండా వ్రాసేవాడు కూడా తానే నట. అతడే మునులలో వ్యాసముని. ***వ్యాసో నారాయణో హరిః -*** వ్యాసుడు సాక్షాత్తు నారాయణ స్వరూపుడు. సర్వ పదార్థ జ్ఞానం కల వారిలో వ్యాసుడు సాక్షాత్తు భగవంతుడే ***(సర్వ పదార్థ జ్ఞానినా మపి అహం వ్యాసః).***

వ్యాసుడు అమోఘమైన జ్ఞాన సంపన్నుడు. వేదములను విభజించి వేదవ్యాసు డయ్యాడు **(వ్యాసః విభజతే).** మహాభారతం, భాగవతం, అష్టాదశ పురాణాలతో సర్వ జ్ఞానము ఆయనకు ఉంది. కనుక ఆయన సర్వజ్ఞుడు.

పాటు బ్రహ్మసూత్రాలు రచించి సూత్రకారు డయ్యాడు. ఇంతటి జ్ఞానం ఉండబట్టే, సాక్షాత్తు భగవంతుడే బోధించిన భగవద్గీతను గ్రంథస్థం చేయ గలిగాడు. భగవద్గీతను బోధిస్తున్న గురువే శిష్యుడుగా ధనంజయుడై శ్రవణం చేస్తూ, తానే వ్యాసుడై గీతను రచించాడు. చెప్పిన వాడు తానే. వినినవాడు తానే. వ్రాసిన వాడూ తానే.

ఉత్తమ పురుషుడుగా వక్త యైన వాసుదేవుడు ***(అహం)***. మధ్యమ పురుషుడుగా శ్రోత యైన ధనంజయుడు ***(త్వం)***. ప్రథమ పురుషుడుగా రచయిత అయిన వ్యాసుడు ***(తత్)*** - అంతా ఏక వచనమే. ఏక రూపమే. ఏక స్వరూపమే. ఏకత్వమే. అద్వైతమే. అందుకే గీత అసమానమై, అద్భుతమై అలరారుతోంది. ***భవద్వేషిణీమ్*** అంటూ కీర్తింప బడుతోంది.

**కవులలో ఉశనుడు**

కవి అంటే క్రాంతదర్శి. త్రికాలవేత్త అని అర్థము. అలాంటి కవులు విపశ్చితులు. ఇంద్రియాలకు గోచరించని వాటిని దర్శించే వారు, అంటే అర్థం చేసుకొనే వారు. సూక్ష్మార్థ వివేకులు. అట్టి వారిలో ఉశనా కవి భగవ ద్విభూతి ***(కవీనాం క్రాంత దర్శినాం ఉశనా కవిః అహమస్మి)***.

ఉశనాకవి అంటే భృగునందనుడైన శుక్రాచార్యుడు. దైత్యులకు గురువు ***(దైత్యానాం గురుః)***. సదా అసురుల శ్రేయస్సునే వాంఛించే వాడు. అందుచేత అతనికి ***ఉశనా కవిః*** అనే పేరొచ్చింది ***(ఉశనాః వష్టి ఇచ్ఛతి దైత్య శ్రేయః ఇతి ఉశనాః)***. త్రికాలజ్ఞుడైన శుక్రాచార్యుడు దైత్యుల శ్రేయస్సు కోరుతూ ఉండినా, ఆయన మాట వినని కారణంగా దైత్యులు పరాజితు లయ్యారు. మహాజ్ఞాని అయిన శుక్రాచార్యుడు ***శుక్రనీతి*** అనే ధర్మశాస్త్రాన్ని కూడా రచించాడు.

**దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్ ।**
**మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥** 38

*దండః-దమయతాం-అస్మి-నీతిః-అస్మి-జిగీషతాం*
*మౌనం-చ-ఏవ-అస్మి-గుహ్యానాం-జ్ఞానం-జ్ఞానవతాం-అహం*

| | | | |
|---|---|---|---|
| అహం | = నేను | అస్మి | = అయి ఉన్నాను |
| దమయతాం | = దండించే వారిలో | గుహ్యానాం | = రహస్యములలో |
| దండః | = దండము | మౌనం చ ఏవ | = మౌనమును |
| అస్మి | = అయి ఉన్నాను | జ్ఞానవతాం | = జ్ఞానము గల వారిలో |
| జిగీషతాం | = జయము కోరే వారిలో | జ్ఞానం | = జ్ఞానమును |
| నీతిః | = నీతిని | అస్మి | = అయి ఉన్నాను |

**అర్జునా! దండించే వారిలో దండాన్ని నేను. జయము కోరే వారిలో నీతిని. రహస్యాలలో నేను మౌనం. జ్ఞానవంతులలో జ్ఞానము నేనే.**

**వ్యాఖ్య**

**దండించే వారిలో దండము**

సమాజ అభ్యుదయానికి శిక్షణ ఎలా ప్రధానమో, శిక్ష కూడా అలాగే ప్రధానము. క్రమశిక్షణ ఉన్నప్పుడే సమాజం ప్రగతి వైపు నడుస్తుంది. ధర్మాన్ని అతిక్రమించే వారిని శిక్షణలో ఉంచడానికి ఉపయోగపడే శిక్షా కార్యము లేదా దండన క్రియ భగవ ద్వైశ్వర్యమే. నియతిని కాపాడుతూ ఉంది కనుక అది విభూతి.

శిక్షణ నివ్వడానికి లేదా శిక్షించడానికి ధర్మశాస్త్రా లున్నాయి. ధర్మం దైవ స్వరూపము కనుక ధర్మ





శాస్త్రాల రూపంలో ఉన్నది కూడా దైవమే. దైవ విభూతియే. కనుక, దండనీతి భగవ త్స్వరూపము.

దండము అనే పదానికి రెండు అర్థా లున్నాయి. ***దండయతీతి దణ్డః*** - అంటే దండించువాడు. ***దండోఽస్యాస్తీతి దండః*** - అంటే దండము చేతిలో కలవాడు అని అర్థము. దండించేవాడు, దండనక్రియ, దండనీతి - అన్నీ సమాజ కళ్యాణానికి దోహద పడుతున్నాయి కనుక అవన్నీ ఈశ్వర వైభవాలే.

**జయించే వారిలో నీతి**

జయించాలి అనే కోరిక గల వారిలో ***(జిగీషతాం జేతుమ్ ఇచ్ఛతామ్)*** భగవంతుడు నీతి ***(నీతిః)***. నీతి అంటే న్యాయము. ఆచార వ్యవహారాలలో పాటించ వలసిన ధర్మము. జయము కోరే వారికి జయోపాయం తెలియాలి. న్యాయం తప్పకుండా, ధర్మం తప్పకుండా ప్రవర్తించడమే జయానికి ఉపాయము. ***ధర్మ మేవ జయతే*** - ధర్మానికి జయమే కాని అపజయం తెలియదు. రాజదండము ఎంత ప్రధానమో, రాజనీతి కూడా అంత ప్రధానము. దండనీతి - రాజనీతి పరస్పరాధీనంగా ఉంటాయి. కనుక అవి ఈశ్వర విభూతులు.

**రహస్యాలలో మౌనం**

రహస్యాలను రక్షించుకోవడానికి మౌనమే ఉపాయము. అందుచేత గోపన హేతువైన మౌనం ఈశ్వర విభూతి. కొందరు విలువైన సంపదలను దాచుకుంటారు. అది రక్షణ అని భావిస్తారు. కాని, మౌనం అలవడని కారణంగా వారికి తెలియకుండానే రహస్యాన్ని బహిర్గతం చేసి, దొంగతనానికి అవకాశ మిచ్చి, ఆ తరువాత దాచుకున్నది పరులు దోచుకు పోయారని దుఃఖిస్తూ కూర్చుంటారు. దాచుకున్నది ఎంత విలువైన దైనా కావచ్చు. దానిని రక్షించుకోవడానికి ఉపయోగపడే మౌనము అంతకన్నా విలువైనది. అట్టి మౌనము ఈశ్వర విభూతి ***(గుహ్యానాం మౌనం అహమస్మి)***.

దైవ విభూతి కావడం చేత మౌనం దివ్యమైన ఫలితాలను ప్రసాదిస్తుంది. మౌనంగా ఉండ గలిగితే కలహాలు తలెత్తవు. అపార్థాలు అగుపించవు. అసత్య భాషణం ఉండదు. కాలహరణం జరగదు. నిన్ను నీవు చూసుకొనే అవకాశం కలుగుతుంది. ఘర్షణలు బాహ్యంలో ఉండవు కనుక ఆంతర్యం కూడా ప్రశాంతంగా ఉంటుంది.

**జ్ఞానవంతులలో జ్ఞానము**

జ్ఞానులలో జ్ఞానము పరమేశ్వరుడే. ఇక్కడ జ్ఞానము అంటే మోక్షసాధన మైన జ్ఞానము. ఆత్మయే బ్రహ్మము అనే బ్రహ్మాత్మైక్య విషయ జ్ఞానము. సర్వ అజ్ఞాన విరోధి అయిన జ్ఞానము. సాక్షాత్కార రూప జ్ఞానము. ఈశ్వరుడు, ఈశ్వర జ్ఞానము వేరు కానందున, జ్ఞానవంతుల హృదయాలలో నిక్షిప్తమై ఉన్న ఆత్మజ్ఞానము ఈశ్వర విభూతియే.

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున ।** 39
**న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్ ॥**

*యత్-చ-అపి-సర్వభూతానాం-బీజం-తత్-అహం-అర్జున*
*న-తత్-అస్తి-వినా-యత్-స్యాత్-మయా-భూతం-చరాచరం*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = అర్జునా! | బీజం | = ఉత్పత్తి కారణము |
| సర్వభూతానాం | = సకల భూతములకు | తత్ అపి చ | = అది కూడా |
| యత్ | = ఏది | అహం | = నేనే |

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = | ఏ | స్యాత్ | = | అగునో |
| చరాచరం | = | చరాచర రూపమైన | తత్ | = | అట్టిది |
| భూతం | = | భూతసమూహము | న అస్తి | = | లేదు |
| మయా వినా | = | నేను లేకుండా | | | |

**అర్జునా! సర్వ ప్రాణుల పుట్టుకకు కారణమైన బీజము నేనే. ఈ చరాచర ప్రపంచంలో నేను లేని వస్తువే లేదు.**

**వ్యాఖ్య**

పరమేశ్వరుని విభూతులు దివ్యములని భగవంతుడే స్వయంగా చెప్పాడు **(దివ్యాహ్యాత్మ విభూతయః)**. దివ్యమైన ఈశ్వర విభూతులను పరమేశ్వరుని నుండే ఆలకించ గలగడం గీతా భక్తుల అదృష్టము. ఇరవయ్యవ శ్లోకంలో విభూతుల వర్ణనమును ప్రారంభించి ఏకధాటిన ఇరవై శ్లోకాలలో వాటిని వివరించిన గీతాచార్యుడు, సర్వ విభూతుల సారంగా బీజ విభూతిని గూర్చి ప్రవచించి ఈ శ్లోకం వద్ద విభూతులను సమాప్తం చేస్తున్నాడు.

**బీజ విభూతి**

బీజము అంటే విత్తనము. కారణాన్ని బీజము అంటారు. మొలకెత్తే శక్తి బీజంలో ఉంటుంది. అలాగే సర్వ భూతాలకు ప్రరోహ కారణమైన భగవానుడు సృష్టికి ఆదిబీజము. ఆయన నుండే సృష్టి ఆవిర్భవించింది. ఈ సృష్టిలో ఉన్నదంతా ఈశ్వర జ్ఞానమే. అందుచేత, ఆది బీజమైన భగవంతుడు ఈ సృష్టికి నిమిత్త కారణ మయ్యాడు.

నిద్రించి నపుడు మనం స్వప్న ప్రపంచాన్ని సృష్టించు కుంటాము. మనం సృష్టించుకొనే కలను ఏ వస్తువుతో తయారు చేసుకుంటాము? మన జ్ఞానం తోనే సృష్టించు కుంటాము. మనది కాని విషయం కలలో లేదు. కల లోని జ్ఞానము మనదే కనుక, మన కల మనకే అర్థ మవుతుంది. ఒకరి కల మరొకరికి అర్థం కాదు.

కల లోని విషయాలన్నీ మార్పు చెందు తున్నాయి. మేలుకున్న తరువాత లేకుండా పోతున్నాయి. అయినా, కలకు సంబంధించిన జ్ఞానము మన కుంది. కల మార్పు చెందినా, మేలుకున్న తరువాత మాయమైనా, కలగన్న నాలో, నీలో ఏ మార్పు లేదు. కలను తయారు చేసుకోవడానికి మనం మారలేదు. కలలో ఏవేవి జరుగుతున్నా, మనలో ఏ మార్పు లేదు. మేలుకున్న తరువాత కల లోని నామరూపాలు మాయమై పోయినా మనం మారలేదు.

కల గనే టప్పుడు కలలో ఉన్నది మన చైతన్యమే. మన జ్ఞానమే. మన జ్ఞానమే ఏ విధమైన మార్పుకు లోను కాకుండా కల కనడానికి కారణమైంది. బీజమైంది. అంటే, సంభవ కారణమైంది.

అలాగే, ఈశ్వర జ్ఞానమే తనలో ఏ విధమైన మార్పు లేకుండా ప్రపంచ సృష్టి, స్థితి, లయాలకు కారణమైంది. అందుచేత, చెట్టుకు కారణం విత్తన మైనట్లు, సర్వ భూతాల ఉత్పత్తికి పరమేశ్వరుడు బీజ మయ్యాడు. కారణ మయ్యాడు. కాకపోతే, చెట్టుకు కారణమైన బీజము అంకురించిన తరువాత నశిస్తుంది. కాని, పరమేశ్వరుడు అవ్యయుడు కనుక నశించడు. కలకు బీజమైన మన చైతన్యము, కల కారణంగా ఎలా నశించడం లేదో, సృష్టికి బీజమైన పరమేశ్వరుడు సృష్టి కార్యం వల్ల నశించడం లేదు. అందుచేత, ఆయన అవ్యయ బీజము అని తొమ్మిదవ అధ్యాయంలో అర్థం చేసుకున్నాం *(9 - 18)*.

**అనన్య విభూతి**

స్వప్నానికి కారణమైన మన జ్ఞానము స్వప్నంలో లేని దెక్కడ? ఎక్కడైనా లేదు అని చెబితే, స్వప్నం లేదు అని చెప్పినట్లే అవుతుంది. స్వప్నంలో అంతటా స్వప్న ద్రష్ట జ్ఞానమే ఉంది. ఒకవేళ మన జ్ఞానం లేకుండానే స్వప్నం నడుస్తూ ఉంది అంటే, మేలుకున్న వాడు కల గంటున్నాడు అని చెప్పినట్లే అవుతుంది. అది సాధ్య





మేనా? పగటి కలలు, ఊహాలోకాలు మేలుకున్న వాని ఊహలే గాని, కల లోని విషయాలు కావు. కనుక కల గనే వాని జ్ఞానం లేకుండా, కలలో ఏ దృశ్యమూ ఉండలేదు.

అర్జునా! ఏది నేను లేకుండా ఉంటుందో **(యన్మయా వినాస్యాత్)**, అట్టిది **(తత్)** లేనే లేదు **(న అస్తి)**. నేను ఉంటేనే ఏదైనా ఉంటుంది. నేను లేకుండా ఏదైనా ఉన్నది అంటే, అది వాస్తవానికి లేనిదే **(మయా వినా యత్ భూతం చరాచరం స్యాత్, తన్నాస్తి)**. దాని అర్థం ఏమిటి? అంతా సదాత్మకమే, మదాత్మకమే వని **(అతః మదాత్మకం సర్వం స్యాత్)**. ఇదే విభూతి వైభవము. విభూతి యోగము. యోగవిభూతి.

*ఇంత వైభవంగా ప్రవచించినా, తాను చెప్పిన దంతా ఏకదేశమే నట. వినండి.*

**నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।**
**ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా ॥** 40

**న-అంతః-అస్తి-మమ-దివ్యానాం-విభూతీనాం-పరంతప**
**ఏషః-తు-ఉద్దేశతః-ప్రోక్తః-విభూతేః-విస్తరః-మయా**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప | = | అర్జునా! | ఏష తు | = | ఇది |
| మమ | = | నా యొక్క | మయా | = | నా చేత |
| దివ్యానాం | = | దివ్యములైన | విభూతేః | = | విభూతి యొక్క |
| విభూతీనాం | = | విభూతులకు | విస్తరః | = | వివరణము |
| అంతః | = | అంతము | ఉద్దేశతః | = | సంక్షేపముగ |
| న అస్తి | = | లేదు | ప్రోక్తః | = | చెప్పబడినది |

**పరంతపా! అర్జునా! నా విభూతులు దివ్యములు. వాటికి అంతము లేదు. ఏదో నామ మాత్రంగా కొన్ని విభూతుల్ని వివరించాను.**

**వ్యాఖ్య**

**ముగింపు లేదు - ఇక ముగిస్తాను**

దివ్యములైన **(దివ్యానామ్)** నా విభూతులకు **(మమ విభూతీనామ్)** అంతము లేదు **(అన్తః నాస్తి)** అంటున్నాడు భగవానుడు.

'అర్జునా! నువ్వు అడిగావు కనుక నా విభూతులను వివరించడానికి ప్రారంభించాను. చెప్పాను. ఎంత చెప్పినా విభూతులు సమాప్తం కావడం లేదు. సంక్షేపంగా చెప్ప గలిగానే గాని సంపూర్ణంగా చెప్పలేక పోయాను. విభూతులు సమాప్త మయ్యేలా లేవు. అందుకని, నేనే విభూతి యోగాన్ని సమాప్తం చేస్తున్నా' అంటున్నాడు.

నిజమే కదూ? ఆయన బోధించేవి ఎవరి విభూతులు? ఆయన విభూతులే. ఆయనకు అంత ముందా? ఎలా ఉంటుంది? ఆయన అనంతుడు కదా! ఆయనకు ఎలా అంతం లేదో, ఆయన విభూతులకు కూడా అంతం లేదు.

అంతా చెప్పడానికి విభూతులకు అంతం లేదు కాబట్టి, 'అ' తరువాత వచ్చేది 'ఇ' కనుక, 'ఇంతే' అని చెప్పి అంతా చెప్పేసినట్లు చెయ్యి దులుపు కుంటున్నాడు. ఇదేమి చోద్యము? 'అంతా' చెబుతానని 'ఇంతే' అనడము!

ఇంతే అంటే అంతా చెప్పినట్లే. 'ఇంతే' (విభూతి) సంగతులు అనడం లేదు. ఇంతవరకు మాత్రమే చెప్ప

గలిగాను అంటున్నాడు. **ఇయత్తా** అంటే ఇంత. 'ఉన్నది ఇంతే' అనడం లేదు. 'చెప్ప గలిగింది ఇంతే' అంటున్నాడు.

**ఇంతే అని సరిపెట్టలేను**

**ఇంత మాత్రమే అని సరిపెట్టుకో!**

'అర్జునా! విస్తారంగా విభూతులను చెప్పి వాటిని సరిపెట్టలేను. నిన్ను సంతృప్తి పరచనూ లేను. కొంతవరకు చెప్పాను ***(ఉద్దేశతః ఏకదేశేన ప్రోక్తః).*** అంతటితో నీవే సరిపెట్టుకో' అంటున్నాడు అచ్యుతుడు.

వినే వాడు మాత్రం తక్కువ తిన్నాడా! చెప్పలేను అని ఇప్పుడు అంటున్నావు. చెప్పలేని దానిని మొద లెట్టడం దేనికి? నేను అడిగాను కనుక చెప్పాను అంటున్నావు. అడగటం నా వంతు. నేను అడిగాను. చెప్పలేను అని ఇప్పుడు చెప్పినట్లు, అప్పుడే నాతో చెప్పి ఉండొచ్చుగా! తగుదునమ్మా! అంటూ తంబుర శ్రుతి చేయడ మెందుకు? కథ మొదలెట్టి అడివికి చేర్చి, ఆ తరువాత తెలియదంటే ఇంటికి చేరే దెలా? ఏం చేద్దాం! చెప్పే వాడికి వినేవాడు లోకువ అనే సామెత ఊరకే ఊడి పడిందా?

ఓరీ, పిచ్చి పార్థా! నీకు సవిస్తరంగా చెబుతాను అని నే నెప్పుడన్నాను? నేను ఏం మాట్లాడానో ఒకసారి టేపు రీవైండ్ చేసుకొని మళ్ళీ విను! నా విభూతులకు అంతము లేదు, ప్రాధాన్యతను దృష్టిలో ఉంచుకొని చెబుతాను అని ముందుగా చెప్పే కదా విభూతి ప్రసంగం ప్రారంభించాను *(10 వ అ - 19 వ శ్లో).* అన్నీ చెబుతాను అని నేను అనలేదు. కొన్ని విభూతులను మాత్రమే చెప్పి, అసలు ఈశ్వర విభూతిని ఈ విశ్వంలో ఎలా గుర్తించాలో, గ్రహించాలో, దర్శించాలో తెలియ చేద్దామనే ఉద్దేశం తోనే ప్రసంగం ప్రారంభించాను. అనుకున్నది అయిపోయింది, ముగింపు పలికాను. అర్థమైందా!

*మరి, భగవద్విభూతిని గుర్తించేది ఎలా? చెబుతాను, విను!*

**యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా ।**
**తత్త దే వావగచ్ఛ త్వం మమ తేజోఽ౽ంశ సమ్భవమ్ ॥** 41

***యత్-యత్-విభూతిమత్-సత్త్వం-శ్రీమత్-ఊర్జితం-ఏవ-వా***
***తత్-తత్-ఏవ-అవగచ్ఛ-త్వం-మమ-తేజోఽ౽ంశసంభవం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| విభూతిమత్ | = | విభూతియుక్త మైనది | మమ= | | నా యొక్క |
| శ్రీమత్ | = | కాంతియుతము | తేజోఽ౽ంశసంభవం ఏవ | = | తేజస్సు యొక్క అంశము వలన కలిగినదే |
| ఊర్జితం ఏవ వా | = | ఉత్సాహముతో గూడినది | త్వం | = | నీవు |
| యత్ యత్ | = | ఏయే | అవగచ్ఛ | = | తెలుసుకో! |
| సత్త్వం | = | సత్త్వము | | | |
| తత్ తత్ | = | అది అంతయు | | | |

**పార్థా! దేనిలో వైభవ ముందో, దేనిలో ఐశ్వర్య ముందో, దేని యందు ఉత్సాహం అతిశయించి ఉందో - అవన్నీ నా తేజస్సు లోని అంశాలే నని తెలుసుకో!**

**వ్యాఖ్య**

కొండంత దేవుణ్ణి కళ్ళతో చూచే దెలా? కొండ అద్ద మందు కొంచెమై ఉండదా! అనే సూక్తిని ఆధారం చేసుకొని కొండకు అభిముఖంగా అద్దం పెట్టి చూడటమే. స్థాలీపులాక న్యాయం ఉండనే ఉంది కదా! అన్నం





ఉడికిందో, లేదో తెలి యడానికి మెతుకు మెతుకు చేతికి అతుక్కోవాలా? ఒక్కటి పట్టుకుంటే సరిపోదా! ***ఈశావాస్య మిదం సర్వం . . . బ్రహ్మైవేదం సర్వం -*** ఈశ్వరుడు కాని దేముంది? ముందు వైభవాల్లో ఈశ్వరుణ్ణి చూడ గలిగితే, ఆ తరువాత అంతటా చూడవచ్చు.

అదిగో సౌందర్య విభూతి! అదిగదిగో పరాక్రమ విభూతి! ఇదిగో జ్ఞాన విభూతి! ఇదిగిదిగో ప్రేమ విభూతి! అల్లదిగో త్యాగ విభూతి! అది - ఇది అననేల? అన్నీ ఈశ్వర విభూతులే. పరమేశ్వరు డనే సాగరంలో ఎగిసిపడే అలలే. మరి, వైభవాలు విభూతు లైతే, వైభవం లేని జడాల విషయ మేమిటి? అవి కూడా విభూతులే. జడ విభూతులే. ఎక్కడైనా కూర్చుని పడుకోవాలి. ముందుగా ప్రభావము గల వాటిలో చూడ గలిగితే, ఆ తరువాత అంతటా దర్శించ వచ్చు.

**పల్లవి: నీవే - నీవే - నీవే - నీవే - నీవే**
**నా యెద కదిపిన కళ నీవే ॥ నీవే ॥**
**చరణము: ప్రేమలు ప్రాకిన పందిరి నీవే**
**కలలు కరిగితే ముందర నీవే**
**బ్రతుకు లోని అందము నీవే**
**అందీ అందని చందము నీవే ॥ నీవే ॥**

అని ఈశ్వర వైభవాన్ని నోరార పలికింది చైతన్య గీతిక.

*పరమేశ్వర వైభవము వాస్తవానికి జగత్తుకు అతీతంగా ఉంది అంటూ సమాప్తం చేస్తున్నాడు.*

**అథవా బహు నైతేన కిం జ్ఞాతేన తవార్జున ।**
**విష్ట భ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥** 42

***అథవా-బహునా-ఏతేన-కిం-జ్ఞాతేన-తవ-అర్జున***
***విష్టభ్య-అహం-ఇదం-కృత్స్నం-ఏకాంశేన-స్థితః-జగత్***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = | అర్జునా! | అహం | = | నేను |
| అథవా | = | ఇంతేగాక | ఇదం | = | ఈ |
| బహునా | = | విశేషమైన | కృత్స్నం | = | సమస్తమైన |
| ఏతేన | = | ఈ | జగత్ | = | జగత్తును |
| జ్ఞాతేన | = | తెలియడం చేత | ఏకాంశేన | = | ఒక అంశము చేతనే |
| తవ | = | నీకు | విష్టభ్య | = | వ్యాపించి |
| కిం | = | ఏమి లాభము | స్థితః | = | ఉన్నాను |

**అర్జునా! ఇలా విశేషంగా తెలుసుకోవడం వల్ల నీకు ఒరిగే దేముంటుంది? నా ఒక్క అంశం చేత ఈ ప్రపంచ మంతా నేను వ్యాపించి ఉన్నాను.**

**వ్యాఖ్య**

ఈశ్వరుని విభూతులను అద్భుతంగా వివరించి, చివరగా, ఇవన్నీ తెలియడం వల్ల నీకు ఏమి ప్రయోజనం? అని **కిం** పద ప్రయోగం చేశాడు. ఇక్కడ **కిం** శబ్దము ఎంతో చెబుతుంది.

ఎంత విన్నా, ఎంత కాలం విన్నా, ఎంత తెలిసినా, ఎన్ని తెలిసినా, విన వలసిందే మిగిలి ఉండే టప్పుడు,

తెలిసిన దాని కన్నా తెలుసుకోవలసిందే అధికంగా ఉండే టప్పుడు, వినడం లేదా తెలుసుకోవడం వల్ల ప్రయోజన మేమిటి? అనేది ***కిం*** పదం సంధించే ప్రశ్న.

విభూతు లన్నీ జగత్తు లోనే ఉన్నాయి. జగత్తు తనలో ఒక అంశమే నట. ***పాదోఽ స్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి*** అని కదా వేదం లోని పురుష సూక్తము! ఎంత తెలిసినా సశేషమే మిగిలే టప్పుడు తెలుసుకొని ప్రయోజన మేమిటి? ***(కిమ్?).*** సశేషం కనుక తెలుసుకో నవసరం లేదు అనేదే గనుక భగవంతుని అభిమత మైతే, విభూతి యోగాన్ని ఎందుకు చెబుతాడు? ***(కిమ్?).*** ఎంత తెలిసినా సశేషమే కనుక, నిశ్శేషంగా తెలుసుకొనే మార్గం చెబుతాను అంటున్నాడు. ఏమిటది? ఈ జగత్తు నా ఒక్క అంశమే. కనుక ఇవన్నీ దేని విభూతులో, దేనిలో జగత్తు కేవలం ఒక భాగమో, దాని నొక్క దానిని తెలుసుకోవడమే నిశ్శేషంగా తెలుసు కోవడము అవుతుంది అంటున్నాడు.

అనంతమైన ఆ పరమాత్మ స్వరూపము తెలిసి నపుడు, ఏకాంశమైన ఈ విభూతులను తెలుసుకొని ప్రయోజన మేముంది? ***(కిమ్?).*** అనంత పరబ్రహ్మము తెలియ నపుడు ఇవన్నీ తెలుసుకొని మాత్రం ప్రయోజన మేమిటి? ***(కిమ్?).*** కనుక, తెలియ వలసింది, తెలియదగింది ఒక్క నిర్విశేష పరబ్రహ్మమే అనేది విభూతియోగ సారము.

బ్రహ్మాత్మ జ్ఞానము బుద్ధి యందు స్థిరపడాలి. మనస్సు బాహ్యంలో చరించ వలసి వచ్చినా, చలించకుండా ఉండేందుకు, కేవలం పరమాత్మ జ్ఞానమే, పరమాత్మ దృష్టియే ముముక్షువులో నిలిచి ఉండేందుకు, ప్రత్యేకించి ఈ విభూతి యోగము చెప్పబడింది.

***శ్లో॥*** *ఇంద్రియ ద్వారత శ్చిత్తే బహిర్ధావతి సత్యపి ।*
*ఈశ దృష్టి విధానాయ విభూతీ ర్దశమేఽ బ్రవీత్ ॥*

చంచలమైన చిత్తము ఇంద్రియాల ద్వారా బహిర్ముఖమైనా, ఆయా బాహ్య విషయాల యందు కూడా ఈశ్వర భావననే స్థిరపరచు కొనేందుకు ఈ విభూతి యోగము అనే పదవ అధ్యాయము చెప్పడం జరిగింది అని శ్రీధరీయం.

**ఓం నమో భగవతే వాసుదేవాయ**

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విభూతి యోగో నామ దశమోఽ ధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు విభూతి యోగ మనే పదవ అధ్యాయము.**





# చైతన్య భగవద్గీత

## అథ ఏకాదశోఽ ధ్యాయః - పదకొండవ అధ్యాయము

## విశ్వరూప సందర్శన యోగః - విశ్వరూప సందర్శన యోగము

**విశ్వ - రూప - సందర్శన - యోగము**

విశ్వమును విశ్వరూపునిగా దర్శించే ఉపాయమే విశ్వరూప సందర్శన యోగము. ఈ అధ్యాయం పేరులో నాలుగు పదాలున్నాయి. ఈ నాలుగు పదాలూ మనకు అర్థం కావలసి ఉంది.

ఇక్కడ ప్రధానంగా జరిగే 'సందర్శనము' అనే అనుభవము రూప దర్శనమా? లేక స్వరూప దర్శనమా? ఇక్కడ 'విశ్వరూపము'ను దర్శించడం అంటే, విశ్వము యొక్క రూపమును దర్శించడమా? లేక విశ్వములో విశ్వేశ్వరుని దర్శించడమా? లేక విశ్వేశ్వరునిలో విశ్వమును దర్శించడమా?

**విశ్వము - విశ్వరూపము**

***వివిధ ప్రత్యయ గమ్యం విశ్వమ్*** - అనేక విషయాలను కలిగి ఉన్నది, ఆ విషయాలకు సంబంధించిన పరిజ్ఞానంతో అర్థ మయ్యేదే విశ్వము. ప్రపంచ మంతా కలిస్తేనే విశ్వము. విశ్వమే అలా ఉండే టప్పుడు ఇక విశ్వం కన్నా వేరుగా వ్యక్తి లేడు, ఉండలేడు అని ప్రత్యేకించి చెప్ప నవసరం లేదు.

ఇంతవరకు, విశ్వాన్ని అర్థం చేసుకొనే ప్రయత్నంలో విశ్వాన్ని నిర్వచించి చెప్పుకున్నాం. ఇకపోతే, విశ్వం యొక్క అర్థం విశ్వం లోనే ఉందా? విశ్వము యొక్క పరమార్థం విశ్వమేనా? అనే సందేహం ఉదయించి నపుడు విశ్వం యొక్క అర్థం విశ్వంలో లేదేమో అనిపిస్తుంది.

***ఐతదాత్మ్యం ఇదం సర్వం*** - నాయనా! శ్వేతకేతూ! ఈ సమస్త ప్రపంచము యొక్క అర్థము, లేక సత్యరూపము సద్వస్తువు లోనే, అంటే పరమాత్మ లోనే ఉంది అంటూ, అద్భుతమైన విషయాన్ని ఆవిష్కరించాడు ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక మహర్షి *(ఛాం : 6 - 9 - 4).* మట్టిపాత్రలు ఎన్నున్నా, వాటి యొక్క అర్థం మట్టి లోనే ఉన్నట్లు, వివిధ ప్రత్యయ గమ్యమైన విశ్వం యొక్క అర్థం విశ్వరూపుని లోనే ఉంది. విరాడ్రూపుని లోనే ఉంది. విరాట్పురుషుని లోనే ఉంది.

***వివిధం రాజతే ఇతి విరాట్*** - వివిధ రూపాలలో గోచరించే వాడు కావడం చేత ఆయన విరాట్పురుషుడు. ఆయన విశ్వమంతా వ్యాపించి ఉన్నాడు ***(విశ్వతః వృత్వా వ్యాప్య).*** రూపాన్ని, కాలాన్ని, దేశాన్ని, దేనినీ వదలకుండా వ్యాపించి ఉన్నాడు అని అర్థము. మట్టి పాత్రలలో ఉన్నదంతా మట్టే అయినా, అవి వివిధములైన నామరూపాలతో తెలుస్తున్నాయే గాని, అద్వయమైన మట్టిగా అర్థం కావడం లేదు. భిన్నత్వం లోని ఏకత్వం అనుభవానికి అందడం లేదు. భిన్నత్వాన్ని చూడటం దర్శన మైతే, భిన్నత్వంలో ఏకత్వాన్ని వీక్షించడం సందర్శనము ***(సందర్శనం, సమ్యక్ దర్శనం).*** అనేక రూపాలతో గోచరించే ఈ విశ్వమును ఏకరూపుడైన విశ్వమూర్తిలో దర్శించాలనే ఆశ అర్జునునిలో కలిగింది. ఆ ఆశే అద్భుతమైన ఒక అధ్యాయానికి శ్రీకారం చుట్టింది.

ఆశ అయితే బాగానే ఉంది. కానీ వివిధ ప్రత్యయ గమ్యమైన విశ్వము అర్జునునికి కనిపిస్తూనే ఉంది కదా! ఒక వైపు విశ్వం కళ్ళెదుట కదుల్తూ ఉండినా, ప్రత్యేకంగా విశ్వరూపాన్ని చూడా లంటాడు ఎందుకని?